డాక్టర్ బి.వి.రామన్ జ్యోతిష గ్రంథావళి

# అష్టకవర్గ పద్ధతి

ఆంగ్లమూలం: డాక్టర్ బి.వి.రామన్

తెలుగు సేత: కే.వి.మల్లికార్జునరావు



అష్టకవర్గు పద్ధతి

ఆంగ్ల మూలం : (అష్టకవర్గ సిస్టమ్ ఆఫ్ ప్రిడిక్షన్)
డాక్టర్ బి.వి.రామన్

తెలుగు సేత : కే. వి. మల్లికార్జునరావు

ప్రథమ ముద్రణ
అక్టోబరు, 1997

ప్రచురణకర్తలు
అకుల పవన్‌కుమార్
ఋషి ప్రచురణలు
గాంధీనగర్,
విజయవాడ - 520 003
ఫోన్ : 435023

వెల
రు. 36-00



# విషయసూచిక

# ఎనిమిదవ ముద్రణకు ముందుమాట

ఈ ఎనిమిదవ ముద్రణలో చాలా చక్రాలు హెచ్చు ఖచ్చితంగా వుండుట నిర్ధారణ చేసుకోవటం కోసం పునస్సాధన చేయబడ్డాయి.

హిందూ జ్యోతిషంకి చెందిన అద్వితీయమైన అంశమగు "పరిశోధ నాత్మక పునాదితో అష్టకవర్గు పద్ధతిలో జోస్యము చెప్పుట" అనుదానిని జ్యోతిష ప్రజానీకానికి ఈ పుస్తకం కలుగజేస్తుందని ఆశించబడుతున్నది.

విధేయతతో కూడిన నాయొక్క జ్యోతిష లిఖితములను విద్యావంతులైన ప్రజలు ఎల్లప్పుడూ ఆహ్వానించారు. వారియొక్క ఎడతెగని అవలంబనను నేను కోరుకుంటున్నాను. వారే నాకు ఉత్తమ న్యాయ నిర్ణేతలు, విమర్శకులు.

బెంగుళూరు,
1-2-1992.

బి. వి. రామన్

# మొదటి ప్రచురణకు ముందుమాట

అమితమైన పత్రికా వ్యాసంగము, పుస్తక ప్రచురణగల ఈ రోజుల్లో, జ్యోతిషంపై పుస్తకం వ్రాయాలనే ఉద్దేశ్యంని ప్రతిఫలింపజేసే ఏ వ్యక్తి అయినా ఆ విధంగా చేయటంలోగల తన భావనని గ్రహించాలి. లేకపోతే తాను ప్రజానీకానికి విధించిన దండనకు ఒక విధమైన క్షమాపణ చెప్పుకునే వ్యాఖ్యానంని ఆహ్వానించాల్సి వుంటుంది. ప్రత్యేకంగా అష్టకవర్గును నిర్వహించు ఒక పుస్తకము కోసం కొంతకాలం నుండి నా పాఠకులు చాలా మంది గట్టిగా పట్టుబడుతున్నారు. వారి అక్కఱ నెరవేర్చుటకు ఈ పుస్తకం ఉద్దేశింపబడింది.

నేను షుమారుగా 35 సంవత్సరముల నుండి జ్యోతిషంలో విద్యార్థిని. విధేయతగల నా స్వంత మార్గంలో ముఖ్యంగా ప్రాచీన సాంప్రదీయ మూలము నుండి ఉత్పాదింపబడిన జాతక వివరణకు చెందు వివిధ పద్ధతులను నేను పరీక్షించాను. అష్టకవర్గు పద్ధతికి చెందు వివరణము ఈ పుస్తకంలో ప్రయత్నింపబడినది. ఇది (ఈ పద్ధతి) చాలా కాలంనుండి నా శ్రద్ధను ఖరారు చేసుకుంది. హిందూ జ్యోతిషంకి చెందు సాధారణ పద్ధతిలో ఇది ఒక ముఖ్యమైన స్థానము ఆక్రమించి వుంది. ముఖ్యంగా సంఘటనలు - సమయ నిర్ధారణకు సంబంధించి ఇంకా హెచ్చు పరిశోధనలు చేసే, విజ్ఞాన శాస్త్రంవైపు మళ్ళిన మనసుగల జ్యోతిష విద్యార్థికి ఈ అష్టకవర్గు పద్ధతి తగినంత అవకాశం సమర్పిస్తుంది. అమితమైన నా సేకరణల నుండి గ్రహింపబడిన చాలా జాతకాలు అష్టకవర్గు ఆధారంగా పరిశీలించబడ్డాయి. కొన్ని ముఖ్యమైన నూతన విషయాలు కూడా కనుగొనబడ్డాయి.

రాహు, లగ్న అష్టకవర్గులు పరిశీలింపబడదగినవా, అష్టకవర్గును రాశి నుండి లెక్కించవలెనా లేక భావం నుండి లెక్కించవలెనా వంటి ఈ పద్ధతికి చెందిన కొన్ని నిర్దేశిత విషయాలలో ప్రాచీన రచయితల నడుమ సహితం అభిప్రాయ భేదాలు వున్నాయి. ఈ పద్ధతియొక్క ముఖ్యమైన సూత్రాలను అర్థం చేసుకోవటంలో జ్యోతిష విద్యార్థి తత్తరపాటు పడకుండా వుండడంకోసం

ఇటువంటి వివాదాస్పదమైన విషయాలు తొలగింపబబడ్డాయి. నాకు ప్రఖ్యాత సాంప్రదాయకమైన రచయితల ఆధారం కూడా వున్న విధేయతతో కూడిన నా అభిప్రాయం ప్రకారం అష్టకవర్గు లెక్కింపు భావముల నుండి కాకుండా రాశుల నుండి మాత్రమే చెయ్యాలి.

పాఠకులు ఈ విషయం (అష్టకవర్గు విధానం) హెచ్చు వివరణంగా అనుసరించుట కొరకు ఈ వ్యాఖ్యానం (వివరణ) ప్రేరేపిస్తుందన్న ఆశతో, స్పష్టతతో కూడిన సంగ్రహమైన అష్టకవర్గు పద్ధతి వివరణను, ఎఱిగిన పరిమితులతో నాకు స్వయంగా చెందు (ఏదైనా) లోపములతో (సహ) అనుగుణ్యమైన ఈ పుస్తకంను (పాఠక లోకానికి) నేను సమర్పించడానికి ప్రయత్నించాను. ఈ గ్రంథ ప్రస్తావనలో సాంప్రదాయ పద్ధతులకు పూర్తిగా కట్టుబడి వుండలేదు. ఇన్ని సంవత్సరాలుగా సంపాదించిన అనుభవ కాంతిలో కొంత స్వల్పంగా అతిక్రమించవలసి వచ్చింది.

ఇన్నాళ్ళుగా నా యితర పుస్తకాలను విస్తరింపజేసిన అనుకూల ఆతిథ్యమనే విద్యావంతులైన ప్రజల నుండి ఈ పుస్తకం (కూడా) అందుకుంటుందని నేను ఆశిస్తున్నాను.

బెంగుళూరు.
15-6-1962

బి. వి. రామన్

# అధ్యాయం-1

# అష్టకవర్గు పద్ధతి

## సామాన్య పరిచయము

ఫల నిరూపణ కోసం రకరకాల పద్ధతులను ఉపయోగించడం హిందూ జ్యోతిషం యొక్క అద్వితీయతను సూచిస్తుంది. దశాపద్ధతిగానీ, గోచారంగానీ, అష్టకవర్గు విధానంగానీ హిందూ మేధావికిగల ఒక ప్రత్యేకమైన, వింతైన, నవీన కల్పనాశక్తిని చాటుతాయి. ఇటువంటిది బాల్దియా విధానంలోగానీ, టోలమీ విధానంలోగానీ లేక ఆధునిక పాశ్చాత్య (జ్యోతిష) పద్ధతిలోగానీ మచ్చుకైనా కనిపించదు. ఈ పుస్తకంలో వివరించడానికి ప్రయత్నించబడిన అష్టకవర్గు పద్ధతిలో ఫలితాలు చెప్పడం అన్నది హిందూ జ్యోతిష్కుల జాబితాలోనూ, శ్రేణిలోనూ పూర్తిగా జనసమ్మతం పొందినది. కానీ వ్యత్యాసాలు చూడకుండా ఈ పద్ధతి వాడుకలో ఎలా వాడబడిందంటే మొత్తంమీద అనుభవంలో దీని ఉపయోగం తరచూ కనిపించకుండా వుండిపోతున్నది. హిందూ దేశంలోగల చాలా మంది పాతకాలపు పద్ధతి జ్యోతిష్కులు అష్టకవర్గు పద్ధతి ద్వారా ఆయుర్దాయం నిర్ణయించడం ద్వారా సరిపెట్టేస్తారు. అయితే యిలా అష్టకవర్గు ద్వారా ఆయుర్దాయం కనుక్కునే పద్ధతియొక్క అమోఘతపై వారి నమ్మకం ఎంత గొప్పదంటే ఫలితాలను సరిచూసుకోవటానికి కూడా వారు ఏమాత్రం తొందరపడటం లేదు.

దశా పద్ధతిలో వివరణలో అన్ని మూల కారణాలయొక్క విస్తారమైన జ్ఞానం చాలా అవసరం. అయితే సరియైన ఫలితాలను చెప్పటం అన్నది శాస్త్రం తెలిసినాసరే ఒక్కొక్కరి వ్యక్తిగత నేర్పు అనే అంశంపై కూడా ఎప్పుడూ ఆధారపడి వుంటుంది. అలాగే అష్టకవర్గు రీత్యా కూడా ఒక జాతకం వివరించటంలో అన్ని సూత్రాలయొక్క జ్ఞానం విస్తారంగా వున్నాసరే జ్యోతిష్కుడు వివరణాశక్తి కూడా తప్పనిసరిగా కలిగి ఉండాలి. అధి పూర్తిగా అతని వ్యక్తిగత నేర్పు అవుతుంది.

అష్టకవర్గు గురించి ప్రముఖమైన "హోరా మకరందం"అనే గ్రంథంలో ఈ విధంగా నిర్వచనం వుంది. జాతకుని జన్మ సమయమునకు ఆయా గ్రహములు వుండు స్థానముల నుండి, మరియు లగ్నము నుండి సప్త గ్రహముల గోచార గమనములయొక్క ఫలము వలన ఒక్క ఉమ్మడి లబ్ధమూలమైన "అష్టకవర్గు" అను ఫలితము ఏర్పడుతుంది. ఉదాహరణకు రవినే తీసుకుందాము. జన్మ సమయపు రాశి చక్రములో రవి నిర్దేశిత రాశిలో వుండగా అట్టి రాశి వున్న స్థానము నుండి, ఇతర గ్రహములు వున్న స్థానముల నుండి కూడా పరిగణించగా కొన్ని స్థానములు మాత్రమే రవి యొక్క కిరణ ప్రభావమునకు లోనై అనుకూలముగా పరిగణింపబడతాయి. ఈ విధముగా వివిధ గ్రహములయొక్క కిరణముల ప్రభావం ఒక సంధానకర్తగా వ్యవహరించి జనన పరమైన మరియు గోచారపరమైన ప్రాబల్యాలయొక్క శుభఫలములను పెంపొందిస్తుంది.

గోచార గ్రహములయొక్క జననస్థితి ననుసరించి (లగ్నమును కూడా అనుసరించి) కలుగు చర్య, పరస్పర చర్యలను అష్టకవర్గు పరిగణిస్తుంది. అటువంటి గోచారరీత్యా కలుగు శుభాశుభఫలములను నిర్దిష్టమైన (చేతి) నేర్పుతో సంఖ్యాపరంగా ఫలానా అన్ని మూల్య ప్రమాణములు (యూనిట్లు)గా కొలచి గణనచేసి కొన్ని ముఖ్యమైన సంఘటనలను నిర్ణయించవచ్చును.

మనం రవి అష్టకవర్గు అన్నామంటే రవితోపాటు, మిగిలిన ఆరు గ్రహములయొక్క లగ్నము యొక్క వాస్తవ కిరణ ప్రసరణచే కలుగు ఉమ్మడి ఫలితం అన్నది మన భావన. అష్టకవర్గు యొక్క హేతువాదం గురించి ఈ పుస్తకంలో చర్చించటం నా అభిమతం కాదు. సంఘటనలు జరగబోయే కాలాన్ని సంఖ్యాపరమైన పద్ధతిలో చెప్పటాన్ని మన ఋషులు కనుగొన్నట్లుగా దీనిని మనం భావించాలి. ఈ పద్ధతి తక్షణమే ఏకైకమైనదే కాకుండా ఇంకా విస్తరించటానికి తగిన శక్తికొలదికూడా, నేను గ్రహించిన ఈ పద్ధతియొక్క స్పష్టమైన రూపాన్ని (పాఠకులకు) అందివ్వాలని మాత్రమే నేను ఉద్దేశిస్తున్నాను. శాస్త్రీయ దృక్పథంగల మనస్సుతో పాఠకులు ఈ పద్ధతియొక్క ప్రాముఖ్యతను తప్పకుండా లోతుగా విచారించగలరు. ఫలితాలను జోస్యం చెప్పటానికి "అష్టకవర్గు" చాలా



బాగా ఉపయోగపడుతుందని ఈ రంగంలో వినమ్రతగల షుమారు 30 సంవత్సరాల అనుభవంలో నేను గుర్తించాను. అయితే ఆయుర్దాయం ఖచ్చితంగా నిర్ణయించటంలో మాత్రం అష్టకవర్గు పద్ధతిపై పూర్తిగా ఆధారపడటం సరికాదని నాకు అనిపిస్తున్నది. నేను వందలకొద్దీ జాతకాలను పరిశీలించాను. వాటిలో చాలాభాగం వరకు ఈ (అష్టకవర్గు) పద్ధతి ప్రకారం వచ్చిన ఆయుర్దాయంకు జాతకులు నిజజీవితంలో జీవించిన సంవత్సరాలకు పూర్తిగా భేదం వుంది. అష్టకవర్గులో ఈ విధమైన భంగపాటుకు కారణాలు, సూత్రములను అసంపూర్ణముగా తెలుసుకోవటం అయివుండవచ్చు, లేక గణన చేసిన ఉదాహరణల సంఖ్య తగినంత లేకపోవటం అయినా అయివుండవచ్చు. పాఠకులు దిగువ యిచ్చిన సూత్రాలను జాగ్రత్తగా బాగా చదివి వీలైనన్ని ఎక్కువ ఉదాహరణలు గణనచేసి, నేను పైన తెలియజేసిన నా అంచనాల ధృడత్వాన్నిగానీ లేక బలహీనతను గానీ వారంతట వారే పరీక్షించగలరు.

అష్టకవర్గు రీత్యా భవిష్యత్తును చెప్పటంలోగల ఉపయోగాలను గురించి సాంప్రదాయక జ్యోతిష గ్రంథకర్తలు వివిధ రకాలైన అభిప్రాయములను తెలియపరిచారు. అయినప్పటికీ ఈ విషయం చర్చించిన వివిధ గ్రంథాలను పరిశీలిస్తే ఈ క్రింది విషయాలకై అష్టకవర్గును ఉపయోగించవచ్చునని గ్రహించగలము.

1. గ్రహములయొక్క, భావముల యొక్క సాధారణ బలము.
2. కొన్ని నిర్దిష్టమైన, ముఖ్యమైన జీవిత సంఘటనలను ముందుగా తెలిసికొనుట.
3. గోచార ఫలితాలను ముందుగా గ్రహించుట.
4. ఆయుర్దాయమును నిర్ణయించుట.

భావాలలో గ్రహాలు వుంటాయి. భావములయొక్క సాపేక్ష బలాలు క్లిష్టమైన గణనలతో కూడుకున్న శ్రీపతి పద్ధతి, కేశవ పద్ధతుల ద్వారా నిస్సందేహంగా సంఖ్యాపరంగా తెలుసుకోవచ్చు. దీనికి బదులుగా అష్టకవర్గు, క్లిష్టతరమైన పద్ధతులను విడిచిపెట్టి, భావబలం ఒక విధంగా తేలికగా తెలుసుకోగలిగేలా

మనకి ఉపయోగిస్తుంది. ఆవిధంగా లగ్నంలో కుజుడు వుండగా అట్టి లగ్నంకి చెందిన రాశికి కుజష్టకవర్గులో ఎక్కువ శుభ బిందువులుగానీ లభించినట్లయితే లగ్న భావానికి బలం చేకూరి శుభ ఫలితాలను యివ్వగలుగుతుంది. రాశిచక్రంయొక్క చేతనత్వం (బలం) సాధారణ పద్ధతిలో అంచనా వేయటం వరకే అష్టకవర్గు ప్రముఖంగా ఉద్దేశిస్తుంది. అందువల్ల దీని స్వంతమైన హద్దులు ఈ పద్ధతికి వున్నాయి. ఆ విధంగా శుక్రుడు రెండవ యింటిలో వుండగా అది వృషభరాశి అయి, శుక్రుని యొక్క అష్టకవర్గులో (వృషభంలో) 7 లేక 8 శుభ బిందువులుగానీ వున్నట్లయితే అప్పుడు శుక్రుడు తన స్థితిరీత్యా ఆధిపత్యంరీత్యా అతి హెచ్చు శుభఫలాలు యిచ్చే శక్తి కలిగి వుంటాడు.

అష్టకవర్గు పద్ధతి నందలి వివరాలు వివరించటం కోసం మనం తేది 16-10-1918 మధ్యాహ్నం 2 గంటల (ప్రాంతీయ కాలం) బెంగుళూరులో జన్మించిన ఒక వ్యక్తి జాతకం తీసుకుందాము. సులభతరంకోసం దీనిని మనం "ప్రామాణిక జాతకం"అందాము. రాశి, నవాంశ గ్రహ వివరాలు ఈ విధంగా ఉన్నాయి.

| | | | | | |
|---|---|---|---|---|---|
| రవి | 179°-8'; | చంద్ర | 311°-40'; | కుజ | 229°-49'; |
| బుధ | 180°-33'; | గురు | 83°-35'; | శుక్ర | 170°-4'; |
| శని | 124°-51'; | రాహు | 233°-23'; | కేతు | 53°-23'; |
| లగ్న | 294°-57'; | దశమ భావం | 214°-55'. | | |

| | | | |
|---|---|---|---|
| | | కేతు | గురు |
| చంద్ర | | | |
| లగ్నం | రాశి | | శని |
| | కుజ రాహు | బుధ | రవి శుక్ర |

| | | | |
|---|---|---|---|
| | | గురు శని | |
| రాహు | | | శుక్ర |
| చంద్ర | నవాంశ | | లగ్నం కేతు |
| కుజ | | బుధ | రవి |





# అధ్యాయం-2

## అష్టకవర్గు చక్రములు

ఈ అధ్యాయంలో వివిధరకాలైన అష్టకవర్గు చక్రాలు వెయ్యటం మేం యిస్తాము. స్పష్టంగా వాటిని ఈ విధంగా విభజించవచ్చు.

1. భిన్నాష్టకవర్గు లేక ప్రత్యేకంగా ఒక్కొక్క గ్రహానికే చెందు అష్టకవర్గు చక్రములు.
2. శోధన అనంతరం భిన్నాష్టకవర్గు చక్రములు
3. సర్వాష్టక వర్గు చక్రము
4. ప్రస్తారాష్టక వర్గు చక్రము

### భిన్నాష్టక వర్గు చక్రములు

రవి అష్టకవర్గు

రవి తాను వున్న రాశినుండి 1 2 4 7 8 9 10 11 రాశులలో శుభుడు

చంద్రుడు వున్న రాశి నుండి 3 6 10 11 రాశులలో శుభుడు

కుజుడు వున్న రాశినుండి 1 2 4 7 8 9 10 11 రాశులలో శుభుడు

బుధుడు వున్న రాశినుండి 3 5 6 9 10 11 12 రాశులలో శుభుడు

గురుడు వున్న రాశినుండి 5 6 9 11 రాశులలో శుభుడు

శుక్రుడు వున్న రాశినుండి 6 7 12 రాశులలో శుభుడు

శని వున్న రాశినుండి 1 2 4 7 8 9 10 11 రాశులలో శుభుడు

లగ్నం వున్న రాశినుండి 3 4 6 10 11 12 రాశులలో శుభుడు

మొత్తం 48 శుభ బిందువులు

చంద్రాష్టకవర్గు

చంద్రుడు తాను వున్న రాశినుండి 1-3-6-7-10-11 రాశులలో శుభుడు

రవి వున్న రాశినుండి 3-6-7-8-10-11 రాశులలో శుభుడు

కుజుడు వున్న రాశినుండి 2-3-5-6-9-10-11 రాశులలో శుభుడు

బుధుడు వున్న రాశినుండి 1-3-4-5-7-8-10-11 రాశులలో శుభుడు

గురుడు వున్న రాశినుండి 1-4-7-8-10-11-12 రాశులలో శుభుడు

శుక్రుడు వున్న రాశినుండి 3-4-5-7-9-10-11 రాశులలో శుభుడు

శని వున్న రాశినుండి 3-5-6-11- రాశులలో శుభుడు

లగ్నం వున్న రాశినుండి 3-6-10-11 రాశులలో శుభుడు

మొత్తం బిందువులు 49

కుజాష్టక వర్గు

కుజుడు తాను వున్న రాశినుండి 1-2-4-7-8-10-11 రాశులలో శుభుడు

రవి వున్న రాశినుండి 3-5-6-10-11 రాశులలో శుభుడు

చంద్రుడు వున్న రాశినుండి 3-6-11 రాశులలో శుభుడు

బుధుడువున్న రాశినుండి 3-5-6-11 రాశులలో శుభుడు

గురుడు వున్న రాశినుండి 6-10-11-12 రాశులలో శుభుడు

శుక్రుడు వున్న రాశినుండి 6-8-11-12 రాశులలో శుభుడు

శని వున్న రాశినుండి 1-4-7-8-9-10-11 రాశులలో శుభుడు

లగ్నం వున్న రాశినుండి 1-3-6-10-11 రాశులలో శుభుడు

మొత్తం బిందువులు 39

బుధాష్టక వర్గు

బుధుడు తాను వున్న రాశినుండి 1-3-5-6-9-10-11-12 రాశులలో శుభుడు

రవి వున్న రాశినుండి 5-6-9-11-12 రాశులలో శుభుడు

చంద్రుడు వున్న రాశినుండి 2-4-6-8-10-11 రాశులలో శుభుడు

కుజుడు వున్న రాశినుండి 1-2-4-7-8-9-10-11 రాశులలో శుభుడు

గురుడు వున్న రాశినుండి 6-8-11-12 రాశులలో శుభుడు

శుక్రుడు వున్న రాశినుండి 1-2-3-4-5-8-9-11 రాశులలో శుభుడు

శని వున్న రాశినుండి 1-2-4-7-8-9-10-11 రాశులలో శుభుడు



లగ్నం వున్న రాశినుండి 1-2-4-6-8-10-11 రాశులలో శుభుడు

మొత్తం బిందువులు 54

గురు అష్టక వర్గు

గురుడు తాను వున్న రాశినుండి 1-2-3-4-7-8-10-11 రాశులలో శుభుడు

రవి వున్న రాశినుండి 1-2-3-4-7-8-9-10-11 రాశులలో శుభుడు

చంద్రుడు వున్న రాశినుండి 2-5-7-9-11 రాశులలో శుభుడు

కుజుడు వున్న రాశినుండి 1-2-4-7-8-10-11 రాశులలో శుభుడు

బుధుడు వున్న రాశినుండి 1-2-4-5-6-9-10-11 రాశులలో శుభుడు

శుక్రుడు వున్న రాశినుండి 2-5-6-9-10-11 రాశులలో శుభుడు

శని వున్న రాశినుండి 3-5-6-12 రాశులలో శుభుడు

లగ్నం వున్న రాశినుండి 1-2-4-5-6-7-9-10-11 రాశులలో శుభుడు

మొత్తం బిందువులు 56

శుక్రాష్టకవర్గు

శుక్రుడు తాను వున్న రాశినుండి 1-2-3-4-5-8-9-10-11 రాశులలో శుభుడు

రవి వున్న రాశినుండి 8-11-12 రాశులలో శుభుడు

చంద్రుడు వున్న రాశినుండి 1-2-3-4-5-8-9-11-12 రాశులలో శుభుడు

కుజుడు వున్న రాశినుండి 3-5-6-9-11-12 రాశులలో శుభుడు

బుధుడు వున్న రాశినుండి 3-5-6-9-11 రాశులలో శుభుడు

గురుడు వున్న రాశినుండి 5-8-9-10-11 రాశులలో శుభుడు

శని వున్న రాశినుండి 3-4-5-8-9-10-11 రాశులలో శుభుడు

లగ్నం వున్న రాశినుండి 1-2-3-4-5-8-9-11 రాశులలో శుభుడు

మొత్తం బిందువులు 52

శన్యష్టక వర్గు

శని తాను వున్న రాశినుండి 3-5-6-11 రాశులలో శుభుడు

రవి వున్న రాశినుండి 1-2-4-7-8-10-11 రాశులలో శుభుడు

చంద్రుడు వున్న రాశినుండి 3-6-11 రాశులలి శుభుడు

కుజుడు వున్న రాశినుండి 3-5-6-10-11-12 రాశులలో శుభుడు

బుధుడు వున్న రాశినుండి 6-8-9-10-11-12-రాశులలో శుభుడు

గురుడు వున్న రాశినుండి 5-6-11-12 రాశులలో శుభుడు

శుక్రుడు వున్న రాశినుండి 6-11-12 రాశులలో శుభుడు

లగ్నం వున్న రాశినుండి 1-3-4-6-10-11 రాశులలో శుభుడు

మొత్తం బిందువులు 39

ఏ జాతక చక్రంలో అయినా ఏ గ్రహం అయినా తనంత తానుగ అనుకూలించే శుభ బిందువులు పైన తెల్పిన విధమైన సంఖ్యలనే కలుగజేస్తుంది. (అంటే ఎవరి జాతకంలోనైనా రవి పైన తెల్పిన స్థానాల వలన మొత్తం 48 శుభ బిందువులను కలుగజేస్తుంది. చంద్రుడు 49; కుజుడు 39. ఆ విధంగా మిగిలిన అన్ని గ్రహములు కలుగజేస్తాయి అన్నమాట) ఏ జాతక చక్రంలో అయినా మొత్తం అన్ని గ్రహాల శుభ బిందువులు కలిపితే 337 అవుతుంది. ఇది స్థిరమైన సంఖ్య.

పైన తెల్పిన "ప్రామాణిక జాతకం"లో రవి కన్యా రాశిలో వున్నాడు. కాబట్టి రవి అష్టకవర్గులో రవియొక్క శుభత్వ స్థానాలు (రవి వున్న రాశినుండి 1-2-4-7-8-9-10-11 రాశులు కనుక) కన్య (1); తుల (2); ధనుస్సు (4); మీనం (7); మేషం (8); వృషభం (9); మిథునం (10); చివరగా కర్కాటకం (11). దీనిని పటరూపంగా చక్రం-1లో విధంగా వర్ణించవచ్చును. శుభ స్థానములను బిందువు లేక సున్నా రూపంలోను; అశుభ స్థానములను రేఖ లేక సమతల గీత (అడ్డగీత) రూపంలోను సాధారణంగా గుర్తిస్తారు.

| 0 | 0 | 0 | 0 |
|---|---|---|---|
| - | చక్రం-1 రవి అష్టక వర్గు రవి నుండి | | 0 |
| - | | | - |
| 0 | - | 0 | 0 రవి |

అలాగే "ప్రామాణిక జాతకం"లో కుజుడు వృశ్చిక రాశిలో వున్నాడు. కాబట్టి రవి అష్టకవర్గులో కుజుని నుండి శుభ స్థానములు వృశ్చికం (1); ధనుస్సు (2); కుంభం (4);



వృషభం (7); మిథునం (8); కర్కాటకం (9); సింహం (10); చివరగా కన్య (11). చక్రం-2 నుండి చక్రం-8 రవి అష్టక వర్గుకు చెందిన కుజ, చంద్ర, బుధ, గురు, శుక్ర, శని లగ్నముల పటములు సూచిస్తాయి.

| - | - | 0 | 0 |
|---|---|---|---|
| 0 | చక్రం-2 రవి అష్టక వర్గు కుజుని నుండి | | 0 |
| - | | | 0 |
| 0 | - కుజ | - | 0 |

| - | 0 | - | - |
|---|---|---|---|
| చంద్ర - | చక్రం-3 రవి అష్టక వర్గు చంద్రుని నుండి | | 0 |
| - | | | - |
| 0 | 0 | - | - |

| 0 | - | - | 0 |
|---|---|---|---|
| 0 | చక్రం-4 రవి అష్టక వర్గు బుధుని నుండి | | 0 |
| - | | | 0 |
| 0 | - | - బుధ | 0 |

| - | 0 | - | గురు - |
|---|---|---|---|
| 0 | చక్రం-5 రవి అష్టక వర్గు గురుని నుండి | | - |
| - | | | - |
| - | 0 | 0 | - |

| 0 | - | - | - |
|---|---|---|---|
| 0 | చక్రం-6 రవి అష్టక వర్గు శుక్రుని నుండి | | - |
| - | | | 0 |
| - | - | - | శుక్ర - |

| 0 | 0 | 0 | 0 |
|---|---|---|---|
| 0 | చక్రం-7 రవి అష్టక వర్గు శని నుండి | | - |
| - | | | శని - |
| - | 0 | - | 0 |

| 0 | 0 | - | 0 |
|---|---|---|---|
| - | చక్రం-8 రవి అష్టక వర్గు లగ్నం నుండి | | - |
| లగ్నం - | | | - |
| 0 | 0 | 0 | - |

పైన తెల్పిన ఒకే గ్రహానికి చెందిన ఎనిమిది చక్రములూ ఒకే పటరూపం (చక్రం-9)లో కుదింపవచ్చును. ప్రతి పటంలో మేషరాశిలోగల అన్ని బిందువులు లేక సున్నాలను కలిపితే మేషరాశిలో గల మొత్తం బిందువులు వస్తాయి. ఈ విధంగానే మిగిలిన అన్ని రాశులకు కూడా చెయ్యాలి.

"ప్రామాణిక జాతకం"లో రవి ఇతర గ్రహముల యొక్క సంయుక్త అష్టక వర్గులను చక్రం-9 నుండి చక్రం-15 పటాలలో మాదిరిగా గుర్తించవచ్చును. ప్రతి రాశినందు గల మొత్తం బిందువులను సున్నాల రూపంలో కాకుండా సంఖ్యారూపంలో చూపించవచ్చును.

| 5 | 5 | 3 | 5 |
|---|---|---|---|
| 5 | చక్రం-9 రవి అష్టక వర్గు 48 | | 4 |
| 0 | | | 4 |
| 5 | 5 | 3 | 4 రవి |

| 5 | 5 | 3 | 5 |
|---|---|---|---|
| చంద్ర 3 | చక్రం-10 చంద్ర అష్టక వర్గు 49 | | 5 |
| 5 | | | 3 |
| 6 | 4 | 3 | 2 |

| 4 | 4 | 3 | 4 |
|---|---|---|---|
| 5 | చక్రం-11 కుజ అష్టక వర్గు 39 | | 3 |
| 2 | | | 4 |
| 3 | 5 కుజ | 1 | 1 |

| 3 | 4 | 6 | 4 |
|---|---|---|---|
| 5 | చక్రం-12 బుధ అష్టక వర్గు 54 | | 5 |
| 4 | | | 5 |
| 4 | 6 | 3 బుధ | 5 |

| 4 | 3 | 4 | గురు 7 |
|---|---|---|---|
| 4 | చక్రం-13 గురు అష్టక వర్గు 56 | | 6 |
| 5 | | | 4 |
| 5 | 4 | 6 | 4 |



| 6 | 7 | 4 | 4 |
|---|---|---|---|
| 4 | చక్రం-14 శుక్ర అష్టక వర్గు 52 | | 3 |
| 5 | | | 3 |
| 4 | 3 | 5 | శుక్ర 4 |

| 4 | 5 | 2 | 4 |
|---|---|---|---|
| 1 | చక్రం-15 శని అష్టక వర్గు 39 | | 4 |
| 3 | | | శని 3 |
| 3 | 2 | 5 | 3 |

## సర్వాష్టకవర్గు

సర్వాష్టక వర్గు చక్రము వేయటానికి అన్ని గ్రహములయొక్క అష్టకవర్గులూ పరిగణింపబడతాయి. ఒక్కొక్క అష్టకవర్గు యందలి మేషరాశిలో గల బిందువులన్నీ కలుపవలెను. ఈ మొత్తం సర్వాష్టక వర్గులో మేషరాశి నందుగల సంఖ్య అవుతుంది. ఈ విధంగానే ఒక్కొక్క అష్టక వర్గు నందలి వృషభ రాశిలోగల బిందువులనూ, అలాగే మిగిలిన అన్ని రాశులకు వచ్చు మొత్తం బిందువులను విడివిడిగా కూడవలెను. దిగువ తెల్పిన "శోధనము"లకు ముందుగా పైన తెల్పిన సంఖ్యల కూడిక చేయవలెను.

"ప్రామాణిక జాతకం" నందు అన్ని గ్రహాల భిన్నాష్టక వర్గులకు చెందిన మేషరాశియందలి బిందువుల (చక్రం 9 నుండి చక్రం 15లలో మేషరాశిలో గల బిందువులు) మొత్తం 33 అవుతున్నది. (రవి అష్టకవర్గు - 5 + చంద్రుని 5 + కుజునిది 4 + బుధునిది 4 + గురునిది 3 + శుక్రునిది 7 + శనిది 5, మొత్తం 33) ఇదే విధంగా సర్వాష్టక వర్గునందలి వివిధ రాశులలో గల బిందువులను గుర్తించాలి.

| 31 | 33 | 25 | 33 |
|---|---|---|---|
| 27 | చక్రం-16 ప్రామాణిక జాతకం యొక్క సర్వాష్టక వర్గు 337 | | 30 |
| 24 | | | 26 |
| 37 | 29 | 26 | 23 |

గణనలన్నీ సరిగా చేసినట్లయితే సర్వాష్టక వర్గులోగల పన్నెండు రాశులలో గల మొత్తం బిందువులు 337గా గమనించగలము.

# శోధనలు

ప్రతి గ్రహమునకు చెందిన భిన్నాష్టక వర్గులు (చక్రం-9 నుండి చక్రం-15) రెండు రకములైన శోధనలకు వశపరచబడతాయి. అవి ఒకటి త్రికోణ శోధన, రెండవది ఏకాధిపత్య శోధన. శోధనల అనంతరము వచ్చు బిందువులను జాతకుని అయుర్దాయము నిర్ణయించుట కోసము, రాశి చక్రరిత్యా కొన్ని నిర్దేశిత ఫలితములను జోస్యము చెప్పుట కోసము ఉపయోగిస్తారు. మొదట త్రికోణ శోధన చేయవలెను. అది చేయగా మిగిలిన సంఖ్యలను ఏకాధిపత్య శోధన ద్వారా తగ్గించవలెను.

## త్రికోణ శోధన

రాశి చక్రములో నాలుగు సముదాయముల త్రికోణ రాశులు ఉండును. అవి (1) మేష, సింహ, ధనుస్సులు (2) వృషభము, దాని కోణరాశులైన కన్య, మకరములు, (3) మిధునము, తుల, కుంభములు (4) కర్కాటక, వృశ్చిక, మీన రాశులు.

(1) ఒక త్రికోణ సముదాయ రాశులందు (అనగా మేష, సింహ, ధనుస్సు వంటి సముదాయములయందు) గల బిందువుల సంఖ్య సమానముగా లేకపోతే మూడింటిలో గల అతి చిన్న సంఖ్యను మూడింటినుండి తీసివైచి మిగిలిన సంఖ్యను ఆయా రాశులలో వ్రాయవలెను.

(2) మూడు కోణ రాశులలో ఏ ఒక్క రాశినందైనా సున్నా సంఖ్య వున్నచో శోధన చేయనవసరము లెదు.

(3) మూడు కోణ రాశులలో రెండు రాశులలో సున్నా సంఖ్య వున్నచో మూడవ రాశి యందలి సంఖ్యను తొలగించి అక్కడ కూడా సున్నా వ్రాయాలి.

(4) ఒక త్రికోణ సముదాయ రాశులయందలి మూడు కోణ రాశుల సంఖ్యలు సమానమైతే మూడు రాశుల యందలి సంఖ్యలను తొలగించి, మూడింటి యందు సున్నా వాడవలెను.

సాంప్రదాయ రచయితల మధ్య పై విధముగా సంఖ్యలను తొలగించుట,



తగ్గించుట విషయములపై కొంత అభిప్రాయ బేధము వుంది. కానీ ఎక్కువమంది అంగీకరించిన పద్ధతినే పైన విశదీకరించటం జరిగింది.

"ప్రామాణిక జాతకం" కి చెందిన రవి అష్టక వర్గుని (చక్రం-9)ని పరిశీలిస్తే మేష, సింహ, ధను రాశులలో క్రమంగా 5-4-5 అంకెలు వున్నాయి. పైన తెల్పిన సూత్రం (1) ప్రకారం మూడింటిలో అతి తక్కువైన 4ను మూడు రాశుల సంఖ్య నుండి తీసివేస్తే క్రమంగా 1-0-1 అనే అంకెలు మిగులుతాయి. రెండవ త్రికోణ సముదాయమైన వృషభ, కన్య, మకర రాశులలో క్రమంగా 3-4-0 అంకెలు వున్నాయి. పైన తెల్పిన సూత్రం (2) ప్రకారం ఒక రాశిలో సున్నా వుండటం వలన త్రికోణ శోధన చేయకుండా మూడు సంఖ్యలను అదే మాదిరిగా వుంచవలెను. మూడవ త్రికోణ సముదాయమైన మిధున, తుల, కుంభ రాశులలో 5-3-5 అంకెలు గలవు. సూత్రం (1) ప్రకారం ఇవి క్రమంగా 2-0-2 గా తగ్గించబడతాయి. నాల్గవ త్రికోణ సముదాయమైన కర్కాటక, వృశ్చిక, మీన రాశులలో క్రమంగా 4-5-5 సంఖ్యలు వుండుటచే సూత్రం (1) ననుసరించి అవి క్రమంగా 0-1-1 గా తగ్గించబడతాయి. త్రికోణ సాధన చేసిన తదుపరి రవి అష్టకవర్గు (చక్రం-17) ఈ విధంగా వుంటుంది.

| | | | |
|---|---|---|---|
| 1 | 1 | 3 | 2 |
| 2 | చక్రం-17 రవి అష్టక వర్గు | ఒకటవ శోధన తరువాత | 0 |
| 0 | | | 0 |
| 1 | 1 | 0 | 4 |

ఈవిధంగా ఒకటవ శోధన (త్రికోణ శోధన) మిగిలిన అన్ని గ్రహాలకు కూడా చేయాలి.

## ఏకాధిపత్య శోధన

చక్రం-17 నందు త్రికోణ శోధన (ఒకటవ రకపు శోధన) అనంతరం వచ్చిన సంఖ్యలను తిరిగి రెండవ రకపు శోధనకు పొందుపర్చాలి. ఈ రెండవ రకపు శోధనకు "ఏకాధి పత్యశోధన" అంటారు. రెండు రాశుల ఆధిపత్యం ఒక గ్రహమునకు కలుగుటచే ఈ పేరు వచ్చింది. కర్కాటక, సింహ రాశులు తప్ప

మిగిలిన పది రాశులు ఏకాధిపత్య రాశులు అవుతున్నాయి. అందువలన ఒకటవ రకపు శోధన అనంతరం వచ్చిన సంఖ్యలను తిరిగి తొలగించటానికి చేసే రెండవ రకమైన ఏకాధిపత్య శోధనను కర్కాటక, సింహ రాశులకు తప్పించి మిగిలిన పది రాశులకు మాత్రమే అన్వయించాలి. ఆ పద్ధతి ఈ విధంగా వుంటుంది.

I (1) ఒకే గ్రహమునకు చెందు రెండు రాశులయందు గ్రహములు వున్నట్లయినా, లేక గ్రహాలు వున్నా లేక పోయినా అటువంటి రెండు రాశులలో ఒక రాశి యందు సున్నా సంఖ్య వున్నట్లయినా ఏకాధిపత్య శోధన చేయనవసరము లేదు.

II (2) ఒకే గ్రహమునకు చెందు రెండు రాశులలో ఒక రాశినందు గ్రహము (గ్రహములు) వుండి రెండవ రాశినందు లేనిచో

(1) మొదటిరాశి (గ్రహము వున్నరాశి) నందలి సంఖ్య రెండవ రాశినందలి సంఖ్య కంటె హెచ్చు అయితే రెండవ రాశి నందలి సంఖ్యను తొలగించాలి. అంటే అక్కడ సున్న వ్రాయాలి. (ఉదా : 5-4 ఉంటే 5-0 చెయ్యాలి)

(2) మొదటి రాశి (గ్రహము వున్నరాశి) నందలి సంఖ్య రెండవ రాశి నందలి సంఖ్యకంటె తక్కువ అయితే రెండవ రాశినందలి సంఖ్యను మొదటి రాశినందలి సంఖ్యతో సమానం చెయ్యాలి. (ఉదా : 4-5 సంఖ్యలుంటే 4-4 చెయ్యాలి)

(3) రెండు రాశులయందలి సంఖ్యలు సమానమైతే రెండవ రాశినందలి సంఖ్యను తొలగించాలి. (ఉదా : 4-4 సంఖ్యలుంటే 4, 0 చెయ్యాలి)

III ఒకే గ్రహమునకు చెందు రెండు రాశులలో ఏ రాశిలోనూ గ్రహము లేకపోతే

(1) రెండు రాశుల యందలి సంఖ్యలు సమానమైతే రెండు సంఖ్యలను తొలగించాలి. (ఉదా : 4-4 ఉంటే 0-0 చెయ్యాలి)

(2) రెండు రాశుల యందలి సంఖ్యలలో ఒకటి పెద్ద సంఖ్య రెండవది చిన్న సంఖ్య అయితే పెద్ద సంఖ్యకు బదులు చిన్న సంఖ్యను వ్రాయాలి. అంటే రెండు చిన్న సంఖ్యతో సమానం చేయాలి

(ఉదా : 5-4 లేక 4-5గా వున్నట్లయితే 4-4 చెయ్యాలి)



ప్రామాణిక జాతకం నందలి రవి అష్టకవర్గు పరిశీలిస్తే మేష, వృశ్చిక రాశులు : ఒక రాశి (వృశ్చికము)నందు గ్రహము (కుజుడు) వుండగా రెండవది (మేషరాశి) గ్రహవర్జితముగా నున్నది. కాబట్టి మేషరాశి నందలి సంఖ్యను తొలగించి అక్కడ సూత్రం 2 లో 3 ప్రకారం అక్కడ సున్నా వ్రాయాలి. వృషభ, తుల రాశులు : తులనందు సున్నా వుంది కాబట్టి I (2) ప్రకారం శోధన అవసరం లేదు.

మిధున, కన్య రాశులు : రెండు రాశుల యందు గ్రహములు వున్నాయి. మిధునమునందు గురుడు, కన్యయందు రవి, శుక్రులు వున్నారు. కాబట్టి I (1)లో సూత్రరీత్యా శోధన అవసరము లేదు.

ధనస్సు, మీన రాశులు : రెండు రాశులయందు కూడా గ్రహములు లేవు. రెండింటి సంఖ్యలు సమానముగా కలవు. కాబట్టి III (1) సూత్రము ననుసరించి రెండు సంఖ్యలను తొలగించి రెండు రాశులయందు సున్నాలను వ్రాయాలి.

మకర కుంభ రాశులు : మకర రాశినందు సున్నాగలదు.

కాబట్టి I (2) సూత్రం ప్రకారం శోధన అవసరములేదు.

గమనిక : కర్కాటక, సింహ రాశులకు ఏకాధిపత్యశోధన వర్తిల్లదు; లగ్న, రాహు, కేతువులు వున్న రాశులు గ్రహములు లేని రాశులుగా పరిగణించాలి.

ఈ విధంగా ఏకాధిపత్య శోధన అనంతరం రవి అష్టకవర్గు చక్రం-18 మాదిరిగా మారుతుంది.

| 0 | 0 | 3 | 2 |
|---|---|---|---|
| 2 | చక్రం-18 రవి అష్టక వర్గు రెండవ శోధన అనంతరం | | 0 |
| 0 | | | 0 |
| 0 | 1 | 0 | 4 రవి |

ఈ విధంగా రెండు రకములైన త్రికోణ శోధన, ఏకాధిపత్యశోధనలను అన్ని గ్రహముల యొక్క అష్టకవర్గులకు వర్తింపగా ప్రారంభంలో గల సంఖ్యలు (ప్రా) చివరకు మిగిలిన సంఖ్యలు (మి) అన్ని గ్రహాలకు వివిధ రాశులలో పట్టిక-I మాదిరిగా వుంటాయి.

*(ప్రక్క పేజీలో పట్టిక-I యివ్వబడింది)*

## పట్టిక-I

| | రవి | | చంద్ర | | కుజ | | బుధ | | గురు | | శుక్ర | | శని | | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | ప్రా | మి | ప్రా | మి | ప్రా | మి | ప్రా | మి | ప్రా | మి | ప్రా | మి | ప్రా | మి | ప్రా | మి |
| మేషము | 5 | - | 5 | 2 | 4 | - | 4 | - | 3 | - | 7 | 4 | 5 | 2 | 33 | 8 |
| వృషభం | 3 | 3 | 3 | 1 | 3 | 2 | 6 | 2 | 4 | - | 4 | - | 2 | - | 25 | 8 |
| మిథునం | 5 | 2 | 5 | 2 | 4 | 3 | 4 | 1 | 7 | 3 | 4 | - | 4 | 3 | 33 | 14 |
| కర్కాటకం | 4 | - | 5 | 1 | 3 | - | 5 | 2 | 6 | 2 | 3 | - | 4 | 2 | 30 | 7 |
| సింహం | 4 | - | 3 | - | 4 | 1 | 5 | 1 | 4 | 1 | 3 | - | 3 | - | 26 | 3 |
| కన్య | 4 | 4 | 2 | - | 1 | - | 5 | 1 | 4 | - | 4 | - | 3 | 1 | 23 | 6 |
| తుల | 3 | - | 3 | - | 1 | - | 3 | - | 6 | 2 | 5 | 1 | 5 | 4 | 26 | 7 |
| వృశ్చికం | 5 | 1 | 4 | - | 5 | 2 | 6 | 3 | 4 | - | 3 | - | 2 | - | 29 | 6 |
| ధనుస్సు | 5 | - | 6 | 1 | 3 | - | 4 | - | 5 | 2 | 4 | 1 | 3 | - | 30 | 4 |
| మకరం | - | - | 5 | 3 | 2 | - | 4 | - | 5 | 1 | 5 | 1 | 3 | 1 | 24 | 6 |
| కుంభం | 5 | 2 | 3 | - | 5 | 4 | 5 | 2 | 4 | - | 4 | - | 1 | - | 27 | 8 |
| మీనం | 5 | - | 5 | 1 | 4 | 1 | 3 | - | 4 | - | 6 | 1 | 4 | 2 | 31 | 5 |

గమనిక : ప్రా : ప్రారంభంలోగల సంఖ్య

మి : రెండు శోధనల తర్వాత మిగిలిన సంఖ్య

### మండల శోధన

సర్వాష్టక వర్గు (చక్రం-16)నందలి వివిధ రాశులలోగల సంఖ్యల నుండి 12 యొక్క గుణిజములను తొలగించవలెను (ఉదా : 30 సంఖ్య వున్నచో 12యొక్క గుణిజమైన 24ను తొలగించగా 6 మిగులును) ఆ విధముగా 12 గుణిజములను తొలగించగా వచ్చిన సంఖ్యలకు క్రితం మాదిరిగానే త్రికోణ ఏకాధిపత్యములు చేసిన అనంతరము సర్వాష్టకవర్గు నందలి మిగిలిన సంఖ్యలను (చక్రం-21) మాదిరిగా గుర్తించవలెను.



| | | | |
|---|---|---|---|
| 7 | 9 | 1 | 9 |
| 3 | చక్రం-19 సవరింపబడిన సర్వాష్టక వర్గు | | 6 |
| 12 | | | 2 |
| 6 | 5 | 2 | 11 |

"ప్రామాణిక జాతకము"నందలి రాశులలోగల సంఖ్యల నుండి 12 యొక్క గుణిజములను తొలగించగా సవరింపబడిన సర్వాష్టక వర్గు (చక్రము-19) వచ్చును.

పై సంఖ్యలకు త్రికోణశోధన, అనంతరము ఏకాధిపత్య శోధనలను వర్తింపజేయగా ఈ విధముగా వచ్చును.

| | | | |
|---|---|---|---|
| 2 | 7 | 0 | 7 |
| 1 | చక్రం-20 సవరింపబడిన సర్వాష్టక వర్గు 1వ శోధన తర్వాత | | 1 |
| 11 | | | 0 |
| 4 | 0 | 0 | 10 |

| | | | |
|---|---|---|---|
| 2 | 7 | 0 | 7 |
| 1 | చక్రం-21 సవరింపబడిన సర్వాష్టక వర్గు 2వ శోధన తర్వాత | | 1 |
| 1 | | | 0 |
| 2 | 0 | 0 | 10 |

ఈ సంఖ్యల ఉపయోగము తదనంతర అధ్యాయములలో వివరింపబడును.

## రేఖా సర్వాష్టకవర్గు

సర్వాష్టక వర్గులో ఒక రాశినందలి శుభ బిందువులు, అశుభ బిందువుల మొత్తం ఎప్పుడూ 56 వుంటుంది. కాబట్టి బిందువు (శుభ బిందువు)ల సంఖ్యను 56 నుండి తీసివేస్తే ఆ నిర్దేశిత రాశినందలి రేఖ (అశుభ బిందువు)ల సంఖ్య తెలుస్తుంది.

ప్రామాణిక జాతకమందలి సర్వాష్టకవర్గు (చక్ర-16) నందు ఉదాహరణగా మేషరాశిని తీసుకుంటే దానియందు 33 బిందువులు కలవు. కావున రేఖ (అశుభ బిందువు)ల సంఖ్య 56-33=23 అవుతుంది. ఈ విధంగా అన్ని రాశుల యందలి రేఖలను కనుగొంటే రేఖా సర్వాష్టకవర్గు (చక్రం - 22) వస్తుంది. దీని నుండి 12

గుణిజాలను తొలగించాలి (చక్రం-23). ఇది వరకు వలెనే తిరిగి త్రికోణ శోధన, తదుపరి ఏకాధిపత్య శోధన చేస్తే రేఖా సర్వాష్టక వర్గులో చివరకు మిగిలిన బిందువులు (చక్రం-24), (చక్రం-25) వస్తాయి.

| | | | |
|---|---|---|---|
| 25 | 23 | 31 | 23 |
| 29 | చక్రం-22 రేఖా సర్వాష్టక వర్గు | | 26 |
| 32 | | | 30 |
| 26 | 27 | 30 | 33 |

| | | | |
|---|---|---|---|
| 1 | 11 | 7 | 11 |
| 5 | చక్రం-23 సవరింపబడిన రేఖా సర్వాష్టక వర్గు | | 2 |
| 8 | | | 6 |
| 2 | 3 | 6 | 9 |

1వ శోధన తర్వాత

| | | | |
|---|---|---|---|
| 0 | 9 | 0 | 6 |
| 0 | చక్రం-24 సవరింపబడిన రేఖా సర్వాష్టక వర్గు 1వ శోధన తర్వాత | | 1 |
| 1 | | | 4 |
| 0 | 2 | 1 | 2 |

| | | | |
|---|---|---|---|
| 0 | 2 | 0 | 6 |
| 0 | చక్రం-25 సవరింపబడిన రేఖా సర్వాష్టక వర్గు 2వ శోధన తర్వాత | | 1 |
| 1 | | | 4 |
| 0 | 2 | 1 | 2 |

## ప్రస్తార అష్టకవర్గు

ఇంతవరకూ మనం వివిధ గ్రహాల భిన్నాష్టక వర్గులు, అన్ని గ్రహాలకూ కలిపి సర్వాష్టక వర్గులు, వాటియొక్క త్రికోణ, ఏకాధిపత్య శోధన పద్ధతులను తెలుసుకున్నాము.

ఇక ప్రతి గ్రహం తనయొక్క అష్టక వర్గులో ప్రదానం చేసే శుభ బిందువులయొక్క విస్తరణను పట రూపేణా గుర్తించటం తర్వాత ముఖ్యమైన



విషయం అవుతుంది. ప్రతి ఒక్క గ్రహం ప్రదానం చేసే శుభ బిందువులు ఒకే రకంగా ప్రత్యేక తరహాలో అమర్చబడ్డాయి. దీనివలన గోచార ఫలములను జోస్యము చెప్పటానికి గానీ దశాంతర్దశలను వివరించటంలోగానీ, భావ విశ్లేషణ సందర్భాలలోగానీ సరియైన సమయ నిర్ధారణనూ లేక ఫలిత ప్రభావ విషయంనూ ప్రస్ఫుటంగా గుర్తించవచ్చును. ప్రతి ఒక్క గ్రహము కలుగజేసే శుభ బిందువులయొక్క ప్రత్యేక పేర్పిడి లేక విస్తరణలను విశదీకరించే పట్టికను "ప్రసారం చక్రం" (లేక దీనినే ప్రస్తార అష్టకవర్గు అనికూడా అంటారు.

ప్రాచీన రచయితల ననుసరించి తూర్పు నుండి పడమరగా 9 గీతలను; ఉత్తరం నుండి దక్షిణముగా 13 గీతలను గీయగా ఏర్పడు 96 యిండ్ల నందు శోధనలను ముందు ప్రతి గ్రహము ప్రదానము చేయు శుభ బిందువులను ఆరోహణ క్రమంలో శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్ర లగ్నములకు గుర్తించాలి.

ప్రామాణిక జాతకంకి చెందిన రవి అష్టకవర్గుకి చెందిన ప్రస్తార చక్రం పట్టిక-II నందు ఈయబడింది.

రవి కన్యారాశిలో వున్నాడు. కాట్టి విస్తరణ కన్యారాశి నుండి ప్రారంభం అవుతుంది. పట్టిక-II నందు వివిధ గ్రహములకు చెందు అడ్డు వరుసలలో కన్యారాశి నుండి సింహ రాశి వరకు (రవ్యష్టక వర్గులో) రవి నుండి యితర గ్రహముల నుండి కలుగు శుభ బిందువులు సూచింపబడుతున్నాయి. నిలువు వరుసలలో వివిధ గ్రహములకు చెందు శుభ బిందువులు సూచింపబడ్డాయి. అయితే ఈ సందర్భంలో గ్రహాలు భూమి నుండి దూరం రీత్యా అవరోహణ క్రమంలో పరిగణింపబడ్డాయి. ఉదాహరణకు రవి భిన్నాష్టక వర్గులో కన్యారాశిలో 4 శుభ బిందువులు వుండగా అవి శని, కుజ, రవి, బుధలచే ప్రదానం చేయబడ్డాయి. చంద్ర, గురు, శుక్ర లగ్నములు (కన్యారాశిలో) బిందువులు ప్రదానం చేయలేదు. ఈ విధంగా ప్రతి గ్రహమునకు ప్రస్తార చక్రములను తయారు చేసుకోవలెను. ప్రామాణిక జాతకమునకు చెందు వివిధ గ్రహముల ప్రస్తార చక్రములు పట్టిక-II నుండి పట్టిక-VIII వరకు ఈయబడినవి.

## పట్టిక-II

### రవియొక్క ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతోసహా | కన్య శుక్ర రవి | తుల బుధ | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మిధునం గురు | కర్కాటకం | సింహం శని | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | 0 | | 0 | | | 0 | 0 | 0 | 0 | 0 | | 0 | 8 |
| గురు | | 0 | 0 | | | 0 | | 0 | | | | | 4 |
| కుజ | 0 | | 0 | 0 | | 0 | | | 0 | 0 | 0 | 0 | 8 |
| రవి | 0 | 0 | | 0 | | | 0 | 0 | 0 | 0 | 0 | | 8 |
| శుక్ర | | | | | | 0 | 0 | | | | | 0 | 3 |
| బుధ | 0 | | | 0 | | 0 | 0 | | | 0 | 0 | 0 | 7 |
| చంద్ర | | | 0 | 0 | | | | 0 | | | 0 | | 4 |
| లగ్నం | | 0 | 0 | 0 | | | 0 | 0 | | 0 | | | 6 |
| మొత్తం | 4 | 3 | 5 | 5 | 0 | 5 | 5 | 5 | 3 | 5 | 4 | 4 | 48 |



## పట్టిక-III

### చంద్రుని ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతోసహా | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మిధునం గురు | కర్కాటకం | సింహం శని | కన్య రవి శుక్ర | తుల బుధ | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | | | | | 0 | | | | 0 | | 0 | 0 | 4 |
| గురు | | 0 | 0 | 0 | 0 | | | 0 | | | 0 | 0 | 7 |
| కుజ | | 0 | 0 | | | 0 | 0 | 0 | | | 0 | 0 | 7 |
| రవి | 0 | 0 | 0 | | 0 | 0 | | | | 0 | | | 6 |
| శుక్ర | | 0 | | 0 | 0 | 0 | | | | 0 | 0 | 0 | 7 |
| బుధ | 0 | | 0 | 0 | | 0 | 0 | | 0 | | 0 | 0 | 8 |
| చంద్ర | 0 | | 0 | | | 0 | 0 | | | 0 | 0 | | 6 |
| లగ్నం | | 0 | | | 0 | | | | 0 | 0 | | | 4 |
| మొత్తం | 3 | 5 | 5 | 3 | 5 | 5 | 3 | 2 | 3 | 4 | 6 | 5 | 49 |

పట్టిక-IV

## కుజుని ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతో సహా | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మిధునం గురు | కర్కాటకం | సింహం శని | కన్య రవి శుక్ర | తుల బుధ | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | 0 | | | 0 | 0 | 0 | 0 | 0 | | 0 | | | 7 |
| గురు | 0 | | | | 0 | 0 | 0 | | | | | | 4 |
| కుజ | 0 | 0 | | 0 | | | 0 | 0 | | 0 | 0 | | 7 |
| రవి | 0 | | 0 | 0 | | | | 0 | 0 | | | | 5 |
| శుక్ర | | | | 0 | | 0 | | | 0 | 0 | | | 4 |
| బుధ | | 0 | | 0 | 0 | | | | | 0 | | | 4 |
| చంద్ర | | 0 | | | | 0 | | | 0 | | | | 3 |
| లగ్నం | 0 | | 0 | | 0 | | | 0 | | | | 0 | 5 |
| మొత్తం | 5 | 3 | 2 | 5 | 4 | 4 | 3 | 4 | 3 | 4 | 1 | 1 | 39 |





పట్టిక-V

## బుధుని ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతో సహా | తుల బుధ | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మిధునం గురుడు | కర్కాటకం | సింహ శని | కన్య రవి శుక్ర | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | | 0 | | | 0 | 0 | 0 | 0 | 0 | | 0 | 0 | 8 |
| గురు | | 0 | | 0 | | | 0 | 0 | | | | | 4 |
| కుజ | | 0 | 0 | | 0 | | | 0 | 0 | 0 | 0 | 0 | 8 |
| రవి | | | | 0 | 0 | | | 0 | | 0 | 0 | | 5 |
| శుక్ర | 0 | 0 | 0 | 0 | | | 0 | 0 | | 0 | | 0 | 8 |
| బుధ | 0 | | 0 | | 0 | 0 | | | 0 | 0 | 0 | 0 | 8 |
| చంద్ర | | 0 | 0 | | | 0 | | 0 | | 0 | | 0 | 6 |
| లగ్నం | 0 | 0 | | 0 | 0 | | 0 | | 0 | | 0 | | 7 |
| మొత్తం | 3 | 6 | 4 | 4 | 5 | 3 | 4 | 6 | 4 | 5 | 5 | 5 | 54 |

పట్టిక-VI

## గురుని ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతోసహా | మిథునం గురు | కర్కాటకం | సింహం శని | కన్య రవి శుక్ర | తుల బుధ | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | | 0 | | | 0 | | 0 | 0 | | | | | 4 |
| గురు | 0 | 0 | 0 | 0 | | | 0 | 0 | | 0 | 0 | | 8 |
| కుజ | 0 | | 0 | 0 | | 0 | 0 | | 0 | | | 0 | 7 |
| రవి | 0 | 0 | | 0 | 0 | 0 | 0 | | | 0 | 0 | 0 | 9 |
| శుక్ర | 0 | 0 | | | 0 | | | 0 | 0 | | | 0 | 6 |
| బుధ | 0 | 0 | 0 | | 0 | 0 | | 0 | 0 | 0 | | | 8 |
| చంద్ర | 0 | | 0 | | 0 | | 0 | | | 0 | | | 5 |
| లగ్నం | 0 | 0 | | 0 | 0 | 0 | | 0 | 0 | | 0 | 0 | 9 |
| మొత్తం | 7 | 6 | 4 | 4 | 6 | 4 | 5 | 5 | 4 | 4 | 3 | 4 | 56 |



పట్టిక-VII

## శుక్రుని ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతోసహా | కన్య శుక్ర రవి | తుల బుధ | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మిథునం గురు | కర్కాటకం | సింహం శని | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | | 0 | 0 | 0 | | | 0 | 0 | 0 | 0 | | | 7 |
| గురు | | 0 | | | 0 | 0 | 0 | 0 | | | | | 5 |
| కుజ | 0 | 0 | | | 0 | | 0 | 0 | | | 0 | | 6 |
| రవి | | | | | | | | 0 | | | 0 | 0 | 3 |
| శుక్ర | 0 | 0 | 0 | 0 | 0 | | | 0 | 0 | 0 | 0 | | 9 |
| బుధ | | | | 0 | | 0 | 0 | | | 0 | | 0 | 5 |
| చంద్ర | 0 | 0 | | 0 | 0 | 0 | 0 | 0 | 0 | 0 | | | 9 |
| లగ్నం | 0 | | 0 | | 0 | 0 | 0 | 0 | 0 | | | 0 | 8 |
| మొత్తం | 4 | 5 | 3 | 4 | 5 | 4 | 6 | 7 | 4 | 4 | 3 | 3 | 52 |

పట్టిక-VIII

శని ప్రస్తారాష్టక వర్గు

| అవరోహణ క్రమంలో గ్రహాలు లగ్నంతోసహా | సింహం శని | కన్య రవి శుక్ర | తుల బుధ | వృశ్చికం కుజ | ధనుస్సు | మకరం లగ్నం | కుంభం చంద్ర | మీనం | మేషం | వృషభం | మిధునం గురు | కర్కాటకం | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| శని | | | 0 | | 0 | 0 | | | | | 0 | | 4 |
| గురు | | | 0 | 0 | | | | | 0 | 0 | | | 4 |
| కుజ | 0 | 0 | 0 | | | 0 | | 0 | 0 | | | | 6 |
| రవి | | 0 | 0 | | 0 | | | 0 | 0 | | 0 | 0 | 7 |
| శుక్ర | 0 | | | | | | 0 | | | | | 0 | 3 |
| బుధ | 0 | 0 | | | | | | 0 | | 0 | 0 | 0 | 6 |
| చంద్ర | | | | | 0. | | | | 0 | | | 0 | 3 |
| లగ్నం | | | 0 | 0 | | 0 | | 0 | 0 | | 0 | | 6 |
| మొత్తం | 3 | 3 | 5 | 2 | 3 | 3 | 1 | 4 | 5 | 2 | 4 | 4 | 39 |



# అధ్యాయం-3

## సాధారణ గమనికలు

ప్రతి ఒక్క చక్రము దానియొక్క ఉపయోగములను కలిగి వుంది. పాఠకుడు క్రమేపీ ముందు ముందు పేజీలను చదువుతూ వుంటే ఇది నిరూపిత మవుతుంది. అష్టకవర్గు కల్పనలో గ్రహాలు తాము వున్న ఇంటిని తాము స్వయముగా తమ అష్టకవర్గు రీత్యా ఆ రాశికి ప్రదానము చేయు శుభ బిందువులకు అనులోమానుపాతంగా ప్రభావితం చేస్తాయి. సాధారణంగా ఒక గ్రహం తనయొక్క అష్టకవర్గులో తానున్న రాశిలో 5 బిందువుల కంటె హెచ్చు శుభ బిందువులను కలిగి వుంటే అతి శుభత్వం కలిగినదిగా పరిగణింపబడుతుంది. 4 బిందువులకంటే తక్కువ బిందువులను కలిగివున్న గ్రహము తానున్న భావమును ప్రతికూలముగా ప్రభావితం చేస్తుంది. అటువంటి తక్కువ బిందువులుంటే ఫలితముగా సాధారణముగా అనుకూలము కాని విధముగా అనారోగ్యము, ప్రయోజనము లేని సంచారము, చెడ్డపేరు, మానసిక ఆందోళన, తీవ్ర పరితాపము వంటి దుష్ఫలితాలు కలుగుతాయి. అసలు బిందువులే లేకపోతే అంటే బిందువుల సంఖ్య సున్నా అయితే ఈ దుష్ఫలితాలు అతి తీవ్రస్థాయిలో వుండి, బిందువుల సంఖ్య పెరుగుతున్న కొలది దుష్ఫలితాల తీవ్రత ఆ బిందువులు సంఖ్యకు అనుగుణంగా తగ్గుతూ వుంటుంది. గ్రహం వున్న భావం (ఇల్లు)ని అనుసరించి ఫలితాలు ఆధారపడి వుంటాయి. ఆ విధంగా భావం నాల్గవ భావం అయివుండి అందులో వున్న గ్రహానికి 1, 2 లేక 3 బిందువులుగానీ వున్నట్లయితే అటువంటి వ్యక్తి నాల్గవ భావంకి సంబంధించిన అన్నిరకాలైన దురవస్థలను ఎదుర్కోవటం జరుగుతుంది. అటువంటి గ్రహంయొక్క కారకత్వాలకు సంబంధించిన దుష్ఫలితాలను కూడా జాతకుడు/జాతకురాలు అనుభవించవలసి వుంటుంది. పదవ భావంగానీ అయినట్లయితే వ్యక్తియొక్క వృత్తిపరంగా ఒడిదుడుకులు, గౌరవ భంగము, అసంతృప్తి వంటివి కలుగుతాయి. దీనికి బదులుగా గ్రహానికి 5 గానీ అంతకంటె హెచ్చుగాగానీ బిందువులు వున్నట్లయితే (పదవ భావంకి

సంబంధిస్తే) ఆశల ఫలించటం, అంతస్థు, పదవి, గౌరవం పెరగటం మొదలైనవి జరుగుతాయి. రాశి చక్రంలో గ్రహాలు ఉచ్ఛగానీ లేదా ఇతరత్రా బలమైన స్థానాలనుగానీ పొంది వున్నప్పటికీ తమ తమ అష్టక వర్గులలో (తాము వున్న రాశులలో) కావలసినన్ని బిందువులనుగానీ కలిగి వుండకపోతే శుభఫలితాలనిచ్చే శక్తిని కోల్పోతాయి.

ఒక గ్రహం అష్టకవర్గు రీత్యా కలిగి వుండగలుగు అతి హెచ్చు బిందువుల సంఖ్య ఎల్లప్పుడూ 8గా గుర్తింపవచ్చును.

గ్రహములయొక్క, భావములయొక్క కారకత్వముల లక్షణములననుసరించి సాధారణంగా అష్టకవర్గు ఫలితాలను గుర్తించవలసి వుంటుంది.

గ్రహము రవి అయితే : ఆధ్యాత్మిక విషయములు, వ్యక్తిగత పలుకుబడి, తండ్రి

గ్రహము చంద్రుడు అయితే : తెలివితేటలు, మనస్సుకి, తల్లికి, సంబంధించిన అన్ని విషయములు.

గ్రహము కుజుడు అయితే : భూములు, ఇళ్ళు, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు.

గ్రహము బుధుడు అయితే : వివేచనా శక్తి, వాక్కు, విచక్షణాశక్తి, జ్ఞానము.

గ్రహము గురుడు అయితే : కీర్తి, వాహనములు, దుస్తులు, సంతానము, ఆరోగ్యము, ధనము, గౌరవ బిరుదులు, అదృష్టము.

గ్రహము శుక్రుడు అయితే : వివాహము, ఇంద్రియ సుఖము, వాహనములు, స్నేహితులు, భార్యయొక్క ఆకృతి ఇతర లక్షణములు

గ్రహము శని అయితే : ఆయుర్దాయము, వృత్తి వివరములు, బాధలు, సంతోషము లేకుండుట, పిసినారితనము, విధ్వంసము, ప్రమాద కారణము.

వివిధ భావముల (ఇండ్ల) కారకత్వములు ఈ దిగువన (కొన్ని) ఈయబడినవి.

ఒకటవ ఇల్లు (లగ్నం) : శరీర సౌష్టవము, దాని లక్షణములు

రెండవ ఇల్లు : అదృష్టము, ధనము, సత్యము.

మూడవ ఇల్లు : సజీవత్వము, పరాక్రమము, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్లు, స్వరము.



నాల్గవ ఇల్లు : సంతోషము, బంధువులు, గృహము, తల్లి

అయిదవ ఇల్లు : ప్రవృత్తి, తెలివితేటలు, సంతానము

ఆరవ ఇల్లు : బంధువులు, శత్రువులు, గాయములు

ఏడవ ఇల్లు : ప్రయాణములు, జీవిత భాగస్వామి

ఎనిమిదవ ఇల్లు : మానసిక, శారీరక వ్యాధులు, మరణము, విధ్వంసము

తొమ్మిదవ ఇల్లు : గురువు, అదృష్టము, నైతిక ధర్మాలు

పదవ ఇల్లు : కర్మ, బ్రతుకు తెరువు, పరాక్రమము, ధైర్యము, కీర్తి

పదకొండవ ఇల్లు : సంపద, ధనలాభము

పన్నెండవ ఇల్లు : ఖర్చులు, నష్టములు, పాపములు, నిర్యాణము, మోక్షము.

ఒక గ్రహముయొక్క స్వాభావికమైన కారకత్వ లక్షణాలనుగానీ, భావము(యిల్లు) యొక్క లక్షణాలనుగానీ విశదీకరిస్తున్నప్పుడు జ్యోతిష సంబంధిత సాధారణ సూత్రాలకు సరియైన ప్రాముఖ్యతనిస్తూ వుండాలి. ఉదాహరణకు భావములలో పాపులు వుంటే భావం బలహీన పడుతుంది. శుభులు వుంటే భావంకి పుష్టి చేకూరుతుంది. ఈ వివరాలన్నీ నా పుస్తకం "హౌ టు జడ్జ్ ఎ హారోస్కోప్"లో వివరించాను కాబట్టి ప్రస్తుతం ప్రధానంగా "అష్టకవర్గు పద్ధతికి" మాత్రమే కట్టుబడి వుండాలని నేను అనుకుంటున్నాను.

# అధ్యాయం-4

## రవి అష్టకవర్గు

ఒకటిగానీ అంతకంటె హెచ్చుగానీ బిందువులను రవి కలిగి వున్నప్పుడు ఈ క్రింది విధమైన ఫలితాల నిస్తాడు.

1 బిందువు : అనేక రకాలైన వ్యాధులు, దుఃఖములు, గమ్యము లేని సంచారము

2 బిందువులు : అపార్థములు, ప్రభుత్వమువలనగానీ పాలకుల వలనగానీ విచారము, అసౌఖ్యము, ధననష్టము.

3 బిందువులు : తరచు ప్రయాణములవలన శరీరము శుష్కించుట, మానసిక బాధలకు గురియగుట

4 బిందువులు : లాభనష్టముల సమానత, సంతోష దుఃఖముల సమానత

5 బిందువులు : దైవభక్తిగల వ్యక్తుల సావాసము, ఒక సంతానము కలుగుట, కొత్త దుస్తులు ధరించుట, విద్య విషయంలో అభివృద్ధి

6 బిందువులు : మంచి ఆరోగ్యము, శారీరక మనోహరత్వము, ఆకర్షణ వాహనములు పొందుట, తగినంత అదృష్టము, మంచి కీర్తి.

7 బిందువులు : మంచి ఉన్నతి పొందుట, తగు సత్కారములు, సంపదలు పొందుట.

8 బిందువులు : ఉన్నతమైన రాజకీయ పదవి, లేక రాజకీయ పురస్కారము, సర్వతోముఖమైన గౌరవము.

కొన్ని సాధికారికమైన గ్రంథముల రీత్యా రవి గోచార రీత్యా వివిధ రాశులయందు చర్చించునప్పుడు తన అష్టకవర్గులో ఆయా రాశులయందుగల బిందువుల ననుసరించి పైన తెల్పిన ఫలితములు కల్గును. నేను ఈ సూత్రములను జన్మరాశి చక్రములకు అన్వయించి పరిశీలించాను. చాలా వాటి విషయంలో అత్యధిక సంతృప్తికరమైన ఫలితాలను పొందాను. ఉదాహరణకు



రవి తన అష్టకవర్గులో కర్కాటక రాశిలో 6 బిందువులతోగల జాతకమునందు జాతకుడు మంచి ఆరోగ్యమును కల్గి వుండి వాహనములను కలిగియుండి, మంచి పేరు పొంది ఆర్థికంగా బాగా వుండడం జరిగింది. అన్వయింపు ఒక్క గోచారానికే పరిమితం చేస్తే రవి కర్కాటక రాశిలో చరించే సమయంలో మాత్రమే ఈ ఫలితాలు పునరావృతం అవుతూ వుండాలి. ఇది చాలా వరకు అసాధ్యమైనది. రవిగానీ, మరియొక గ్రహముగానీ స్వక్షేత్రమందుండగా ఆ రాశియందు చాలా తక్కువ బిందువులను కలిగి వుండడం వలన ఆ (రాశికి చెందు) భావము ప్రతికూలముగా గురిచేయబడుట నేను చాలా జాతకాలలో గమనించాను. కాబట్టి గోచార గమనాలకే కాకుండా ఇతర విషయములలో కూడా గ్రహాలకు చెందిన పైన తెల్పిన వివిధ బిందువులయొక్క ఫలితాలను వర్తింప చేయవలసి వున్నదని నాకు అనిపిస్తున్నది.

(1) రవి లగ్నంలో వుండగా నీచలోగానీ, శత్రుక్షేత్రంలోగానీ వుండి ఆ రాశిలో 3 కంటె ఎక్కువ బిందువులు గానీ లేనట్లయితే ఆ వ్యక్తి అనారోగ్యంతోనూ, బలహీనమైన శరీరతత్వంతోనూ వుంటాడు. రవిగానీ అన్ని బిందువులు కలిగి వున్నా వుచ్ఛలోగానీ లేక మిత్ర క్షేత్రంలోగానీ వున్నట్లయితే పైన తెల్పిన దుష్ఫలితాలు నిరసింపబడతాయి. అలాకాక రవి ఉచ్ఛలోగానీ లేక మిత్రక్షేత్రంలోగానీ వుండగా 5 బిందువులను కలిగి వున్నట్లయితే ఆ వ్యక్తి దీర్ఘాయువు కలిగి రాజకీయమైన పదవి ఉన్నతి కలిగి వుండడం జరుగుతుంది.

ఉన్నత పదవి నలంకరించిన ఒక ప్రముఖ భారతీయుని జాతకంలో రవి లగ్నం (వృశ్చికం)లో వుండగా మిత్రక్షేత్రంలో 5 బిందువులతో వుండుట (జ్యోతిషరీత్యా) యాదృచ్ఛికం కాదు. ఆ వ్యక్తి పరిపాలనా దక్షత కల్గి గొప్ప రాజకీయ అధికారంని అనుభవించటం జరిగింది.

(2) రవి 3 లేక 4 బిందువులను కల్గివుండగా ఉచ్ఛ, స్వక్షేత్రములలో లేకపోతే ఆ వ్యక్తి ఎప్పుడూ అనారోగ్యంతో వుండటం జరుగుతుంది.

(3) రవి లగ్నాధిపతి అవుతూ 5 లేక 6 బిందువులుగల రాశిలో వున్నట్లయితే రాజకీయ పదవి అధికారముయొక్క మొత్తము ఉపకరణలన్నీ ఆ వ్యక్తికి ఆశీర్వదింపబడతాయి.

రూజ్‌వెల్ట్ (అమెరికా మాజీ ప్రెసిడెంటు) జాతక చక్రంలో రవి లగ్నాధిపతిగా లగ్నంలో వుండగా 5 బిందువులతో వున్నాడు. ప్రాచీన పుస్తకాల ప్రకారం రవి యొక్క స్థితి పూర్ణాయర్దాయాన్ని, రాజత్వాన్ని (నృపతిశ్చిరాయు) ప్రస్ఫుటంగా సూచిస్తుంది. "ఎప్పుడైనా రవి లగ్నాధిపతిగా 5,6 లేక 7 బిందువులతో వున్నట్లయితే అటువంటి వ్యక్తి అనేక దేశాలకు రాజగును" (బహుభూమిపాల)అని నారదీయము నొక్కి చెపుతున్నది.

(4) కేరళీయము ప్రకారము "రవి కేంద్రమునందు (శోధనానంతరము 2 బిందువులనే కలిగియుండి (శని, కుజ లేక బుధునితో కలసి వున్నచో అట్టి జాతకుడు పుట్టి 10 సంవత్సరముల ప్రాయుము తర్వాత తండ్రి రాజకీయ అధికారము పొందును.

(5) రవి వున్న రాశినందు 5 కంటె హెచ్చు బిందువులుండగా అది కేంద్ర త్రికోణములలో ఒకటి గానీ అయితే జాతకుని తండ్రి స్మశానమునకు దగ్గరగా గానీ, పర్వతమువద్ద గానీ, నిప్పు ఉన్న స్థలమువద్దగానీ, సముద్రము వద్దగానీ మరణము చెందును.

(6) రవి కేంద్రమునందుగానీ, లేక త్రికోణమునందుగ్గానీ వుండగా అది మిత్రక్షేత్రమగుచూ 3,4 లేక 5 బిందువులుగానీ కల్గివున్నచో జాతకుని 17 సంవత్సరముల వయసునందు ఆతని తండ్రి మరణించును.

(7) రవి 9వ యింటిలో రాహువుతో కలిసి వుండగా బిందువుల సంఖ్య 3 అయినచో జాతకునికి 5 సంవత్సరముల తర్వాత ఆతని తండ్రి మరణించును.

(8) అయిదవ యింటిలో రవి 3 బిందవులతో నుండి చంద్ర, కుజ శనులతో కలసి వుంటే జాతకుని తల్లిదండ్రులు, సహోదరులు నశించుదురు.

(9) 3వ యింటిలో రవి 3 లేక 4 బిందువులతో నుండగా 9వ యింటి నుండి పాపులచే చూడబడినచో జాతకునికి 20వ సంవత్సరముల ప్రాయము తర్వాత ఆతని తండ్రి మరణించును.

(10) ఆరవ యింటిలో రవి యుండగా 4 బిందువులను కలిగి యుండి గురునిచే వీక్షింపబడినచో జాతకునికి 25 సంవత్సరముల ప్రాయము తర్వాత జాతకుని తండ్రి మరణించును.



(11) రవి కేంద్రకోణములలో నుండగా 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కలిగి యున్నచో జాతకునిక 30 నుండి 36 సంవత్సరముల ప్రాయములో తండ్రి మరణించును.

పైన తెల్పిన సమ్మేళనములు చోద్యమైనవి. ఒకరకమైన స్పష్టమైన విరుద్ధతను. ఇవి బహిరంగ పరుస్తున్నాయి. సాధారణంగా రవికి చెప్పబడిన స్థానములు అనుకూలమైనవి ఎందుకంటే రవి అవి ఉపచయ స్థానాలైన 6-11లు లేక కేంద్రకోణములు గనుక. దీనికి తోడు రవి కనీసము కావలసిన బిందువులు కూడా అప్పగించబడ్డాయి. అయినప్పటికీ ప్రతికూల ఫలితములు జరుగునట్లుగా వూహించబడింది. విశేషమేమిటంటే నిజజీవితంలో వీటిలో చాలావరకు యధాతధంగా జరగటం గమనిస్తున్నాము.

తే 8-8-1912 దీ నాడు సాయంత్రం గం. 7-35 ని॥ (స్టాండర్డు కాలమానము)నకు బెంగుళూరులో జన్మించిన ఒక వ్యక్తి చక్రంలో రవి కర్కాటకంలో లగ్నంనుండి ఆరవ యింటిలో వుండగా వృశ్చిక రాశినుండి గురునిచే చూడబడుచూ తన అష్టక వర్గునందు 6 బిందువులును కలిగి వున్నాడు. జాతకునకు 31వ సంవత్సరపు వయస్సునందు (అంటే 25 సంవత్సరముల తర్వాత అన్న సూత్రం యధాతధంగా వర్తిల్లింది) జాతకుని తండ్రి మరణించెను.

పరిశీలించిన చాలా జాతక చక్రాలలో రవి అతితక్కువ బిందువులతో శత్రుక్షేత్రములో వుంటే 40 సంవత్సరముల వయసుకు లోపుగానే జాతకుడు మరణించటం గమనించటం జరిగింది. రవి పదవ యింటి అధిపతిగా 9లో గానీ 5వ యింటిలో గానీ వుండగా 5 గానీ అంతకంటే హెచ్చు బిందువులను కలిగి వున్నప్పుడు న్యాయశాస్త్ర సంబంధమైన ఘనత కలుగుతున్నది. తులా లగ్నమైరవి ఉపచయాల్లో గానీ వున్నట్లయితే గొప్ప మేధావితనం కలుగుతున్నది. ఇవి మేం గమనించిన కొన్ని విషయములు మాత్రమే. అందువలన ప్రాచీన (గ్రంథ) సూత్రములుగా పరిగణించవలసిన ప్రాముఖ్యత నీయనవసరం లేదు.

(12) శోధనకు ముందు రవి అష్టకవర్గులో రవినుండి తొమ్మిదవ స్థానంలో గల సంఖ్యను రవి యొక్క * శోధ్యపిండముచే హెచ్చవేయవలెను. లబ్దమును 27చే భాగించవలెను. వచ్చిన శేషమును అశ్విని నుంచి లెక్కించగా వచ్చు

* గ్రహముల యొక్క శోధ్యపిండములను గణన చేయుట అధ్యాయం -14 నందు వివరింపబడినవి.

నక్షత్రమును (లేక శని వున్న నక్షత్రము నుండి) లెక్కించవలెను. శని గోచార రీత్యా ఇట్టి నక్షత్రమున చరించు సమయములో (నిర్దేశిత మహాదశ మారకము చేయు లక్షణములను కలిగి వున్నచో) జాతకుని తండ్రి మరణము సంభవించును. ఈ నక్షత్రమునకు త్రికోణ నక్షత్రముల యందు శని గోచారరీత్యా చరించు సమయములలో జాతకుని తండ్రి వైపు బంధువు మరణించును.

ఇచ్చిన ప్రామాణిక జతకంలో రవియొక్క శోధ్యపిండము 182. రవి అష్టక వర్గులో రవి నుండి 9వ స్థానములో 3 కలదు. కావున 182ను 3చే హెచ్చువేయగా లబ్దము 546 వచ్చును. దీనిని 27చే భాగించగా శేషము 6 మిగులును. అశ్విని నుండి 6వ నక్షత్రము ఆరుద్ర అగుచున్నది. శని జన్మ చక్రములో మఖ నక్షత్రములో గలదు. మఖనుండి ఆరవ నక్షత్రము స్వాతి అగుచున్నది. కాబట్టి గోచార రిత్యా శని ఈ రెండు నక్షత్రములలో (ఆరుద్ర స్వాతి) చరించు సమయములలో (ఏ నక్షత్ర స్థానము హెచ్చుగా బలహీన పడినచో అందు) జతకుని తండ్రి మరణము జరుగును.

ముందు పేజీలో యిచ్చిన ఉదాహరణ జాతకము (8-8-1912 జననం)లో రవియొక్క శోధ్యపిండము 157. రవి అష్టక వర్గులో రవి ఉన్న స్థానము నుండి 9వ స్థానములో 5 బిందువులు కలవు. కావున 157ను 5చే హెచ్చువేయగా లబ్దము 785 వచ్చును. దీనిని 27చే భాగించగా శేషము 2 వచ్చును. శని రోహిణీ నక్షత్రములో గలదు. అశ్వని నుండి రెండవది అయిన భరణీ నక్షత్రము రోహిణి నుండి రెండవది అయిన మృగశిర నక్షత్రములు అగుచున్నవి. కావున గోచారరిత్యా భరణీ నక్షత్రము నందు గానీ లేక మృగశిర నక్షత్రమునందు గానీ జాతకుని తండ్రి మరణమునకు అవకాశము గలదు. జాతకుని తండ్రి సరిగా శని గోచార రిత్యా మృగశిర నక్షత్రంలో చరించు సమయంలో మరణించటం జరిగింది.

(13) రవి అష్టక వర్గునందలి సంఖ్యల (శోధన అనంతరము మిగిలిన సంఖ్యల) మొత్తమును, రవి నుండి 9వ స్థానములో వున్న సంఖ్యచే హెచ్చువేయగా వచ్చు లబ్దమును 27చే భాగించవలెను. ఆ మిగిలిన శేష సంఖ్యను అశ్విని మొదలుగా లెక్కించగా వచ్చు నక్షత్రమునందు శని చరించు సమయములో తండ్రి మరణము సంభవించును.

ఇట్టి ప్రామాణిక జాతకములో శోధనానంతరము రవి అష్టక వర్గునందలి సంఖ్యల మొత్తము 12. రవి నుండి తొమ్మిదవ స్థానములో 3 బిందువులు



కలవు. 12, 3ల యొక్క లబ్దము 36, దీనిని 27చే భాగించగా 9 మిగులును. అశ్విని నుండి 9వ నక్షత్రము ఆశ్లేషఅగును. రవి నుండి 9వ స్థానములో సున్న వున్నచో సంఖ్యల మొత్తమును మాత్రమే గ్రహించవలెను. హెచ్చువేత అవసరము లేదు. మారక నక్షత్రము, తండ్రి యొక్క ఆయుర్దాయ పరిధి అనగా అల్ప, మధ్యమ, పూర్ణ ఆయుర్దాయమలలో స్థిరీకరించుకున్న తదుపరి, నిర్ణయించు కొనవలెను.

(14) రవి శోధ్యపిండము సంఖ్యను, రవి అష్టకవర్గులో గురుని నుండి సప్తమ స్థానములో (శోధనకు ముందు) వున్న సంఖ్యచే హెచ్చువేయగా వచ్చు లబ్దమును 27చే భాగించగా వచ్చు శేష సంఖ్యతో అశ్వని నుండి గల నక్షత్రమును (లేక గురుడు వున్న నక్షత్రము నుండి) లెక్కించివలెను. గురుడు గోచారరీత్యా ఆ నక్షత్రమునందు చరించు సమయములో జాతకుని తండ్రి మరణము సంభవించును.

ఇచ్చిన "ప్రామాణిక జాతకము"లో రవి యొక్క శోధ్యపిండము 182 రాశిలో రవి నుండి సప్తమ స్థానమునందు రవ్యష్టకవర్గు నందు 5 సంఖ్య కలదు. 182, 5 సంఖ్యల యొక్క లబ్దము 910. దీనిని 27చే భాగించగా శేషము 19 వచ్చును. అశ్విని నుండి 19వ నక్షత్రము మూల నక్షత్రము అగును. కావున గురుడు గోచారరీత్యా మూలా నక్షత్రమునందు చరించు సమయమున జాతకుని తండ్రి చురణము సంభవించును. 1912 సంవత్సర జనవరి ఉదాహరణ సమయంలో రవియొక్క శోధ్య పిండము గురుని నుండి సప్తమము నందుగల సంఖ్యల లబ్దము (157 × 5) 785 అగును. దీనిని 27చే భాగించగా 2 శేషము మిగులును. కావున అశ్విని నుండి రెండవది అయిన భరణీ నక్షత్రము నందు గోచారములో గురుడు చరించు సమయములో జాతకుని తండ్రి మరణము సంభవించును.

(15) రవియొక్క శోధ్యపిండ సంఖ్యచే రవి అష్టకవర్గులో రవి నుండి ఏడవస్థానముగల సంఖ్యచే (శోధనకు ముందు) హెచ్చువేయగా వచ్చు లబ్దమును 27చే భాగించగా వచ్చు శేష సంఖ్యను అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రము నందు రవి సంచరించు సమయము నందు తండ్రి మరణము సంభవించును.

ఇచ్చిన "ప్రామాణిక జాతకము"లో రవియొక్క శోధ్య పిండము 182. రవ్యష్టకవర్గులో రవి నుండి ఏడవస్థానములో 5 బిందువులు కలవు. 182, 5ల లబ్దము 910. దీనిని 27చే భాగించగా శేషము 19 వచ్చును. అశ్వని నుండి మూల 19వ నక్షత్రము. రవి ఈ నక్షత్రము నుండి చరించు సమయములో (డిశెంబరు 5 నుండి డిసెంబరు 18 మధ్యలో) తండ్రి మరణము సంభవించును. 1912 సంవత్సర ఉదాహరణలో శేషము 2 వచ్చును. కావున రవి అశ్వని నుండి రెండవది అయిన భరణి నక్షత్రము నందు లేక రవి జన్మ సమయములో ఆశ్లేష నక్షత్రములో నుండుటచే ఆశ్లేష నుండి రెండవ నక్షత్రమైన మఖా నక్షత్రమందు సంచరించు సమయములో తండ్రి మరణము సంభవించును.

(16) రవి నుండి రవి అష్టకవర్గులో నున్న సంఖ్యచే రవి శోధ్య పిండమును హెచ్చవేయవలెను. ఈ లబ్దమును 12చే భాగించగా వచ్చు శేష సంఖ్యను మేషము నుండి లెక్కించగా వచ్చు రాశినందు శని సంచరించు సమయములో జాతకుని/ జాతకురాలి మరణము సంభవించును.

ప్రామాణిక జాతకములో రవి నుండి ఎనిమిదిలో రవ్యష్టకవర్గులో 5 కలదు. రవి శోధ్య పిండము 182. 182, 5ల లబ్దము 910. దీనిని 12చే భాగించగా శేషము 10 వచ్చున. మేషరాశి నుండి 10వ రాశి మకర రాశి. కావున శని మకర రాశిలో చరించు సమయమునందు జాతకురాలి మరణము సంభవించును.

(17) రవ్యష్టక వర్గులో శోధనానంతరము మిగిలిన సంఖ్యల మొత్తమును రవినుండి ఎనిమిదవ స్థానములోగల సంఖ్యచే హెచ్చవేయవలెను. దీనిని 12చే భాగించగా వచ్చు శేష సంఖ్యను మేషరాశి నుండి లెక్కించగా వచ్చు రాశినుండిగానీ లేదా ఆ రాశియొక్క త్రికోణ రాశుల ద్వారాగానీ రవి సంచరించు సమయమున జాతకురాలి మరణము సంభవించును. ఆయుర్దాయ నిర్ణీతకాలము (అల్ప, మధ్యమ, పూర్ణ) నిర్ణయించిన తరువాత అష్టకవర్గు సహాయముతో నిర్దేశిత మారక నక్షత్రముల ద్వారా గోచారరీత్యా శని, గురు, రవిలు సంచరించు సమయముల ద్వారా మరణము సంభవించు సంవత్సరము, మాసములను నిర్దేశించుటకు అవకాశము కలదు





# అధ్యాయం-5

## చంద్రాష్టకవర్గు

తన అష్టకవర్గు నందు చంద్రుడు ఒకటిగానీ అంతకంటె హెచ్చు బిందువులు కల్గియున్నచో ఈ క్రిందివిధమైన ఫలితములనిచ్చును.

1 బిందువు : ఆయుధమువలన, ప్రాకెడు జంతువులవలన భయము.

2 బిందువులు : తల్లికి అనారోగ్యము, వ్యాధి

3 బిందువులు : పైన తెల్పిన ఫలములు తక్కువ పరిమాణములో

4 బిందువులు : జాతకుడు నివసించు యింటికి భాగ్యము (అభివృద్ధి)

5 బిందువులు : మనశ్శాంతి, నైతిక ధర్మము

6 బిందువులు : మనస్సునందు సమభావము, ఉన్నత ఆదర్శములు

7 బిందువులు : మంత్ర శాస్త్రమునందు ప్రావీణ్యత

8 బిందువులు : అత్యధిక నైతిక ధైర్యము, సంతోషము, అదృష్టకరమైన జీవితము

(1) తన అష్టకవర్గునందు చంద్రుడు వున్న రాశిలో 1, 2 లేక 3 బిందువులు వున్నచో జాతకుడు దుఃఖము, వ్యాధి, కోర్టు చిక్కులు, వివాదములు, అనారోగ్యము వంటి వాటిచే బాధింపబడును. దీనికి తోడుగా చంద్రుడుతో రెండు మూడు గ్రహములు కలిసి వున్నట్లయితే తన 37వ ఏట జాతకుడు మరణించును.

కార్ల్ మార్క్స్ జాతకచక్రంలో చంద్రుడు ఆరవ యింటి అధిపతిగా మూడవ ఇంటిలో రెండు బిందువులతో నుండగా రాహువుతో కలిసి వున్నాడు. అత్యధికంగా పనిచేసి శ్రమించటంవల్ల మార్క్స్ అతని ఆరోగ్యం చెడగొట్టుకున్నట్లుగా చెబుతారు. హేమాక్ ఎల్లిస్‌కు ఆరవ యింటి అధిపతియైన చంద్రుడు బలహీనంగా పన్నెండవ యింటిలో 3 బిందువులతో వున్నాడు. చంద్రుని శని వీక్షించుచున్నాడు. ఆ

కాలంలో అతని రచనలు బూతు రచనలుగా భావింపబడటం వలన అతను హెచ్చు వివాదాలను ఎదుర్కోవలసి వచ్చింది.

(2) చంద్రుడు కేంద్రము నందుగానీ కోణము నందుగానీ ఏకాదశము నందుగానీ వుండగా, చంద్రుడు క్షీణ చంద్రుడుగానీ లేక నీచలోనున్న చంద్రుడుగానీ అగుచూ 2 లేక 3 బిందువులు మాత్రము కలిగి వుంటే చంద్రుడున్న అటువంటి భావము పూర్తిగా పాడవుతుంది.

చంద్రుడు 6 లేక 11లలో నుండగా ఆరుకంటె హెచ్చు బిందువులను కలిగి వున్నట్లయితే జాతకుడు ధనవంతుడవుతాడు. గురుని వీక్షణముగానీ వున్నట్లయితే లోకోపకారి కూడా అవుతాడు. నేను పరిశీలించిన షుమారు పన్నెండుమంది కోటీశ్వరుల జాతకాలలో చంద్రుడు తప్పనిసరిగా 6, 9 లేక 11 స్థానాల్లలో వుండి 6 లేక 7 బిందువులు కలిగి వున్నాడు. చంద్రుడియొక్క ఆధిపత్యం కూడా ప్రముఖపాత్ర వహించేటట్లుగా కనబడుతున్నది. ఈ సందర్భంగా నేను హెన్రీ ఫోర్డు విషయం ఉదహరిస్తాను. తొమ్మిదవ యింటి అధిపతిగా చంద్రుడు 6వ ఇంటిలో 7 బిందువులతో వున్నాడు. వృద్ధి చంద్రుడుగానీ అయితే 5 బిందువులున్నా కూడా మంచి ధనవంతుడిని చేస్తాయి. యువరాజు విండ్‌సర్ జాతకంలో కూడా ఏడవ యింటి అధిపతిగా చంద్రుడు 11వ యింటిలో వుండి 8 బిందువులను కలిగి వుండి గురు వీక్షణం కూడా పొందుతున్నాడు. బ్రిటిష్ రాజవంశానికి చెందిన సభ్యునిగా అతను చాలా ధనవంతుడు. చంద్రునికి ఎన్ని తక్కువ బిందువులు వుంటే శతృవులవల్ల అంత హెచ్చు యిబ్బందులు వుండేటట్లుగా కనబడుతున్నది.

చంద్రుడు అయిదవ లేక తొమ్మిదవ ఇంటి అధిపతి అవుతూ 8, 12 ఇండ్లు తప్పించి మిగిలిన ఇండ్లలో వున్నట్లయితే అటువంటి వ్యక్తి దృఢమైన మనస్సు కలిగి, తత్వవేత్త, ఆదర్శవాది అవుతాడు. గోవర్ధన మఠానికి చెందిన స్వర్గీయ శంకరాచార్యకు చంద్రుడు పంచమాధిపతిగా పదకొండవ యింటిలో ఆరు బిందువులతో వున్నాడు.



(3) చంద్రుడు కేంద్ర కోణాలలో వుండగా (శోధనానంతరం) 5 లేక అంతకంటే హెచ్చు బిందువులను కలిగి వుంటే చంద్ర రాశ్యాధిపతియొక్క దశలో చంద్రుడు వున్న భావం అభివృద్ధి చెందుతుంది.

(4) చంద్రుడు కేంద్రంలో వుండగా 7 లేక 8 బిందువులను కలిగి వుండగా జననమైతే అటువంటి వ్యక్తి మంచి పాండిత్యము, శక్తిమంతుడు, ప్రభువు, సంపదలు కలవాడు అగును.

మైసూరుకు చెందిన శ్రీ కృష్ణరాజ వడియార్ మహారాజు జాతకచక్రంలో చంద్రుడు లగ్నాధిపతిగా నాల్గవ యింటిలో ఆరు బిందువులు కల్గి వుండగా చంద్రుని నుండి పదవ యింటిలో గురుడు (లగ్నంలో) ఉచ్ఛలో వున్నాడు. ఈతడు మనస్సు నందు నిష్పక్షపాత వైఖరి, మేధావితనమునకు, లోకోపకారి తనమునకు పేరు పొందాడు. అతడు సంపద కల్గిన ప్రభువుకూడాను.

(5) నాల్గవ యింటిలోగల చంద్రునికి ఎన్ని బిందువులుండునో అన్ని సంవత్సరముల తర్వాత తల్లి మరణము సంభవించును. క్షీణ చంద్రునికి సున్నా బిందువులు వుండగా అట్టి చంద్రుడు 7 లేక 8 లేక 12 యిండ్లలో నున్నచో బాల్యమునందే తల్లి మరణము సంభవించగలదని జోస్యము చెప్పవచ్చును.

(6) రాహువు రెండవ యింటిలో నుండగా చంద్రుడు 7 లేక 8 ఇండ్లలో 1, 2 లేక 3 బిందువులతో వుంటే జాతకుని తల్లికి తరచు అనారోగ్యము కల్గును.

(7) చంద్రుడు నుండి కుజుడు 4 లేక 8 యిండ్లలో తక్కువ బిందువులతో వున్నట్లయితే తల్లి నుండి విడిపోవుట సంభవించును.

(8) నాల్గవ యింటిలో పాపులు వుండగా, చంద్రుడు కేంద్రమునందుగానీ, 12వ యింటినందుగానీ, 1 నుండి 3 బిందువులతో వుంటే జాతకుని 36 సంవత్సర ప్రాయములో అతని తల్లికి మరణము సంభవించును.

(9) లగ్నంలో క్షీణచంద్రుడు 0, 1, 2, 3 బిందువులను కలిగి వుంటే ఆయుధములవలనగానీ లేక విషకీటకముల వలనగానీ ప్రమాదము కల్గును. మాతృమరణము కల్గుటకు కూడా అవకాశము కలదు.

(10) నాల్గవ యింటిలో పాపులు వుం-గా, చంద్రుడు లగ్నములో తక్కువ బిందువులతో వున్నట్లయితే 36వ సంవత్సరములో జాతకునికి మాతృ మరణము కల్గును.

(11) చంద్రుని నుండి నాల్గవ యిల్లు తల్లిని సూచించును. చంద్రుని నుండి నాల్గవ యింటిలో శోధనలకు ముందుగల బిందువుల సంఖ్యను చంద్రుని శోధ్యపిండము సంఖ్యతో హెచ్చవేయవలెను. ఆ లబ్దమును 27చే భాగించవలెను. శేషము సంఖ్యగా అశ్విని నుండి నక్షత్రములను లెక్కించగా అన్నవ నక్షత్రమునందు చంద్రుడు చరించు సమయములో తల్లికి మరణము కల్గును.

ఇచ్చిన ప్రామాణిక జాతకములో చంద్రుని శోధ్యపిండము 100. చంద్రుని నుండి నాల్గవ యింటిలో శోధనకు ముందుగల సంఖ్య 3. 100, 3ల లబ్దమైన 300ను 27చే భాగించగా శేషము 3 వచ్చును. అశ్వని నుండి 3వ నక్షత్రము కృత్తిక, కావున శని గోచరా రీత్యా కృత్తికా నక్షత్రములో చరించు సమయములో మాతృమరణము సంభవించుటకు అవకాశము కలదు. కొన్ని ప్రాచీన గ్రంథముల ననుసరించి శని వున్న నక్షత్రము నుండి కూడా లెక్కించవలెను. ప్రామాణిక జాతకంలో శని మఖ నక్షత్రంలో గలడు. మఖ నుండి మూడవ నక్షత్రం ఉత్తర అవుచున్నది.

(12) చంద్రునియొక్క శోధ్య పిండ సంఖ్యను, గురుని నుంచి ఏడవ స్థానములోనున్న సంఖ్యచేతనూ, రవి నుండి ఏడవస్థానములో వున్న సంఖ్యచేతనూ, విడివిడిగా హెచ్చవేసి ఆ వచ్చిన లబ్దములను 27చే భాగించగా వచ్చు శేషముల యొక్క సంఖ్యలుగా అశ్వని నుండి లెక్కించగా ఆయా నక్షత్రముల యందు క్రమముగా గురుడు, రవి గోచారరీత్యా సంచరించు సమయములయందు తల్లియొక్క మరణము సంభవించును.

ప్రామాణిక జాతకమునందు చంద్రుని శోధ్య పిండము 100. గురుని నుండి ఏడవస్థానములో 6 సంఖ్య కలదు. 100, 6ల లబ్దము 600ను 27చే భాగించగా శేషము 6 వచ్చును. అశ్విని నుండి ఆరవది ఆరుద్రా నక్షత్రము. అట్లే రవి నుండి 7వ స్థానములో 5వ సంఖ్య కలదు. 100, 5ల లబ్దము 500ను 27చే భాగించగా శేషము 14. అశ్వని నుండి 14 చిత్తా నక్షత్రము.



తల్లి మరణము గురుడు ఆరుద్ర నక్షత్రమునందు చరించు సమయము, రవి చిత్తా నక్షత్రము (అక్టోబరు 10 నుండి అక్టోబరు 24) నందు చరించు సమయములలో కల్గును.

(13) చంద్రాష్టకు వర్గు నందలి మొత్తము సంఖ్య (శోధనానంతరము)ను చంద్రుని నుండి నాల్గునందుగల సంఖ్యచే హెచ్చవేసి 27చే భాగించవలెను. వచ్చిన శేష సంఖ్యను అశ్వని నుండి లెక్కించవలెను. శని గోచారరీత్యా అట్టి నక్షత్రమునందుగానీ, దాని యొక్క త్రికోణ నక్షత్రములయందుగానీ చరించు సమయములో మాతృ మరణము సంభవించును.

ఇచ్చిన ప్రామాణిక జాతకములో చంద్రాష్టకవర్గులో (శోధనానంతరము) సంఖ్యల మొత్తము 11; చంద్రుని నుండి నాల్గులో గల సంఖ్య 1; 11×1ల లబ్దము 11. అశ్వని నుండి 11వది పూర్వ ఫల్గుణి నక్షత్రము. కావున శని గోచారరీత్యా భరణి, పూర్వ ఫల్గుణి, పూర్వాషాఢ నక్షత్రములలో చరించు సమయములలో మాతృ మరణము సంభవించును.

# అధ్యాయం-6

## కుజాష్టకవర్గు

తన అష్టకవర్గులో ఒకటిగానీ అంతకంటె హెచ్చు బిందువులను కలిగి వుంటే కుజుడు ఈ క్రింది ఫలితములను యిస్తాడు.

0 బిందువులు : జీర్ణశక్తి యిబ్బందులు, మూర్ఛరోగము, మరణ భయము.

1 బిందువు : శరీర సంబంధమైన యిబ్బందులు, జ్వరము

2 బిందువులు : తగవులాటలు, రక్త సంబంధీకుల నుండి విడిపోవుట.

3 బిందువులు : రక్త సంబంధీకుల నుండి విడిపోవుట.

4 బిందువులు : మంచి చెడు ఫలితములు సమానముగా లభించుట.

5 బిందువులు : మనోహరమైన ప్రవర్తన, సత్ప్రవర్తన

6 బిందువులు : పాలకుల నుండి అనుగ్రహము

7 బిందువులు : సోదరులకు అభివృద్ధి, వారి వద్ద నుండి లాభములు.

8 బిందువులు : శతృవులపై విజయము, భూలాభము, ధనలాభము

అన్నదమ్ముల, అక్కచెల్లెండ్ల సంఖ్య వారియొక్క ఉన్నతి, దుర్దశ, భూసంపాదన, ధనము ఇత్యాదులను అంచనా వేయుటకు కుజ అష్టకవర్గు ఉపయోగపడుతుంది.

(1) (i) సాధారణముగా కుజాష్టక వర్గునందు కుజుడు వున్న స్థానము నుండి 3వ స్థానములో వున్న బిందువులు (శోధనకు ముందు) అన్నదమ్ముల, అక్కచెల్లెండ్ల సంఖ్యను సూచిస్తుంది అని చెప్పబడింది. పురుష గ్రహ బిందువులు అన్నదమ్ముల సంఖ్యను, స్త్రీ గ్రహ బిందువులు అక్కచెల్లెండ్ల సంఖ్యను సూచిస్తాయి. శతృక్షేత్రము లేక నీచయందున్న బిందువులను తొలగిస్తే జీవించివున్నవారి సంఖ్య తెలుసుకోవచ్చును.

(ii) కొన్ని సాధికారికముల రీత్యా కుజుని నుండి మూడవ స్థానమునందున్న బిందువులయొక్క, కుజుని నుండి మూడవ యింటి అధిపతి వున్న స్థానములోగల బిందువులయొక్క (కుజాష్టకవర్గునందు) మొత్తము అన్నదమ్ముల, అక్కచెల్లెండ్ల సంఖ్యను సూచిస్తుంది.



నిజ అనుభవంలో పైన తెల్పిన రెండు సూత్రములూ సరిగ్గా వర్తిల్లుతున్నట్లుగా కనిపిస్తున్నది. మూడవ భావం సాధారణంగా ఎలా ఏర్పాటు చేయబడిందో దానినిబట్టి ఏ సూత్రం వర్తింపజేయాలో ఆధారపడి వుంటుంది.

ఇచ్చిన ప్రామాణిక జాతకంలో కుజుని అష్టకవర్గు (చక్రం-11)లో కుజుని మూడవ స్థానంలో రెండు బిందువులు ఉన్నాయి. అయితే మూడవ భావం బాగా (బలంగా) వుండడం వలన సూత్రం 1లో (11) వర్తింపజేయాలి. దీని ననుసరించి కుజుని నుండి మూడవస్థానము నందు, కుజుని నుండి మూడవ స్థానాధిపతియైన శని వున్న స్థానముల యందలి మొత్తము బిందువుల సంఖ్య (2+4) 6 అవుతున్నది. ఈ ఆరు బిందువులు రవి, లగ్న, శని, కుజ, శుక్ర, బుధులచే (కుజ ప్రస్థారాష్టక వర్గు - పట్టిక (4) ప్రదానము చేయబడుతున్నవి. శని నపుంసక గ్రహం అయినప్పటికీ పురుష గ్రహముగానూ, బుధుడు స్త్రీ గ్రహముగానూ భావించవచ్చును. బిందు ప్రదాతలలో ఒకడైన శుక్రుడు నీచలో గలడు. కాబట్టి జన్మించిన అన్నదమ్ముల, అక్కచెల్లెళ్ళ సంఖ్య 6 గానూ, అందులో అన్నదమ్ముల సంఖ్య 4 గానూ, అక్కచెల్లెండ్ల సంఖ్య 1 గానూ మనం భావించవచ్చును.

(2) కుజుడు ఉచ్చలోగానీ స్వక్షేత్రంలోగానీ వుండగా అది 1, 4, 9, 10 ఇండ్లలో ఒకటి అగుచుండగా అట్టి కుజునికి 8 బిందువులుంటే అటువంటి వ్యక్తి కోటీశ్వరుడవుతాడు.

(3) మేషం, కర్కాటకం, సింహం, ధనుస్సు లేక మకరములలో ఏదైనా లగ్నం అవుతూండగా, కుజుడు లగ్నమునందు 4 బిందువులతో వుంటే అటువంటి జాతకుడు ప్రభువు అవుతాడు.

(4) సాధారణంగా కుజుడు 8 బిందువులతోగానీ వుంటే జాతకుడు ఒక చిన్న రాజ్యానికి అధినేతగా ఎదుగుతాడు. ఆధునిక సందర్భంగా అయితే కుజునియొక్క బలాన్ని అనుసరించి జాతకుడు పెద్ద ప్రభుత్వ ఉద్యోగి లేదా మంత్రిగానీ అవుతాడని అర్థం.

(5) కుజునికి 8 బిందువులుండడంతో పాటుగా కుజుడు లగ్నంలోగానీ, రెండవ యింటిలోగానీ లేదా పదవ యింటిలోగానీ వున్నట్లయితే జాతకుడు

రాజుగానీ లేక ప్రభుత్వాధినేతగానీ అవుతాడు.

(6) దీనికితోడు కుజుడు ఉచ్ఛలోగానీ లేదా స్వక్షేత్రంలోగానీ వుంటే జాతకుడు బలమైన (ప్రసిద్ధిపొందిన) ప్రభువు అవుతాడు.

(7) కుజుడు 4 గానీ అంతకంటె హెచ్చు బిందువులను కలిగివుండగా లగ్న, చంద్ర లగ్న, 9వ యిల్లు లేదా 10వ ఇంటిలో ఎందైనా వుండి అది కుజునియొక్క ఉచ్ఛ, స్వక్షేత్రములలో ఏదయినా ఒకటి అయితే జాతకుడు (మంచి) ధనవంతుడవుతాడు.

ఇచ్చిన ప్రామాణిక జాతకములో కుజుడు చంద్రుని నుండి 10వ ఇంటిలో వుండగా (శోధనకు ముందు) 5 బిందువులను కలిగి వుండటం జరిగింది. జాతకురాలు సాధారణ మధ్య తరగతి కుటుంబంలో జన్మించినా మంచి ధనవంతురాలు కాగలిగింది.

(8) రెండవ ఇంటి అధిపతి అగుచూ కుజుడు ఆరవ యింటిలో వుండగా ఆరు బిందువులను కలిగి వుంటే జీవితంలో అన్ని విధములైన సౌఖ్యములూ జాతకునికి లభ్యమవుతాయి. కానీ అట్టి జాతకుడు ఎల్లప్పుడూ అనేకమంది శత్రువులను కలిగి వుంటాడు.

(9) కుజుడు లగ్నాధిపతిగాని లేదా ఎనిమిదవ యింటి అధిపతి గానీ అగుచూ లగ్నమందుగానీ, చంద్ర లగ్నము, తొమ్మిదవ యిల్లు, పదవ యిల్లులలో ఎందైనా వుండగా అసలు బిందువులు లేకుండాగానీ లేదా తక్కువ బిందువులను కల్గివుండిగానీ నీచ, శత్రుక్షేత్రములలోగల గ్రహములతో కలసి వున్నట్లయితే జాతకుడు దత్తత తీసుకోబడతాడు.

(10) కుజుడు ఆరు బిందువులను కలిగి వుండి 6-8-12 లలో ఎక్కడైనా వుండి నీచ లేక అస్తంగత్వలను పొందుచూ వృద్ధి చంద్రునితో కలసివుంటే జాతకునకు సోదరులు వుండరు.

పైన తెల్పిన సందర్భంలో కుజుడుగానీ బలం కలిగి వున్నట్లు అయితే జాతకుడు నగరాధిపత్యము కల్గివుండుటగానీ లేదా పురపాలక సభ్యుడుగానీ అవుతాడు.



(11) కుజుడు 4 బిందువులు కల్గివుండి లగ్న/కేంద్ర/5వ యిల్లులలో ఎక్కడైనా వుంటే (10)నందు తెల్పిన ఫలితములే కల్గును.

(12) మూడవ యింటిలో కుజుడుగానీ, శనిగానీ వుండగా వారు 1 నుండి 3 బిందువులను మాత్రమే కలిగి వుంటే జాతకుడు తోబుట్టువులను (తల్లికి గర్భస్రావము వలన) కోల్పోవును. మూడవ యింటి అధిపతిగానీ లేదా కారకుడైన కుజుడు వున్న రాశ్యాధిపతిగానీ బేసిరాశిలో వుంటే సహోదరుల నష్టము, సరిరాశిలో వుంటే సహోదరిల నష్టము కల్గును.

(13) లగ్నము చరరాశి అగుచూ 1 నుండి 3 బిందువులతో శని ద్విస్వభావరాశి నందుంటే సహోదరులుగానీ సహోదరులుగానీ జన్మించరు. లగ్నము ద్విస్వభావ రాశి అగుచుండగా శని చర రాశినందున్నా పైవిధమైన ఫలితమే కల్గును. లగ్నము స్థిరరాశి నందుండగా శని లేక కుజుడు 1 నుండి 3 బిందువులతో వున్నట్లయితే పితృనష్టము మరియు సోదరుల నష్టము కల్గును.

(14) లగ్నము చరరాశి అగుచూ, శని 5 బిందువులతో చర లేక స్థిర రాశి రాశిలో వున్నట్లయితే జాతకుడు ధనవంతుడే కాకుండా సోదరులను కూడా కలిగి వుంటాడు.

(15) లగ్నము స్థిర రాశి అగుచూ, మూడవ ఇంటి అధిపతి ద్విస్వభావ రాశిలో 5 బిందువులను కలిగి వుంటే అట్టి వ్యక్తి దీర్ఘాయువును కల్గి వుండి జీవితపు సౌఖ్యములనన్నింటినీ అనుభవించి అనేక సోదరులను కలిగి వుంటాడు.

(16) కుజుడు 3వ యింటిలో 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కలిగి వుండి శుభునితో కలిసి వున్నా లేక చూడబడినా జాతకుడు అనేకమంది సోదరులను కలిగి వుంటాడు.

(1) ఈ క్రింద తెలియజేయబడిన సందర్భములలో సోదర నష్టము కల్గును.

(i) బిందు రహితమైన కుజుడు ఏడవ యింటి అధిపతితో కలిసి వుండగా పాపులతో కలిసివున్నా లేక నీచ అస్తంగత్వములను పొందియుండుట.

(ii) లగ్నమందు శని, కుజులు కలిసి యుండగా 1 నుండి 3 బిందువులను మాత్రమే పొందియుండుట.

(iii) కుజుడుగానీ శనిగానీ 1 నుండి 3 బిందువులను మాత్రమే కలి
వుండగా రెండవ గ్రహమునకు ఎనిమిదవ యింటిలో నుండుట

(iv) శని నుండి ఎనిమిదవ యింటిలో కుజుడు వుండగా యిరువురూ 1
నుండి 3 బిందువులను మాత్రమే కల్గియుండగా లగ్నము నుండి 3వ యింటిలో
పాపులుండుట.

పైన తెల్పిన సమ్మేళనములో కుజుడు వున్న రాశినందుగానీ, పాపులు
వున్న రాశినందుగానీ 1 నుండి 3 బిందువులు మాత్రమే వుండవలెను.

(18) (1) కేరళీయము ప్రకారము కుజుడు వున్న స్థానముగానీ లేదా
దానియొక్క త్రికోణ రాశియందలి రాశిగానీ ఏది శుభునిచే చూడబడితే ఆ
రాశియందుగల సంఖ్య సోదరుల సంఖ్యను సూచిస్తుంది.

మరికొంతమంది వ్యాఖ్యాతల ఆలోచన ప్రకారము "కుజుడు వున్న రాశి
దానియొక్క త్రికోణ రాశులయందలి బిందువులను కలిపి పాపులచే చూడబబడు
రాశులయందలి బిందువులను తీసివేయవలెను.

విధేయతతో కూడిన నా అనుభవములో పైన తెల్పిన రెండవ రకపు
వ్యాఖ్యానము వాస్తవానికి వర్తిల్లుట లేదు.

(19) మూడవ ఇంటిలో కుజుడు మూడు బిందువులతో వుంటే సోదరుల
సంఖ్య 9 అవుతుంది.

(20) మూడవ యింటి ముందు మూడు బిందువులు గానీ వున్నట్లయితే
సోదరుల సంఖ్య గతించిన నవాంశల సంఖ్యకు సమానమగును.

అష్టకవర్గు సూత్రములను అన్వయించుటకు ముందుగా మూడవ
భావము జాగ్రత్తగా పరిశీలించి దాని బలమును అంచన వేయవలెను.

(1) నారదీయము అను గ్రంథము ప్రకారము

(2) కుజుడు వున్న రాశి నందలి బిందువులు సంఖ్య సోదరుల సంఖ్యను
సూచించును.

() త్రికోణ శోధన తర్వాత మిగిలిన బిందువులు దీర్ఘాయువుగల సోదరుల
సంఖ్యను సూచించును.



మేము పరిశీలించిన అనేక జాతక చక్రముల యందు 21 (1) సూత్రము
పూర్తిగా వర్తిల్లినది. సూత్రము 21 (2) పూర్తిగా వర్తిల్లుటలేదు.

(22) కుజుడు 4 బిందువులతో కేంద్ర త్రికోణములలో ఎందైనా వుండగా
అది మేష, ధను, మకర రాశులలో ఒకటి అయితే ఒక రాష్ట్రాధినేత అగును.

(23) ఆ విధంగానే కుజుడు 5 బిందువులతో శనితో కలసి వున్నా లేక
శనితో పరస్పర వీక్షణములు కలిగివున్నా జాతకుడు ఒక రాష్ట్రాధినేత అగును.

(24) పైన చెప్పిన దానికి వ్యతిరేకముగా కుజుడు 1 నుండి 3
బిందువులను కలిగి వుండి బుధునితో కలసిగానీ లేదా బుధునిచే చూడబడిగానీ
వుంటే పేదరికము, బాధలు కల్గును.

(25) కుజుడు 5 గానీ అంతకంటె హెచ్చు బిందువులను కలిగి వుండి,
చంద్రునితో కలసిగానీ, వీక్షింపబడిగానీ వుండినచో జాతకుడు 2 లేక 3
గ్రామములకు అధిపతియగును.

(26) కుజుడు 4 బిందువులతో పదవ యింటిలో వుండగా శనిచేత
చూడబడితే సైన్యమునకు అధిపతి అగును. ఉన్నత వంశములో జన్మించి, 4
బిందువులతో స్వక్షేత్రమగు నాల్గవ యింటిలో వున్నచో రాజభవంతులను
పొందియుండును. నాల్గవ యిల్లు బదులుగా పై ఉదాహరణలో కుజుడు పదవ
యింటిలోగానీ వున్నచో జాతకుడు సైన్యాధికారి అగును. పై ఉదాహరణలో
జాతకుడు బ్రాహ్మణ, వైశ్య, శూద్ర కులస్థుడైతే క్రమముగా చాలా పవిత్రమైన
క్రతువులు చేయుట, ప్రఖ్యాత వ్యాపారవేత్త అగుట, ప్రముఖ సైన్యాధికారి
అగుట జరుగును.

కుజుని అష్టక వర్గుకి చెంది పైన తెలిపిన సమ్మేళనములు ఒక మోస్తరు
వుదాహరణలు మాత్రమే. వాస్తవ రాశి చక్రముల అవలంబనతో ప్రాచీన
గ్రంథములందు అగుపించు వానియొక్క ఉద్దేశ విస్తరణ కోసం కొత్త
సమ్మేళనములను ఏర్పరచుట సాధ్యం అవుతుంది. పైన తెల్పిన (10) సూత్రరీత్యా
కుజుడు 6-8-12లలో 6 బిందువులతో వుంటే సోదర రహితుడు అవుతాడు.

మూడవ యిల్లు పదకొండవ యిండ్లయందు కుజుడు 5 లేక 6 బిందువులతో వున్నా కూడా ఈ విధమైన ఫలితమే కలుగుట గమనించడమైనది. ఉదాహరణకు (3) శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ జాతకంలో కుజుడు ఆరు బిందువులతో మూడవ యింటినందు గలడు. ఆయన సోదర రహితుడు. కుజుడు యోగకారకుడు అగుచూ పదవ యింటిని చూచుటచే అష్టక వర్గు బలరిత్యా 75 శాతము బలము కల్గివుంది. కుజ మహాదశ ప్రారంభముతో జాతకునకు రాజయోగ ఫలితములు కల్గినవి. రూజ్‌వెల్టు జాతకం కుజునకు సంబంధించిన ఇంకొక ఉదాహరణ. యోగకారకుడుగా కుజుడు షుమారు 60 శాతము అష్టకవర్గు బలము కల్గి వున్నాడు. ఈ జాతకంలో కుజుడు యోగకారకుడుగా పదకొండవ యింటిలో కుజుడు లగ్నాధిపతి, పదవ యింటి అధిపతిని చూచుచున్నాడు. ఆరవ యింటికి కుజుని వీక్షణము కల్గుట రూజ్‌వెల్టు జీవితాంతం అనారోగ్యంగా వుడ్డునట్లు చేసింది.

(10) ముస్సోలినీ జాతక చక్రములో గమనించ దగిన లక్షణం ఏమింటంటే లగ్నం కుజునికి సంబంధించినది (వృశ్చికం) అవుతుండగా ఏడు బిందువులను కలిగి వుంది. కుజుడు 7 వ యింటిలో 6వ బిందువులను కల్గి వున్నాడు. ఇదే జాతకుని ఉగ్రముగానూ దూకుడు తనము కలవాని గానూ చేసింది. సూత్రం (23) యథాతథంగా వర్తిల్లింది. ఎందుకంటే కుజుడు బలంకలిగి 5 కంటె ఎక్కువ బిందువులు కల్గియుండి జాతకుడు దేశాధినేతగా అగునట్లుగా శనితోకూడా కలసి వున్నాడు. అతడు నిశ్చయముగా ఇటలీ దేశానికి చెందిన ఒక గొప్ప నియంత. శ్రీ గోల్‌వాల్‌కర్ (ఆర్. ఎస్. ఎస్. నాయకుడు) ఒక్కడే జీవించి వున్న కుమారుడు. మిగిలిన మొత్తం ఎనిమిది మంది అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు మరణించారు. అతనికి కుజుడు మూడవ యింటిలో, మూడు బిందువులతో మాత్రమే గలడు. పైన తెల్పిన (12) సూత్రం ప్రకారం యిది తోబుట్టువుల మరణాన్ని సూచిస్తుంది.

(27) కుజుని యొక్క శోధ్యపిండ సంఖ్యను (శోధనకు ముందు) కుజుని నుండి మూడవ స్థానములో వున్న బిందువులచే హెచ్చవేసి 27చే భాగించవలెను. శేషసంఖ్యగా అశ్విని నుండి గల నక్షత్రము నందు శని చరించు సమయములో సోదరులకు మరణము గానీ బాధలు గానీ కల్గును. గురుని నుండి ఏడవ స్థానము నందున్న సంఖ్యతోను, రవినుండి ఏడవ స్థానము నందున్న సంఖ్యతోను



కుజుని యొక్క శోధ్యపిండ సంఖ్యను పైన చెప్పిన విధముగానే చేయవలెను.

ఇచ్చిన ప్రామాణిక జాతకములో కుజుని శోధ్యపిండము 197. కావున

| శని | గురు | రవి |
|---|---|---|
| 197 × 2 | 197 × 3 | 197 × 4 |
| 27) 394 (14 | 27) 591 (21 | 27) 788 (29 |
| 27 | 54 | 54 |
| 124 | 51 | 248 |
| 108 | 27 | 243 |
| శేషం 16 | శేషం 24 | శేషం 5 |

జవాబుగా వచ్చిన నక్షత్రములు విశాఖ, శతభిష, మృగశిర. శని గోచర రిత్యా విశాఖ నక్షత్రమునందు, గురుడు శతబిషనందు, రవి మృగశిర నందు చరించు సమయములలో సోదరులు బాధలకు గురి అగుదురు.

(28) కుజుని శోధ్యపిండ సంఖ్యను కుజుని నుండి మూడవ స్థానములో గల సంఖ్యచే హెచ్చవేసి 12చే భాగింయవలెను. దేషముగా గల సంఖ్యతో మేషాదిగాగల రాశిని కనుగొనవలెను. ఆ రాశినందు గోచారరిత్యా గురుడు సంచరించే సమయములో సోదరులు అదృష్టమును, అభివృద్ధిని పొందుతారు.

ఇచ్చిన ప్రామాణిక జాతకంలో 197 × 2

394 ÷ 12

శేషం 10 - మకర రాశి

కావున గురుడు గోచార రిత్యా మకర రాశినందు చరించు సమయమునందు సోదరులు అభివృద్ధిని పొందుతారు.

ఒక వ్యక్తికి ఒకని కంటె ఎక్కువ మంది సోదరులు గానీ వున్నట్లయితే ఏ సోదరుడు అభివృద్ధి చెందుతాడో తెలుసుకోవటానికి ఏ విధమైన సూచనా చేయబడలేదు. జాతకుని మూడవ భావం పరిశీలిస్తూ, జాతకుని సోదరుల జాతకాలను కూడా విడివిడిగా అన్వయించటం గానీ లేదా అందరు సోదరులకూ కుడా శుభమని చెప్పవలసి వున్నది. ఈ విధమైన రెండవ సూత్రము అసంభవ మైనది అగును.



# అధ్యాయం-7

## బుధాష్టక వర్గు

1 గానీ అంతకంటె ఎక్కువ బిందువులున గానీ బుధుననికి తన అష్టక వర్గులో వున్నట్లయితే ఫలితములు ఈ విధంగా ఉంటాయి.

0 బిందువులు : మరణ భయము, శతృభయము.
1 బిందువు : నష్టము.
2 బిందువులు : కుటుంబ సభ్యులతో అపార్ధము, అపోహలచే అశాంతి
3 బిందువులు : ధన నష్టముచే వ్యధ.
4 బిందువులు : వృత్తి నష్టము.
5 బిందువులు : స్నేహము, అందరితో సదవగాహన.
6 బిందువులు : అన్ని కార్యముల యందు జయము.
7 బిందువులు : ధనము, సంతోషము, గౌరవము.
8 బిందువులు : ప్రభువుల అనుగ్రహము.

(1) బుధుని నుండి నాల్గవ యింటి ద్వారా కుటుంబము, సంపద, సంతానము గురించి పరించవలెను. ఆధ్యాత్మిక సాధనలో అభివృద్ధి, పాండిత్యము, రచనా వ్యాసంగము, తెలివితేటలు మొదలైనవి బుధునినుండి 5వ యింటిద్వారా తెలుసుకోవలెను.

(2) బుధునికి 8 బిందువులు వుండగా కేంద్రత్రికోణములలో ఎక్కడైనా వున్నట్లయితే తనయొక్క జాతి, తెగలకు చెందు పాండిత్యము నందు ప్రావీణ్యతను కల్గియుండును. బుధుడు ఉచ్చలోగానీ. స్వక్షేత్రములో గానీ వుండగా 2 లేక 3 బిందువులున్ననూ భావము అభివృద్ధికి హాని కల్గును. అటువంటి భావము నశింపదు.

(3) బుధుడు 1 నుండి 3 బిందువులతో 6 లేక 8 యిండ్లలో వుండి శుభుల దృష్టికూడా పొందినట్లయితే అట్టి జాతకుడు వంచకుడు, దొంగతనము వంటి వంకర బుద్ధి కలవాడు అగును.



(4) శుక్రునితో కలసి వుండగా బుధుడు 1 నుండి 3 బిందువులతో 6/8/12 యిండ్లలో ఎక్కడైనా వుంటే జాతకుడు చదువు రానివాడు అవుతాడు.

(5) బుధుడు కేంద్ర కోణములలో ఎక్కడైనా వుండగా 5 బిందువులను కల్గివుండి గురుడితోగానీ, శనితోగానీ కలిసి వుండిగానీ, వీక్షింపబడినాగానీ వుంటే జాతకుడు వేదములయందు పాండిత్యము కలవాడు అగును.

(6) బుదుడు 5 బిందువులతో శనినుండి నాల్గవ యింటిలో గానీ 6వ యింటిలోగానీ వుండగా గురుడు రెండవ యింటిలో వున్నా లేక రెండవ యింటిని చూచినా జాతకునికి జ్యోతిష శాస్త్రమందు ప్రావీణ్యత సూచింపబడుతుంది.

(7) బుధుడు 5 బిందువులతో వుండి గురునితో కలసివున్నా లేక కుజునితో కలసి వున్నా కుజునితో చూడబడినా గొప్ప తర్క శాస్త్రజ్ఞుడు అగును.

(8) బుధుని అష్టక వర్గులో కేతువు 3 బిందువులతో 5వ యింటిలో వుండినా లేక 5వ యింటి అధిపతితో కలసివున్నా జాతకుడు జ్యోతిషము లేక అటువంటి శాస్త్రములందు ప్రావీణ్యత కల్గియుండును.

(9) బుధుడు 4 బిందువులతో కుజని యొక్క రాశినందు శుక్రుని యొక్క నవాంశము నందు వుండగా గురునిచే చూడబడినట్లయితే జాతకుడు మంచి సాహితీవేత్త అగును.

(10) బుధుడు 4 బిందువులతో వుండగా పాపులతో కలసివుండి, నీచనవాంశలో గానీ వున్నట్లయితే నృత్యము, నటన, సంగీతము, హాస్యము, వశీకరణము వంటి వాటియందు ప్రావీణ్యత కల్గును.

(11) గర్గ మహర్షి చెప్పిన దాని ప్రకారము బుధుడు 1 నుండి 3 బిందువులతో నుండగా సరినవాంశనందున్నచో అటువంటి భావము నశించి పోవును. అయితే కొంతమంది "గర్గ మహర్షి చెప్పిన యుగ్మనవాంశ మిదున నవాంశయేకానీ, సరి నవాంశ కాదు అని అభిప్రాయ పడుతున్నారు.

(12) బుధుడు వున్న రవ్యాధిపతికి హెచ్చు బిందువులు కల్గి కేంద్రకోణాలలో ఎక్కడైనా వున్నట్లయితే కీర్తి, తెలివితేటలు, పాండిత్యము వంటివి కలుగుతాయి. అయితే అటువంటి గ్రహము 6-8-12లలో ఎక్కడైనా వున్నట్లయితే

చదువుకు ఆటంకము కలుగుతుంది.

(13) బుధుడు ఉచ్ఛ, స్వక్షేత్రములలో వుండగా 1 నుండి 3 బిందువులు వుండినా, నీచ, అస్తంగ, శతృక్షేత్రములలో వుండగా బుధునికి 4 అంతకంటె హెచ్చు బిందువులు కల్గినా భావమునకు అభివృద్ధి కల్గును. అయితే నీచ, అస్తంగ శతృక్షత్రములలో నాలుగు కంటె తక్కువ బిందువులు కలిగివుంటే మాత్రం భావం సంతృప్తికరంగా అభివృద్ధి చెందదు.

ఇచ్చిన "ప్రామాణిక జాతకము (చక్రము-12) నందు బుధుడు 3 బిందువులతో కేంద్రము నందుండగా గురుని వీక్షణమును పొందుతున్నాడు. కేతువునకు పైన తెల్పిన సూత్రము 8 ప్రకారము 3 బిందువులు మాత్రము కావలసి వుండగా 5వ యింటిలో 6 బిందువులు కలవు. 1964 నుండి జాతకురాలునకు బుధ మహాదశ ప్రారంభం అవుతుంది. ఆమెకు జ్యోతిషము వేదములు నేర్చుకొనుటలో అమితమైన ఆసక్తి వుండటం వలన ఆ శాస్త్రములలో ఆ సమయములో మంచి ప్రావీణ్యతను సంతరించుకొనుట నిరూపిత మగును. బుధుని రాశ్యాధిపతియైన శుక్రుడు 9వ యింటిలో 5 బిందువులతో గలదు. అందువలన పైన తెల్పిన సూత్రం (12) ప్రకారము ఆ శాస్త్రములయందు గొప్ప తెలివితేటలు గల్గును.

(14) బుధుని నుండి రెండవ యిల్లు నుందు బిందువులు లేనట్లయితే జాతకుడు మూగవాడు కానీ లేక స్పష్టముగా మాట్లాడలేని వాడు కానీ అగును.

(15) 2 లేక 3 బిందువులుగానీ (పైన తెల్పిన సందర్భములో) వుంటే జాతకునిమాట చపలముగానూ, ఒకదాని కొకటి సంబంధము లేకుండా అసందర్భము గానూ వుండును.

(16) బుధుడు 4,5 లేక 6 బిందువులతో వున్నట్లయితే శక్తివంతమైన మనోజ్ఞమైన వక్త అగును. అతని మాటలు అర్ధవంతముగా బరువుగా వుంటాయి.

(17) బుధుడు నుండి రెండవ యింటినందు 7 బిందువులుంటే గొప్పకవి అగును. 8 బిందువులుంటే ఎదురు చెప్పలేని వాక్కును కలిగి వుండును.



-ప్పలయొక్క బిందువులు హెచ్చుగా వుంటే అహంకారపు మాట తీరు కల్గివుండును. లేనిచో అతడు వినయ విధేయతలు కల్గు పల్కులు మాట్లాడును.

ఇచ్చిన ప్రామాణిక జాతకములో బుధునినుండి 2వ యింటిలో 6 బిందువులు కలవు. జాతకురాలు స్పష్టముగా, తర్కసహిత సూటిగా భావప్రకటన కలిగి యున్నది. 6 బిందువులలో 3 బిందువులు శుభుల వలన కల్గినవి.

(18) బిందువు రవి వలన కల్గితే అనుగ్రహముతో కూడిన పల్కులు, శని వలన కల్గితే అసత్యములు గానీ లేక అస్పష్టతతో కూడిన పల్కులుగానీ కలిగి యుండును. కుజుని బిందువు అయితే క్రూరమైన, కోపము పుట్టించెడి పల్కులు, బుధుని బిందువు అయితే హాస్యభరితము, రమ్యమైనది, గురుని బిందువు అయితే స్పష్టత తెలివితేటలు విశదపరచు పల్కులు, శుక్రుని బిందువు అయితే మధ్య మధ్యలో ముచ్చటకొలిపే ఆదర్శవంతమైన పల్కులు, పాప సంబంధము లేని చంద్రుని యొక్క బిందువు అయితే మనోహరమైన నిర్భయముతో కూడుకున్న పల్కులు, పాప సంబంధముగల చంద్రుని బిందువయితే అశ్రద్దతో నున్న గ్రహించరాని పల్కులు కల్గి యుండును.

(19) శోధన తర్వాత బుధుడు వున్న రాశిలో బిందువులు గానీ లేనట్లయితే జాతకుడు ఉత్సాహము లేనివాడు సోమరి అగును.

(20) బుధుని శోధ్యపిండ సంఖ్యను శోధనకు ముందు బుదుని నుండి రెండవ యింటిలో గల బిందువుల సంఖ్యతో హెచ్చవేసి 12చే భాగించగా వచ్చు శేషము మేషము నుండి గల రాశియొక్క అధిపతిని గుర్తించవలెను. ఇటువంటి గ్రహము యొక్క దశ అంతర్దశా సమయములలో జాతకులకు సంబంధించు విద్య , స్నేహితులు మధ్యవర్తిత్వముల వంటి విషయములలో శుభఫలములు కలుగుతాయి. అటువంటి రాశినందు గురుడు సంచరించు సమయములలో కూడ ఆ విధమైన శుభ ఫలితాలే కలుగుతాయి.

ప్రామాణిక జాతకంలో బుదుని అష్టకవర్గులో బుధుని నుండి రెండవ యింటిలో 6 బిందువులు గలవు. బుధుని శోధ్యపిండ సంఖ్య 158. ఈ రెండింటి

లబ్దము 948.. దీనిని 12చే భాగించగా శేషము 0 అనగా 12 వచ్చును. మేషము నుండి 12వ రాశి మీనము అగును. గురు మహాదశ, గురు అంతర్దశ సమయములు, మీనము నందు గురుడు సంచరించు సమయములందు గురువి కారకత్వమునకు సంబంధించు విషయము లన్నింటియందు చాలా అనుకూల మైన ఫలితములు కల్గును.

(21) బుధుని నుండి 4 నందుగల సంఖ్యతో బుధుని శోధ్యపిండ సంఖ్యను హెచ్చవేసి ఆ లబ్దమును 27చే భాగించవలెను. శేషముగా వచ్చు అశ్విని మొదలుగా గల నక్షత్రమునందు శని సంచరించు సమయమలో బంధువులతో అపార్ధములు, మనోవ్యధ, సాధారణమైన అశుభఫలములు కల్గును.

ఇచ్చిన ప్రామాణిక జాతకములో బుధుని నుండి నాల్గవ స్థానములో 4 బిందువులు కలవు. బుధుని శోధ్యపిండము 158. వీటి లబ్దము 632. దీనిని 27చే భాగించగా శేషము 11 వచ్చును. అశ్వినీ నక్షత్రాదిగా 11వది పుబ్బ నక్షత్రము అగును. కావున శని పుబ్బా నక్షత్రము నందు సంచరించు సమయములో జాతకురాలునకు పైన తెల్పిన విషయములలో అశుభఫలములు కల్గును.

(22) బుధును నుండి 10వ స్థానములో గల బిందువుల సంఖ్యతో బుధుని శోధ్యపిండ సంఖ్యను హెచ్చవేయవలెను. వీని లబ్దమును 27చే భాగించవలెను. శేషము సూచించు సంఖ్యగల నక్షత్రముద్వారా శని చరించు సమయము నందు జాతకునకు అసంతృప్తి, వ్యాపార నష్టము, వృత్తిలో ఒడిదుడుకులు కల్గును.

ప్రామాణిక జాతకంలో బుధుని నుండి 10వ స్థానములో5 బిందువులు కలవు. బుధుని శోధ్యపిండ సంఖ్య 158. వీని లబ్దము 790. దీనిని 27చే భాగించగా 7 శేషము వచ్చును. అశ్విని నుండి 7వది పునర్వసు నక్షత్రము. శని పునర్వసు నక్షత్రము ద్వారా సంచరించు సమయములో వ్యాపారములో నష్టము. మామూలుగా అనుకూలము కాని సమయముగా భావించవలెను.

పైన తెల్పిన సూత్రం (12)ను చాలామంది మఠాధిపతుల సాధువుల జాతకాలలో పరిశీలించాలి. శృంగేరీ పీఠాధిపతి అయిన (12) స్వర్గీయ నరసింహ



భారతి జాతకంలో బుధుని యొక్క రాశ్యాధిపతయైన శని 10వ యింట్లో 6 బిందువులతో గలడు. వారి ఆధ్యాత్మిక సంపద మేధావి తన సంపదలు అసమాన మైనవి. గోవర్ధన మఠమునకు చెందిన స్వర్గీయ శంకరాచార్య వారికి కుజునితో కలసి 12 నందు 7 బిందువులతో బుధుడు గలడు. అయితే బుధుని రాశ్యాధిపతియైన శని తొమ్మిదవ యింటిలో 6 బిందువులతో గలడు. వారు గొప్ప పండితుడు. అనేకరకములైన విషయమలపై ఉపదేశించగల్గిన వ్యక్తి. రమణ మహర్షి (13) విషయములో బుధుని రాశ్యాధిపతియైన కుజుడు ఏడవ యింటిలో తన యింటిలో వుండటమే కాకుండా 5 బిందువులతో కూడ గలడు. వారికీర్తి ఆధ్యాత్మిక సాధన ప్రపంచ జయజయ ధ్వానములను పొందాయి.

ప్రొఫెసర్ బి. సూర్యనారాయణరావు గారు జ్యోతిష శాస్త్రములో గొప్ప పాండిత్యము సంపాదించటమే కాకుండా వేదాలలో కూడా అమిత లోతైన జ్ఞానము కలదు. బుధుడు పదవ యింటిలో 5 బిందువులతో వుండగా గురునితో కలసి వున్నాడు. లగ్నము నుండి రెండవ యింటిని గురుడు చూచుచుండుట కూడా జరిగింది.



# అధ్యాయం-8

## గురు అష్టకవర్గు

1 కానీ అంతకంటె ఎక్కువ బిందువులను గురుడు కలిగివుంటే ఫలితములు ఈ విధంగా ఉంటాయి.

0 బిందువులు : బంధునష్టము, సంపద నష్టము

1 బిందువు : అనారోగ్యము, బాధలు

2 బిందువులు : ప్రభువుల నుండి భయము

3 బిందువులు : చెవికి సంబంధించిన వ్యాధులు, శక్తిని కోల్పోవుట

4 బిందువులు : అంతమంచిదీకాదు, చెడు కూడా కాదు

5 బిందువులు : శత్రువులపై జయము, చేపట్టిన అన్ని కార్యములయందు జయము

6 బిందువులు : సంపద లాభము, వాహన లాభము మొదలైనవి

7 బిందువులు : గొప్ప అదృష్టము, సంతోషము

8 బిందువులు : గొప్ప కీర్తి, సంతోషము, సంపద

(1) గురుడు 5 గానీ అంతకంటె హెచ్చు బిందువులతో 6-8-12 స్థానములలో వుంటే సంపద పొందుట, శత్రువుని జయించుట, మంచి ఆయుర్దాయము కల్గును.

ప్రామాణిక జాతకంలో గురుడు 6వ ఇంటిలో 7 బిందువులతో గలదు కాబట్టి పైన తెల్పిన శుభ ఫలములు కలుగవలసి వుంది.

(2) గురు అష్టక వర్గులోగానీ రవి అతి తక్కువ బిందువులుగల రాశిలో వున్నట్లయితే జాతకుడు దురదృష్టవంతుడై జీవితముతో పోరాడవలసి వుంటుంది.

(3) గురుడు 8 బిందువులను కలిగి వుండి కేంద్ర త్రికోణములలో ఉచ్ఛలోగానీ, స్వక్షేత్రములో గానీ వున్నట్లయినా లేక మరి యే యితర స్థలములలోనైనా నీచ, అస్తంగత్వ, శతృక్షేత్ర స్థితి కాకుండా వుండినచో వ్యక్తి స్వయం కృషితో ప్రభువగును.

ఈ సమ్మేళనము అతి మామూలుగా చెప్పబడింది. నీచ శతృక్షేత్రములలో గురుడు లేకుండా వుండగా 8 బిందువులతో వుంటే ఈ సత్ఫలితములు కలుగుతాయి. కొంతమంది పండితులు వేరు విధమైన వివరణను యిస్తున్నారు. వారి వివరణ రీత్యా గురుడు ఉచ్ఛలోగానీ స్వక్షేత్రములోగానీ లేక శతృక్షేత్ర అస్తంగత్వాదులు లేకుండా ఉండవలెను. దీనితోపాటుగా గురుడు కేంద్ర త్రికోణములలో ఎందైనా వుండవలెను. అనేక రాశి చక్రముల పరిశీలించుటచేత, ప్రతి ఒక రకమైన సమ్మేళనము వలన యోగము యొక్క తీవ్రత మారుతూ వుంటుందని నాకు అనిపిస్తున్నది. ఆ విధంగా కేంద్రంలో ఉచ్ఛలో 8 బిందువులతో వున్నది అత్యంత హెచ్చు శక్తి గల యోగము అవుతుంది. శతృక్షేత్ర అస్తంగత్వాదులు లేకుండా కేంద్ర త్రికోణములలో కాకుండా వేరే యింటిలో వుంటే గురుడు యోగం కలుగజేస్తాడు. కానీ కొంత తక్కువ శ్రేణిలో (పైన చెప్పిన యోగము కంటే తక్కువ రకం యోగము) కలుగజేస్తాడు. అందువలన వాస్తవంలో యోగంయొక్క ప్రాముఖ్యతను అంచనా వెయ్యటంలో చాలా జాగ్రత్తను తీసుకోవలసి వుంటుంది.

(4) మరియొక ప్రామాణిక గ్రంథమైన నారదీయమందు, గురుడు 8 బిందువులతో కేంద్ర త్రికోణములలో ఉచ్ఛ, స్వక్షేత్రములై ఉండగా వున్నచో ధనవంతుడు, ప్రభువు లేక అంతటివాడు అగునని స్పష్టముగా చెప్పబడి వున్నది. ఈ విధమైన యోగము కల్గిన బ్రాహ్మణుడు దీక్షితుడుగా క్రతువులు చేయించువానిగానూ, గ్రామములను కలిగియుండి, శాస్త్రములందు పాండిత్యము కల్గియుండి, ప్రజాసభలలో గౌరవమునందును, వైశ్యుడైతే ప్రఖ్యాత వ్యాపారస్తుడుగానూ, శూద్రుడైనచో ఇటువంటి యోగము కల్గినచో ప్రభువులను సేవించుచూ సైన్యాధిపతిగా సంపాదన కల్గి వుండును.

వర్ణాశ్రమ ధర్మము త్వరితంగా కనుమరుగవుతున్న కాలంలో మనం జీవిస్తున్నామన్న సంగతి మనం గుర్తుంచుకోవాలి. అందువలన యిటువంటి

యోగాలను వివరించేటప్పుడు ఈ సూత్రాలు నిర్దేశింపబడినప్పటి కాలం కాకుండా ఈ రోజుల్లో సమాజాన్ని అనుసరించి వివరిస్తూ వుండాలి.

(5) పైన చెప్పిన యోగంలో గురునికి 7 బిందువులుంటే అట్టి వ్యక్తి సంపదలు, స్త్రీలు, అదృష్టము కలిగి వుండును. 6 బిందువులుంటే వాహనములు, ధనము వుండును. 5 బిందువులయితే సత్ప్రవర్తన, జయము కల్గును.

(15) డాక్టర్ రవీంద్రనాథ్ ఠాగూర్ అయిదవ ఇంటిలో గురుడు ఉచ్ఛలో వుండగా 7 బిందువులను కల్గివున్నాడు. అందువలన యోగంయొక్క పూర్ణ ఫలితములు ఆయనకు కలిగాయి. (16) స్టాలిన్ జాతకంలో కూడా గురుడు 5వ ఇంట్లో 7 బిందువులతో కలడు. ఇది ఒక బలమైన రాజయోగము.

(6) 6-8-12 యిండ్లలో గురుడు 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కల్గివుంటే సంపద కల్గివుండుట, శతృవులపై జయము, మంచి ఆయుర్దాయములు కల్గును.

ఈ యోగము యిచ్చిన ప్రామాణిక జాతకంకి పూర్తిగా వర్తిల్లుతుంది. ఇక్కడ గురుడు 6వ యింట్లో 7 బిందువులతో వున్నాడు. కొన్ని విషయములలో జాతకురాలు చాలా అదృష్టవంతురాలని చెప్పవలసి వుంటుంది.

(7) రాజయోగముల సమ్మేళనములుగల జాతకంతో పుట్టినటువంటి వ్యక్తి అయినా చంద్రుడు 1 నుండి 3 బిందువులతో గురుని నుండి 6-8 స్థానాలలోగానీ వున్నట్లయితే ఋణములూ, బాధలూ కల్గి వుంటాడు.

(8) గురుడు వున్న రాశ్యాధిపతి ఉచ్ఛ లేక స్వక్షేత్రములలో వుండగా 5 లేక అంతకంటే హెచ్చు బిందువులను కల్గి వున్నట్లయితే ప్రభువులలో ప్రముఖుడు అగును.

(9) ఒక వ్యక్తి కేసరి యోగంలో జన్మించి చంద్రునియొక్క నవాంశలో గురుడు వుండగా అట్టి గురునకు 5 లేక అంతకంటే హెచ్చు బిందువులుగానీ వున్నట్లయితే జాతకుడు సంపద, సుఖములు కల్గియుండును.



(10) గురుడు వున్న రాశ్యాధిపతి గురుని నుండి 6-8లలో వుండి 3 బిందువులను కల్గియుంటే అట్టి జాతకుడు పేదతనము కల్గి వుండుట గానీ లేక సాధారణ జీవితం అనుభవించటంగానీ జరుగును.

(11) గురుడు వున్న రాశ్యాధిపతి కేంద్ర కోణాలలో వుండగా 4 లేక హెచ్చు బిందువులను గుర్వష్టక వర్గులో కల్గియుంటే అట్టి జాతకుడు ధనవంతుడు అగుచూ కుటుంబ జీవితములో అదృష్టవంతుడగును.

ఇచ్చిన ప్రామాణిక జాతకంలో గురుడియొక్క రాశ్యాధిపతియగు బుధుడు కేంద్రంలో 6 బిందువులతో వున్నాడు (జాతకురాలు కుటుంబపరంగ అదృష్టవంతురాలు, ధనవంతురాలు)

(12) గురుడు నీచ నవాంశనందు 1 నుండి 3 బిందువులను కల్గియుండగా శని 2 లేక 11 ఇండ్లలో వుంటే జాతకుడు మందబుద్ధి అగును.

(13) శుక్రుని నుండి లేదా లగ్నం నుండి కేంద్రములో గురుడు 4 లేక అంతకంటే ఎక్కువ బిందువులతో వుండగా శుక్రుడితో గురుడు కలిసి వుండినా లేదా పరస్పర వీక్షణములు కలిగి వుండినా అట్టి జాతకుడు ప్రభువుగానీ ప్రభు సమానుడుగానీ అగును.

(14) గురుని నుండి లగ్నము 6-8 స్థానములు అగుచూ లగ్నమునందు 1 నుండి 3 బిందువులు మాత్రమే వుండగా లగ్నాధిపతి బలహీనముగా నున్నచో అట్టి జాతకుడు సాధారణ తెలివితేటలను కలిగి వుండి దురదృష్టవంతుడగును.

(15) గురుడు కానీ లేక 9వ ఇంటి అధిపతిగానీ లేక 10వ యింటి అధిపతిగానీ 7 లేక 8 బిందువులను కలిగి కేంద్రములో నుండగా ఆ ముగ్గురిలో ఏ ఒక్కని రాశ్యాధిపతి అయినా బలంగా వుంటే అట్టి వ్యక్తి చాలా అదృష్టము పొందును.

ప్రామాణిక జాతకంలో గురునికి 7 బిందువులు కలవు. 9వ ఇంటి అధిపతి అగు బుధుడు 6 బిందువులలోగలడు కాబట్టి జాతకురాలు తప్పకుండా అదృష్టవంతురాలు అని చెప్పవచ్చును.

(16) లగ్నాధిపతి 2/9లలో వుండగా గురుడు కేంద్రములో 5 బిందువులతో వుంటే జాతకుని తండ్రి జాతకుని ద్వారా ఘనత పొందుతాడు.

(17) గురుడు తొమ్మిదవ యింటి అధిపతి అగుచూ కేంద్రమునందుగానీ ఉచ్ఛ స్వక్షేత్రముల యందుగానీ వుండగా హెచ్చు బిందువులను కల్గి వుంటే జాతకుడు ప్రభువుగానీ సైన్యాధిపతిగానీ అగును.

(18) గురుడు 1 నుండి 3 బిందువులను కల్గియుండగా గురుడు స్వక్షేత్రములో నుండగా అది లగ్నముగానీ త్రికోణముగానీ అయివుండి గురుడు పాపులతో కలిసి వుంటే జాతకునికి సంతాన నష్టముచే దుఃఖము కల్గును.

(19) అయిదవ యింటి అధిపతి, ఎనిమిదవ యింటి అధిపతులిద్దరూ పరస్పరము పరివర్తనము చెందుచుండగా ఇరువురూ కూడా తక్కువ బిందువులను కల్గియుండి గురుని దృష్టి పొందకుండా వుండినచో సంతానము వలన, మనుమల వలన బాధలు కల్గును.

(20) లగ్నము నుండి గురుడు 6-8-12లలో వుండగా గురుని నుండి మూడవ యింటి నందు, అయిదవ యింటినందుగల బిందువులంత సంఖ్య సంతాన నష్టము కలుగును.

ఈ సందర్భములో గురుడు హెచ్చుగా పాపుల సంబంధము కల్గియుండకపోతే సంతాన నష్టము జోస్యము చెప్పకూడదు.

(21) అయిదవ యింటి అధిపతి వున్న రాశ్యాధిపతి 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కలిగి వుండి గురునిచే చూడబడిగానీ లేక గురునితో కలిసికానీ వుంటే అట్టి జాతకునికి వంశమునకు పేరు తెచ్చు కుమారుడు కల్గును. దీనికి బదులుగా అట్టి గ్రహము (అయిదవ యింటి అధిపతియొక్క రాశ్యాధిపతి) 1 నుండి 3 బిందువులను కల్గియుండి నీచలో వుంటే అట్టి జాతకునకు విశ్వాసఘాతకుడైన కుమారుడు కల్గును.

(22) అయిదవ యింటి అధిపతికి పాపుల సంబంధము కల్గి, కారకుడైన గురుడు 1 నుండి 3 బిందువులతో పాపార్గళము (పాపుల మధ్య) పొందియున్నచో అట్టి వ్యక్తికి పాపాత్ముడు, కుటుంబానికి కళంకం తెచ్చేటటువంటి కుమారుడు కల్గును.



గురుని అష్టకవర్గు వివరించటంలో సంపూర్ణ వివరణలను "ప్రశ్న మార్గ" కల్గి వుంది. పాఠకుని సమాచారం కోసం నేను కొన్ని ముఖ్యమైన సమ్మేళనములను (యోగములను) అందునుండి ఏర్చి తీస్తాను.

సంతాన సంఖ్యను నిర్ణయించటం గురించి దిగువ తెలియజేసిన కొన్ని సూత్రములు అనేకసార్లు చెప్పబడుట, పరస్పర విరుద్ధముగానుండుట గమనించవచ్చును. జ్యోతిషమునందు అనేక విషయములను పరిగణించవలసి వస్తుంది. అనే సత్యాన్ని గుర్తు వుంచుకుంటే తెలివైన అనుభవంగల జ్యోతిష్కుడు హెచ్చుగా కష్టపడకుండానే పైన తెల్పిన సూత్రములలో అగుపించు బాహ్య విరుద్ధతలను సమన్వయ పరచగలడు.

(23) గురుని నుండి అయిదవ యింట అధిపతి వున్న రాశియందు (శోధన తర్వాత) గల బిందువులను గమనించండి. జాతకునికిగల సంతానసంఖ్యను ఇది తెలుపుతుంది. (ఇదివరకు మొత్తము బిందువులను పరిగణించవలసినదిగా మీరు కోరబడినారు) ఈ బిందువులయొక్క గ్రహముల ననుసరించి సంతానముయొక్క తత్త్వము ప్రవర్తన ఆధారపడి వుంటుంది.

వాస్తవంలో ఈ పద్ధతి సరియైనదిగా అగుపించటం లేదు. అంతేకాకుండా శోధనకు తర్వాత అష్టకవర్గు శోధనకు ముందు అష్టకవర్గులా నమ్మకమైన ఫలితాలనిస్తున్నట్లు అగుపించటం లేదు. కాబట్టి గురుని నుండి అయిదవ స్థానమునందు శోధనకు ముందు వున్న సంఖ్యను పరిగణించటం మంచిది. ప్రాచీన గ్రంథములందు అగుపించు కొన్ని పద్ధతులను నేను యిచ్చాను. కొన్ని పరిశీలనల తర్వాత ఈ పద్ధతుల విశ్వసనీయతాదులను అంగీకరించటం తెలివైన పాఠకుల వివేకానికి వదిలివేయబడింది.

(24) గురుని అష్టకవర్గులో గురుని నుండి అయిదవ యింటిలో శనియొక్క రాశి నవాంశలలో గల గ్రహములయొక్క బిందువులు ఎక్కువగా వుంటే జాతకుడు ఒకరిని దత్తతగా స్వీకరించును.

(25) శోధన తర్వాత మిగిలిన బిందువులన్నీ కలిసి, పాపులుగల రాశులయందలి బిందువులను తొలగిస్తే జాతకునికిగల సంతానం మొత్తం సంఖ్య వస్తుంది.

ప్రామాణిక జాతకంలో శోధన తర్వాత (గుర్వాష్టకవర్గు) బిందువుల సంఖ్య 11. దీని నుండి శని వున్న రాశి నందలి బిందువు (1) కుజుడు (0) లను తొలగించగా మిగిలిన సంఖ్య 10. జాతకురాలునకు జీవించి వున్న సంతానము 8; ఒకరు చనిపోవుట, ఒకసారి గర్భస్రావము కల్గుట జరిగినది.

(26) గురుని నుండి అయిదవ యింటినందుగల బిందువులను తీసుకోండి (శోధనకు ముందు). నీచ, అస్తంగత్వ, శతృక్షేత్రముల యందలి గ్రహములచే కల్గు బిందువులను తొలగించండి. ఉచ్ఛ, స్వక్షేత్ర వక్రించిన గ్రహముల బిందువులను పెంచండి. ఆ విధంగా వచ్చిన సంఖ్య జాతకుని సంతాన సంఖ్యను తెల్పుతుంది. మగ, ఆడ సంతానము ఆ వచ్చిన బిందువుల నిచ్చు పురుష గ్రహము స్త్రీ గ్రహములకు అనుగుణముగా వుంటుంది.

ప్రశ్న మార్గ గ్రంథమునను సరించి ఉచ్ఛలోగానీ వక్రించిగానీ వున్న గ్రహము (3) సంతాన సంఖ్యను సూచిస్తుంది. వర్గోత్తమ, స్వక్షేత్ర, స్వనవాంశల యందు గ్రహము 2 సంతాన సంఖ్యను సూచిస్తుంది.

ప్రామాణిక జాతకంలో గురుని నుండి అయిదవ యింటిలో 6 బిందువులు గలవు. ఇవి శని, రవి, శుక్ర, బుధ, చంద్ర లగ్నములచే ప్రదానము చేయబడినవి. శని శతృక్షేత్రమందు, శుక్రుడు నీచనందు గలడు. 2 బిందువులను తొలగించగా మిగిలినవి 4. రవి వర్గోత్తమాంశలో గలడు. కావున రవి ప్రధానము చేయు సంఖ్యను రెండు రెట్లు చేయవలెను (2); బుధుడు వర్గోత్తమాంశలో గలడు. బుధుడు ప్రదానము చేయు సంఖ్యను రెండు రెట్లు చేయవలెను (2) మొత్తము సంఖ్య (8), శుక్ర, చంద్రులు స్త్రీ గ్రహములు. బుధుడు నపుంసక గ్రహము అయినప్పటికీ పురుషరాశియందుండుటచే పురుష గ్రహముగా భావించవచ్చును. కావున మొత్తం సంతాన సంఖ్య 8. మగ సంతానం 6 - ఆడ సంతానం 2.

అష్టకవర్గు పద్ధతి సంతానంయొక్క సంఖ్య, లింగము, సుమారుగా జనన సమయములను నిర్ణయించటానికి మనకు ఒక కిటుకు ఇస్తుందనటంలో సందేహము లేదు. అనీ అయిదవ యిల్లు సహజంగా లంగా వుండి సంతానం కలగటం సూచిస్తేనే ఈ విధానంని వర్తింపచేయాలి. తల్లిదండ్రుల జాతక చక్రాలు



బీజస్ఫుటము, క్షేత్ర స్ఫుటంలకు జవాబుదారీ కూడా అయివుండాలి. (హౌ టు జడ్జ్ ఎ హోరాస్కోప్ - అధ్యాయం 8 చూడండి)

గురుని నుండి అయిదవ స్థానము; లగ్నము నుండి అయిదవ స్థానములను సంతాన విషయమును నిర్ణయించటానికి పరిశీలించాలి. ఈ రెండు స్థానములలోగల బిందువుల సంఖ్య సంతాన సంఖ్యను సూచిస్తుంది. ఉచ్ఛ, స్వక్షేత్రము వంటి శుభ సూచనలచే బిందు సంఖ్య హెచ్చింపబడటము, నీచ, అస్తంగత్వముల వంటి అశుభ సూచనలచే బిందు సంఖ్య తగ్గింపబడటము జరుగుతుంది. లగ్నము నుండి అయిదవ స్థానమునందు; గురుని నుండి అయిదవ స్థానమందు చాలా బిందువులు వున్నప్పటికీ జాతకులకు సంతానం కల్గనటువంటి జాతక చక్రములు చాలా వున్నాయి. అటువంటి సందర్భాలలో అయిదవ యింటికి పూర్తిగా పాపుల సంబంధం కలిగి వుండటం గమనించవచ్చును.

(17) 1903 సంవత్సరంలో పుట్టిన వ్యక్తి జాతకంలో లగ్నం నుండి అయిదవ యింటిలో 6 బిందువులు (గురుని అష్టకవర్గు నందు) గురుని నుండి అయిదవ స్థానములో 7 బిందువులు కలవు. జాతకునకు నాల్గు వివాహములు జరిగాయి. కానీ అతనికి సంతానము కలుగలేదు. ఈ జాతకంలో అయిదవ యింటిలో రవి (మూడవ యింటి అధిపతి) నీచనందుండగా లగ్నాధిపతియైన బుధుడు వుండి ఎనిమిదవ యింటి అధిపతియైన శనిచే చూడబడడం జరిగింది. అయిదవ యింటి అధిపతి నాల్గవ యింటిలో నీచలో వుండి రాహువుతో కలిసి వున్నాడు. పుత్రకారకుడైన గురుడు శుక్ర నక్షత్రములో వుండగా హెచ్చుగా పాప సంబంధము కల్గివున్నాడు. అందువలన గురుని అష్టకవర్గునందలి (బిందు) స్థితి సంతాన విషయంలో సహాయకారి కాలేదు. అయితే గురుడు 4 బిందువులతో వుండటం వలన ఏడవ యింటి విషయంలో (వివాహం) బాగా బలంగా అనుకూలించింది.

ఇంకో ఉదాహరణ (18) జాతకంలో అయిదవ యింటి మామూలు స్థితి అనుకూలముగా వుండి సంతానం కల్గటం సూచిస్తున్నప్పటికీ, గురుని నుండి అయిదవ స్థానంలో 2 బిందువులు; లగ్నం నుండి అయిదవ స్థానంలో 4 బిందువులు కలవు. గురుని నుండి అయిదవ స్థానంలో 11వ యింటి అధిపతియైన

రవి వుండగా అయిదవ యింటి అధిపతియైన శని నీచలో గలడు. దీని బదులు లగ్నంనుండి అయిదవ యింటికి పాపుల సంబంధం కలగలేదు. అయిదవ యింటి అధిపతి పదవ యింటినందు 2, 9 యిండ్ల అధిపతియగు కుజునితో కలసి గలడు. కాబట్టి మనం లగ్నం నుండి అయిదవ స్థానంలోగల బిందువులను గుర్తించాలి. కుజ, గురు, శుక్ర లగ్నములచే మొత్తం 4 బిందువులు ప్రదానం చేయబడినవి. లగ్నం, కుజ, గురులకు పాప సంబంధము కలుగలేదు. ఆ విధంగానే శుభుల సంబంధం గానీ (బలంకానీ) కలుగలేదు. కాబట్టి వాటివలన కల్గిన బిందువులను యధాతథంగానే వుంటాయి. శుక్రుడు ఉచ్చలో గలడు. కాబట్టి ఆ సంఖ్య రెట్టింపు (2) చెయ్యాలి. మొత్తం అప్పుడు 5 అవుతుంది. వాస్తవానికి ఈ సంఖ్య సరి అయినదే. గురుడు శతృక్షేత్రంలో గలడు. లగ్నం పాపియైన కుజునిచే చూడబడుచున్నది. జీవించి వున్నవారి సంఖ్య 3.

(19) 5-12-1914నాడు జన్మించిన వ్యక్తికి అయిదవ యింటి అధిపతియైన గురుడు నీచలో ఉన్నాడు. అయితే ఆ యింటికి పాపుల సంబంధం కలుగలేదు. కాబట్టి సంతానం కలుగటానికి అవకాశం వుంది. గురు అష్టకవర్గులో గురుని నుండి అయిదవ స్థానంలో 4 బిందువులు వున్నాయి. లగ్నం నుండి అయిదవ స్థానంలో కూడా ఆ విధంగానే 4 బిందువులు వున్నాయి. ఈ రెండింటిలో మొదటిది బలముగా వుంది. గురుని నుండి అయిదవ స్థానమందలి బిందువులు రవి, కుజ, శని, లగ్నములచే ప్రదానం చేయబడ్డాయి. రవి, శనులచే ప్రదానం చేయబడ్డ బిందువులను తొలగిస్తే సంతానం సంఖ్య 2.

(20) 29-1-1905 నాడు జన్మించిన జాతకున రాశిచక్రము గురించి మేము ఏ విధమైన సంజాయిషీ ఇవ్వడానికి యిష్టపడటం లేదు. లగ్నం నుండి అయిదవ స్థానంలో 7 బిందువులు వున్నాయి. గురుని నుండి 5వ స్థానంలో కూడా 7 బిందువులున్నాయి. చూచీ చూడగానే అయిదవ యిల్లు బాగుంది. పదిమంది సంతానం కలిగితే ఒకే ఒక్క అమ్మాయి జీవించి వుంది. కారణం ఏమిటో తెలివైన పాఠకుడు తనంత తానుగా గ్రహించాలి.



(27) గురునియొక్క శోధ్యపిండ సంఖ్యచే గురుని నుండి అయిదవ యింటినందు గల బిందు సంఖ్యచే హెచ్చించి ఆ లబ్దమును 27చే భాగించగా వచ్చు శేష సంఖ్యగా అశ్విని నుండి గల నక్షత్రము నందు గురుడు చరించు సమయమునందు జాతకునకు సంతానం కలుగుతుంది.

ప్రామాణిక జాతకంలో గురుని శోధ్య పిండము 124. గురుని నుండి అయిదవ స్థానములో 6 బిందువులు వున్నాయి. వీనియొక్క లబ్దము 744. దీనిని 27చే భాగించగా శేషము 15 వచ్చును. అశ్విని నుండి 15 లెక్కించగా స్వాతి నక్షత్రము వచ్చును. గురుడు స్వాతిగుండా చరించు సమయములో సంతానము కల్గుటకు అవకాశములు గలవు.

(28) గురుని శోధ్యపిండ సంఖ్యను గుర్వష్టక వర్గులో గురుని బిందు సంఖ్యచే హెచ్చించి ఆ లబ్దమును 27చే భాగించగా వచ్చు శేష సంఖ్యగా అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రమునందు గురుడు చరించు సమయమునందు సంతానము కల్గును. రాశిలో కంటే నవాంశలో గురుడు బలముగా వుంటే అశ్వినీ నక్షత్రము బదులు ధనిష్ఠ నక్షత్రము నుండి లెక్కించవలెను.

ప్రామాణిక జాతకంలో గురునికి 7 బిందువులు కలవు. గురుని శోధ్య పిండము 124. వీటి లబ్దము 868. దీనిని 27చే భాగించగా శేషము 4 వచ్చును. అశ్వని నుండి (రాశినందు గురుడు బలముగా నుండుటచే) 4 లెక్కించగా రోహిణి వచ్చును. రోహిణి నక్షత్రమందు గురుడు చరించు సమయమున సంతానము కల్గుట సూచించుచున్నది.

(29) గురుని శోధ్యపిండము సంఖ్యను 4చే హెచ్చువేసి ఆ లబ్దమును 12చే భాగించగా వచ్చు శేష సంఖ్యను మేషము నుండి లెక్కించగా వచ్చు రాశినందు రవి సంచరించు సమయము సంతానము కల్గు మాసమును సూచించును.

ప్రామాణిక జాతకంలో గురుని శోధ్య పిండము 124. దీనిని 4చే హెచ్చువేయగా 496 వచ్చును. ఈ లబ్దమును 12చే భాగించగా శేషము 4

వచ్చును. మేషము నుండి నాల్గవ రాశి కర్కాటకము. కర్కాటక రాశి నందు రవి చరించు మాసము (జులై 17 నుండి ఆగస్టు 16 మధ్యలో) నందు సంతానము కల్గుట సూచించును.

(30) గురునియొక్క శోధ్యపిండ సంఖ్యను 7చే హెచ్చవేయగా వచ్చు లబ్దమును 27చే భాగించవలెను. అప్పుడు వచ్చు శేష సంఖ్యను గురుని నక్షత్రము నుండి లెక్కించగా ఆ నక్షత్రము నందు శిశువు జన్మించుట సూచించును.

ప్రామాణిక జాతకంలో గురుని శోధ్య పిండము 124. దీనిని 7చే హెచ్చవేయగా 868. ఈ లబ్దమును 27చే భాగించగా శేషము 4 వచ్చును. జన్మ గురుడు పునర్వసు నక్షత్రము నందు గలడు. పునర్వసు నుండి నాల్గవది మఖ. కావున మఖ నక్షత్రమునందు సంతానము కల్గుట సూచింపబడినది.

(31) గురుని శోధ్య పిండము 9చే హెచ్చవేయగా వచ్చు లబ్దమును 12చే భాగించగా వచ్చు శేషము సంఖ్యతో మేషము నుండి లెక్కించగా వచ్చు లగ్నము నుండి సంతానము కల్గుట సూచించును.

ప్రామాణిక జాతకంలో గురుని శోధ్య పిండము 124. దీనిని 9చే హెచ్చవేయగా లబ్దము 1116. ఈ లబ్దము 1116 వచ్చును. దీనిని 12చే భాగించగా శేషము 0 లేక 12 వచ్చును. మేషము నుండి 12వది మీనము. కావున మీన లగ్నమునందు సంతానము కల్గుట సూచింపడుచున్నది.

(32) గురుడు వున్న *"కక్ష్య" యొక్క అధిపతి భర్త జాతకము నందు గుర్తించవలెను. భార్య జాతకములో గుర్వష్టకవర్గులో గురుని నుండి అయిదవ స్థానములో అట్టి గ్రహము బిందు ప్రదానము చేసినచో గురుడు అట్టి రాశినందు చరించు సమయములో సంతానము కల్గును.

* *రాశిని 8 సమాన భాగములుగా చేయగా ప్రతి భాగమును ఒక కక్ష్య అందురు. అట్టి కక్ష్యలు వరుసగా శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్ర, లగ్నల ఆధిపత్యమునందు వుండును. (ప్రతి రాశికి 30 డిగ్రీలు కావున ఒక్కొక్క కక్ష్య 3-45ల ప్రమాణము వుండును. ఉదాహరణకు గురుడు ఏదేని రాశిలో 9 డిగ్రీలలో వున్నచో అతను మూడవ కక్ష్యలో వుండును. మూడవ కక్ష్యకు పైన తెల్పిన విధంగా అధిపతి కుజుడు. కావున గురుడు వున్న కక్ష్యయొక్క అధిపతి కుజుడు అవుతాడు)*



ప్రామాణిక జాతకంయొక్క జాతకురాలి భర్త జాతకమందు గురుడు రవియొక్క కక్ష్యలోగలడు. జాతకురాలి (భార్య) గురు అష్టకవర్గులో గురుని నుండి అయిదవ స్థానములో రవి బిందు ప్రదానము చేయుచున్నాడు. అది తులారాశి అగుచున్నది. కావున తులారాశినందు గురుడు సంచరించు సమయములో ఆ దంపతులకు సంతానము కల్గుట సూచింపబబడుచున్నది.

(33) జనన మాసము ఈ క్రింది విధముగా కూడా కనుగొనవచ్చును. భర్తయొక్క జాతకమందు గురుడు వున్న కక్ష్యయొక్క అధిపతి నవాంశను కనుగొనవలెను. రవి ఈ నవాంశ రాశినందుగానీ దీనియొక్క త్రికోణ రాశులయందుగానీ చరించు మాసములందు సంతానం కల్గును.

ప్రామాణిక జాతకంయొక్క జాతకురాలి భర్త జాతకమునందు రవియొక్క కక్ష్యలో గురుడు కలడు. ఇట్టి రవి నవాంశలో మకరమునందు గలడు. కావున రవి మకరము నందుగానీ దాని త్రికోణ రాశులైన వృషభ, కన్యారాశులయందు చరించు మాసములలో సంతానము కల్గును.

(34) గురుని నుండి అయిదవ యింటి అధిపతి వున్న కక్ష్యయొక్క అధిపతి వున్న రాశిని గుర్తించవలెను. గురుడు ఈ రాశినందు చరించు సమయములో సంతానము కల్గును.

ప్రామాణిక జాతకములో గురుడు మిధునములో నుండుటచే మిధునము నుండి అయిదవ యింటి అధిపతియైన శుక్రుడు బుధునియొక్క కక్ష్యలో గలడు. బుధుడు తులారాశిలో గలడు కావున గురుడు తులారాశినందు చరించు సమయములో జాతకురాలునకు సంతానము కలుగవచ్చును.

(35) శోధన తర్వాత గురుని అష్టకవర్గు నందుగల బిందువుల మొత్తమును, గురుని నుండి అయిదవస్థానములోగల బిందువుల సంఖ్యచే హెచ్చవేసి ఆ లబ్దమును 12చే భాగించవలెను. శేష సంఖ్యను మేషమునుండి లెక్కించగా వచ్చు రాశినందు రవి చరించు మాసములో సంతానము కలుగవచ్చును.

ప్రామాణిక జాతకంలో శోధన అనంతరం మిగిలిన బిందువుల మొత్తము 11; గురుని నుండి అయిదవ స్థానములో 2 బిందువులు కలవు. వీని లబ్ధము 22. దీనిని 12చే భాగించగా 10 వచ్చును. మేషము నుండి 10వ రాశి మకరము కావున రవి మకరమునందు చరించు మాసము (జనవరి 10 నుండి ఫిబ్రవరి 13 నందు సంతానము కలుగవచ్చును.

సంతానము కల్గు సంవత్సరము, మాసము, నక్షత్రము మొదలైనవి ముందుగా షుమారుగా కనుగొనుటకు పైన సూత్రములు ఈయబడినవి.

ఈ సమయము మొదట సంతానమునకు చెందుతుందో లేక తర్వాత సంతానములకు చెందుతుందో ప్రస్తుత గోచార ఫలితముల ననుసరించి తెలిసికొనవలసి వుంది. నిర్దేశిత మహాదశ, నిర్దేశిత అంతర్దశా సమయములు సంతానము కల్గుట సూచించుచున్నదో అష్టకవర్గు సూత్రముల ఆధారంగా జనన సమయము షుమారుగా కనుగొనవచ్చును.



# అధ్యాయం-9

## శుక్ర అష్టక వర్గు

శుక్రుడు ఒకటిగానీ అంతకంటె హెచ్చు బిందువులను కలిగి వుంటే ఈ విధమైన ఫలితముల నిచ్చును.

0 బిందువు : ప్రమాదము, విధ్వంసము
1 బిందువు : కఫముచే యిబ్బందులు
2 బిందువులు : ఏ ఉద్దేశ్యము లేని సంచారము
3 బిందువులు : అధికారులతోనూ, ఉన్నతశ్రేణిగల వారితో విరోధము
4 బిందువులు : సుఖ దుఃఖములు సమపాళ్ళలో
5 బిందువులు : స్నేహితుల సహవాసము
6 బిందువులు : అనుకూలమైన స్త్రీల సహవాసము
7 బిందువులు : నగలు, ముత్యాలు సంపాదన
8 బిందువులు : అన్నివిధములైన సుఖసంతోషములు

(1) శుక్రుడు కేంద్ర త్రికోణములలో ఎందైనా 8 బిందువులను కలిగివుంటే జాతకుడు జీవితాంతము అమితమైన అనేక వాహనములను కలిగియుండును. 7 బిందువులున్నచో అమితమైన ధనవంతుడగును. శుక్రుడు పై విధముగా 7 లేక 8 బిందువులు కలిగివున్నా నీచ, అస్తంగత్వములను చెందినా, 12వ యింటినందుండినా పైన తెల్పిన ఫలితములు వర్తిల్లవు.

(21) లెనిన్ జాతకమునందు శుక్రుడు కేంద్రము నందు 8 బిందువులతో గలడు. అందువలన పైన చెప్పిన యోగము సంపూర్ణముగా వర్తిల్లినది.

2. కేరళీయము నందు ఈ విధముగా చెప్పబడినది

శుక్రుడు కేంద్ర కోణములలో ఎక్కడైనా 4, 5 లేక 6 బిందువుల నుండినచో అట్టి వ్యక్తికి అనేక వివాహములు జరుగవచ్చును. అటువంటి వ్యక్తి 4 లేక 5 మంది స్త్రీలతో వివాహేతర సంబంధములు కల్గియుండును.

బహుశా (22) నిజామ్ జాతకమునందు ఈ యోగము వుండుట యాదృచ్ఛికము కాదు. అతనికి అనేక భార్యలుండి నటులుగా చెప్పబడినది. లగ్నాధిపతియగు శుక్రుడు అయిదవ యింటినందు కేతువుతో కలసి యుండగా 6 బిందువులు కలవు. కుజుడు అట్టి శుక్రుని వీక్షించుచున్నాడు.

శుక్రునకు పాపుల సంబంధము లేనిచో జాతకుడు సంతోషకరమైన సౌఖ్యవంతమైన వైవాహిక జీవితం పొందునట్లుగా ఆశీర్వదింపబడతాడు.

ప్రామాణిక జాతకంలో శుక్రుడు తన అష్టకవర్గులో 4 బిందువులు కల్గివున్నాడు. శుక్రునకు నీచ కల్గినా నీచ భంగము జరిగినది. జాతకురాలునకు చాలా సంతోషకరమైన వైవాహిక జీవితము, గృహసౌఖ్యం, వాహన సౌఖ్యం, ఆర్థికపరమైన రక్షణ గలవు.

(3) శుక్రుడు లగ్నంలోగానీ లేదా పదవ యింటినందుగానీ 5 లేక అంతకంటె హెచ్చు బిందువులతో వున్నట్లయితే అట్టి వ్యక్తి ఒకటి కంటె హెచ్చు వాహనములు కల్గి వుండును.

ఇది నమ్మదగిన యోగముగా కన్పించుచున్నది. మేము పరిశీలించిన అనేక జాతకములలో ఈ యోగము వర్తిల్లినది.

(4) మేషము లేక వృశ్చిక రాశులయందు శుక్రుడు వుండగా 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కల్గివుండి శుభులచే చూడబడితే అట్టి వ్యక్తి ఆస్తులను, వాహనములను, ధనమును సంపాదించును. శుక్రుడు కేంద్ర కోణములలో ఎక్కడైనా వుండగా 4 లేక అంతకంటె ఎక్కువ బిందువులను కల్గి వుండి కుజుని వీక్షణము లేకుండా వున్నచో జాతకమునకు వివాహము చిన్నవయసునందే జరుగును.

ప్రామాణిక జాతకములో శుక్రుడు కోణములో 4 బిందువులతో కుజుని వీక్షణము లేకుండా గలడు. జాతకురాలునకు తన 13వ సంవత్సర వయసునందు వివాహము జరిగెను.

(5) అయితే శుక్రుడు రాశిలోగానీ లేక నవాంశలో గానీ నీచలో వుండినా 5 బిందువులు కల్గివుండి కుజుని వీక్షణము కానీ కుజుని కలయికగానీ జరిగినా చిన్న వయసులో వివాహము అగుట అను విషయమును కొట్టివేయలేము.



పైన (4)నందు తెలుపబడిన యోగమునకు (5) నందు చెప్పబడిన యోగమునకు మధ్య బాహ్యముగా విరుద్ధత కలదు. మొదటి సూత్రం ప్రకారం కుజుని వీక్షణత లేకపోతే చిన్న వయసులో వివాహము జరుగుతుంది. రెండవ సూత్రము ప్రకారము కుజుని వీక్షణము ముందుగా అగత్యమైంది. ఈ రెండు యోగములను జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక తేడా నిరూపిత మవుతుంది. శుక్రుడు నీచలో వుండి బలహీనపడితే కుజుని వీక్షణము మంచిది. పైన తెల్పిన నా ఈ స్వంత అభిప్రాయాన్ని ప్రామాణీకం చెయ్యడానికిగానూ ఈ రెండు యోగాలకు అన్వయిస్తూ సరియైనన్ని ఎక్కువ జాతకాలను వర్తింపజేసి పరిశీలించలేదని నేను అంగీకరించాలి.

(6) శుక్రుడు 8 బిందువులను కలిగి వుండి త్రికోణములో వున్నాసరే లగ్నం నుండి రెండవ యింటియందు పాపులు వున్నా లేక చూచినా అట్టి వ్యక్తి వైవాహికపరంగా అనేక ఒడిదుడుకులు ఎదుర్కోవలసి వస్తుంది.

(7) శుక్రుడు వున్న రాశ్యాధిపతి 5 గానీ అంతకంటే ఎక్కువ బిందువులను కలిగి వుండి కేంద్ర త్రికోణములలో ఎక్కడైనా వుంటే జాతకుడు సంపద, సంతోష, సౌఖ్యములను పొందుతాడు.

(6) విండ్సర్‌యొక్క ప్రభువు ఎడ్వర్డ్ జాతకంలో శుక్రుడు అయిదవ యింటిలో గలడు. ఈ రాశియొక్క అధిపతి తిరిగి శుక్రుడే అగుచున్నాడు. ఇట్టి శుక్రుడు 7 బిందువులను కల్గియున్నాడు. పైన తెల్పిన సూత్రము (7) నందలి యోగఫలములు ప్రభువునకు సంపూర్ణముగా కలిగినవి (14) ప్రొఫెసర్ బి.ఎస్.రావుగారి జాతకంలో శుక్రుడు యొక్క రాశ్యాధిపతియైన గురుడు కేంద్రములో నుండగా శుక్రాష్టకవర్గులో 4 బిందువులను పొందినాడు. సూత్రము (7) నందు ఉదహరించిన యోగ ఫలమును ఆయన కూడా సంపూర్ణముగా అనుభవించినారు.

(8) శుక్రుడు వున్న రాశ్యాధిపతి శుక్రుని నుండి 6/8లో నుండగా లగ్నమునందుగానీ లేక లగ్నము నుండి కోణములయందుగానీ వున్నచో జాతకుడు భార్యను కలిగి వుండి పేదరికమును అనుభవించును.

ఈ సందర్భములో అధిపతి 5 కానీ అంతకంటె హెచ్చు బిందువులను కలిగియుండవలెను.

(9) అదేవిధంగా శుక్రాష్టక వర్గులో కుజునికి 5 లేక అంతకంటె ఎక్కువ బిందువులు ఉండగా కుజుడు ఏడవ యింటినందుండగా లగ్నాత్తు అయిదు, ఏడు యిండ్ల అధిపతులు పరస్పరము కోణములందు ఉండినచో జాతకుడు తన భార్యను వదిలివేయును.

(10) కుజుడుగానీ శనిగానీ (5 లేక అంతకంటె ఎక్కువ బిందువులను కల్గియుండి) ఏడవ యింటిలో నుండగా, ఏడవ యింటి అధిపతి కుజుని లేక శనియొక్క నవాంశ యందున్నా లేక ఆ యిరువురిలో (శని, కుజులలో) ఒకరిచే చూడబడినా జాతకుని భార్యయొక్క శీలము ప్రశ్నార్థకమగును.

(11) శుక్రుడు 4 బిందువులను కల్గియుండగా నీచరాశియందుగానీ లేదా నీచ నవాంశయందుగానీ వుండగా కుజుడు కూడా నీచ చెందినచో జాతకుని భార్య పరువు పోగొట్టెడు స్త్రీ అగును.

కొంతమంది అభిప్రాయము ప్రకారము పై సందర్భములో కుజుడు నీచలో నుండుటకు బదులుగా శుక్రుని చూడవలెను.

(12) శుక్రుడు 1 నుండి 3 బిందువులు కల్గియుండి శనియొక్క నవాంశను పొందియుండగా కుజుడు శనియొక్క రాశినందున్నచో జాతకుని భార్య వ్యభిచరించును.

(13) శుక్రునకు 5 లేక అంతకంటె ఎక్కువ బిందువులు కల్గియుండి కుజునియొక్క నవాంశలో నుండగా కుజుడు తనయొక్క రాశిలో వున్నచో జాతకుడు ఇతర స్త్రీలతో వ్యసనపరుడు అగును.

(14) శుక్రుడు 4 లేక అంతకంటె హెచ్చు బిందువులను కల్గియుండి నవాంశయందు ఉచ్చచెందగా కుజునిచే బలముగా వీక్షింపబడినచో జాతకుడు పచ్చి వ్యభిచారి అగును.

పై సమ్మేళనములో నిర్దేశిత గ్రహముయొక్క రాశి అని చెప్పిన సందర్భములో నవాంశను, నవాంశ అని చెప్పిన సందర్భంలో రాశిలను కూడా పరిగణింపవలెనని మాకు అనిపిస్తున్నది.



(15) శుక్రుడు 2 లేక 3 బిందువులను కలిగియుండి 6-7-8-12లలో ఎక్కడైనా వుండగా ఏడవ యింటి అధిపతి నీచలో వుంటే జాతకుడు తక్కువ జాతి స్త్రీతో వ్యభిచరించును.

(16) శుక్రుడు 2 లేక 3 బిందువులు కలిగి 6-8 యిండ్లలో ఎక్కడైనా శనితో కలిసి వుండి కుజునిచే చూడబడితే జాతకుడు అంధురాలుతో వ్యభిచరించును.

(17) శుక్రుని అష్టకవర్గులో అతి తక్కువ బిందువులుగల రాశిని సూచించు దిశకు చెందు స్త్రీని వివాహము చేసుకుంటే జాతకునకు దుఃఖము, వ్యాధి, దురవస్థలు కలుగును.

(18) శుక్రుని అష్టకవర్గులో అతి హెచ్చు బిందువులుగల రాశిని సూచించు దిశకు చెందు స్త్రీని వివాహము చేసుకుంటే సంతోషము, ఆయుర్దాయము, సంతానము, మంచి అదృష్టము కలుగును.

పైన తెల్పిన 17, 18 సూత్రములు ఈ విధముగా కూడా వివరించవచ్చును : భర్తయొక్క లగ్నాష్టకవర్గునందు శుక్రునియొక్క బిందువు లేని రాశి సూచించు దిశకు భార్య చెందినదైతే అట్టి వివాహము భంగపడుతుంది. భర్తయొక్క లగ్నాష్టక వర్గునందు హెచ్చు బిందువులు గల రాశి (శుక్రబిందువుతో సహా) సూచించు దిశకు భార్య చెందినదైతే సంతోషము, కీర్తి వంటి ఫలితాలు కలుగుతాయి.

(19) శుక్రుని అష్టకవర్గులో శుక్రుని నుండి ఏడవస్థానములో ఏదైనా బిందువు జాతకుని జన్మనక్షత్రమునకుగానీ ఆ నక్షత్రము యొక్క త్రికోణ నక్షత్రములకుగానీ చెందు గ్రహమునకు చెందినదైతే భార్యాభర్తలు పరస్పరము ప్రేమ కలిగిన వారగుదురు.

ప్రామాణిక జాతకంలో జన్మనక్షత్రము స్వాతీ నక్షత్రము. దాని అధిపతి రాహువు అగుచున్నది. సాధికారిక వచన రీత్యా "శనివత్ రాహు"కావున నక్షత్రనాధుడు శని అనుకోవచ్చును. శుక్రుని నుండి ఏడవ స్థానములో 6 బిందువులు కలవు. వీనిలో ఒక బిందువు శనిచే ప్రదానము చేయబడినది. కావున (19) నందు చెప్పడిన సమ్మేళనము బాగా వర్తిల్లుతున్నది.

(20) శుక్రునియొక్క శోధ్య పిండ సంఖ్యను శుక్రాష్టకవర్గులో శుక్రుని నుండి ఏడవ స్థానములో గల సంఖ్యచే హెచ్చవేయవలెను. ఈ లబ్ధమును 27చే భాగించవలెను. శేష సంఖ్యను అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రమునందు గురుడు చరించు సమయములో వివాహము జరుగవచ్చును.

(21) పైన తెల్పిన లబ్ధమును 12చే భాగించగా వచ్చు శేష సంఖ్యను మేషము నుండి లెక్కించగా వచ్చు రాశినందు గురుడు చరించు సమయములో వివాహము జరుగవచ్చును.

(22) లేక పైన తెల్పిన (21) నందలి రాశియొక్క అధిపతి యొక్క మహాదశా సమయంలో జాతకునకు వివాహం జరుగవచ్చును.

(23) శుక్రునియొక్క శోధ్యపిండ సంఖ్యను (శుక్రాష్టక వర్గులో) రవి నుండి ఏడవ స్థానములోగల బిందువుల సంఖ్యతో హెచ్చవేయగా వచ్చు లబ్ధమును 12చే భాగించవలెను. అప్పుడు వచ్చు శేషమును మేషము నుండి లెక్కించగా వచ్చు రాశినందు రవి చరించు మాసములో వివాహము జరుగవచ్చును.

ప్రామాణిక జాతకములో శుక్రుని శోధ్యపిండము 66. శుక్రాష్టక వర్గులో రవి నుండి (శుక్రుని నుండి కూడా) ఏడవస్థానములోగల బిందువుల సంఖ్య 6. వీని లబ్ధము 396. ఈ లబ్ధమును 27చే భాగించగా శేషము 18 వచ్చును. అశ్విని నుండి 18వది జ్యేష్ఠ నక్షత్రము. గురుడు జ్యేష్ఠ నక్షత్రమునందుగానీ దాని త్రికోణ నక్షత్రములైన ఆశ్లేష, రేవతి నక్షత్రములయందుగానీ చరించు సమయమున వివాహము జరుగవచ్చును. శుక్రుని శోధ్యపిండ సంఖ్య 66. శుక్రాష్టక వర్గులో రవినుండి 7వ స్థానములోగల సంఖ్య 6. వీని లబ్ధము 396. దీనిని 12చే భాగించగా శేషము 12. మేషము నుండి పన్నెండవ రాశి మీనము కావున రవి మీన రాశిలో చరించు మాసము వివాహమునకు అనుకూల సమయము.

(24) సూత్రము (20)నందు చెప్పబడిన నక్షత్రము నందు శని చరించు సమయములో అనారోగ్యము, దురదృష్టము లేదా మరణముగానీ భర్తకు లేదా భార్యకు కలుగవచ్చును.



(25) శుక్రుని యొక్క శోధ్యపిండ సంఖ్యను శుక్రాష్టక వర్గులో గురుని నుండి ఏడవ స్థానములో గల బిందువుల సంఖ్యచే హెచ్చవేయవలెను. ఈ లబ్ధమును 27చే భాగించగా వచ్చు శేషసంఖ్యను అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రమునందు గురుడు చరించు సమయములో జీవిత భాగస్వామి మరణము సంభవించును.

ప్రామాణిక జాతకములో శని జ్యేష్ఠా నక్షత్రమునందుగానీ, లేక దాని త్రికోణ నక్షత్రములందుగానీ చరించు సమయములో జాతకురాలి భర్త బాధలు పొందును.

శుక్రుని శోధ్యపిండము 66. గురుని నుండి (శుక్రాష్టక వర్గులో) ఏడవ స్థానములో బిందువుల సంఖ్య 4. వీని లబ్ధము 264. దీనిని 27చే భాగించగా శేషము 21. అనగా పూర్వాషాఢ. కావున ఈ నక్షత్రమునందు గురుడు చరించు సమయములో జాతకురాలి భర్తకు బాధలుగానీ, మరణముకానీ (ఇతర సమ్మేళనములు సూచిస్తే) జరుగును.

# అధ్యాయం-10

## శని అష్టక వర్గు

శని వివిధములైన బిందువులను కల్గియున్నప్పుడు ఫలితములు ఈ విధముగా నుండును.

0 బిందువు లేక
1 బిందువు : ధన నష్టము, అన్ని విధములైన ఆస్తుల విధ్వంసము
2 బిందువులు : కారాగారము, అనారోగ్యము
3 బిందువులు : సంతానము, భార్య, ధనము వలన బాధలు
4 బిందువులు : ఇతరులపై ఆధారపడుటచే సంతోషము
5 బిందువులు : సంపద లాభము, సంతోషము
6 బిందువులు : దొంగల ముఠాకుగానీ, అవాంఛనీయ శక్తులకుగానీ వేటగాండ్ల సమూహమునకుగానీ నాయకుడు
7 బిందువులు : ఒంటెలు, దాసీల సంపాదన
8 బిందువులు : ప్రజలకు నాయకత్వము, పట్టణమునకు లేదా నగరమునకు ఆధిపత్యము పొందుట.

(1) శన్యష్టక వర్గులో శనికి బిందువులు లేకుండా యుండగా శని లగ్నము నందున్నచో మరణముగానీ ధననష్టము, కష్టములు కలుగును.

ఈ శ్లోకమునకు కొంతమంది ఈ విధముగా వివరణ యిస్తున్నారు. శన్యష్టక వర్గునందు బిందువులు లేని రాశినందు చరించు సమయములో మరణము లేక సంపదలు కోల్పోవుట జరుగును. ఇతరులు మరొక విధంగా వివరిస్తున్నారు. బిందువులు లేని రాశి (ఏ అష్టకవర్గునందైనా) యందు శని చరించు సమయములో మరణముగానీ సంపదలు కోల్పోవుటగానీ సంభవించును.

స్టాలిన్ జాతకంలో శని అష్టకవర్గులో వృశ్చికరాశి నందు బిందువులు లేవు. శని వృశ్చిక రాశినందు (1902) చరించు సమయములో స్టాలిన్ జీవితానికి



దుర్భరస్థితి ఎదురైంది. అతను పర్వతాలలో దాక్కొనవలసి వచ్చింది. 20 మాసముల కాలము కారాగారము అనుభవించవలసి వచ్చింది.

(2) శని నుండి 1 నుండి 4 బిందువులను కలిగి వుండి కేంద్రము నందుండినా లేక ఉచ్ఛయందుండినా జాతకునికి అల్పాయువు సంభవించును.

(23) స్వామి వివేకానంద రాశి చక్రము నందు శని పదవ కేంద్రము నందు 4 బిందువులతో గలడు. వారు హెచ్చు కాలము జీవించియుండలేదు.

(3) శని లగ్నమందుండగా 5 లేక 6 బిందువులను కల్గియుంటే జాతకునకు జన్మించినది మొదలు అన్నిరకములైన బాధలు, ఆర్థిక ఒడిదుడుకులు కల్గును. అయితే శని 5 నుండి 8 బిందువులను కల్గియుండగా నీచ లేక శత్రుక్షేత్రములో వున్నచో దీర్ఘాయువు కల్గును.

(4) శని 8 బిందువులు కల్గి వుండగా జాతకుడు గ్రామ పంచాయతీకిగానీ, లేక మున్సిపల్ కమీషనరు లేక మేయరు అగును. శని 7 బిందువులతో వుంటే వ్యాపారము లేక అటువంటి వ్యాపారముల ద్వారా జాతకుడు ధనము సంపాదించును.

(5) శని లగ్నమునందు బలముగా వుండి 4 లేక 5 బిందువులను కలిగి వుంటే జాతకుడు ఎల్లప్పుడూ బాధాకరమైన జీవితము అనుభవించుట, బిచ్చమెత్తుకొనుట, సంచారముచే బాధలు పొందుట జరుగును.

(6) శని 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కల్గివుండి నవాంశము నందు నీచను పొంది, లగ్నమందుగానీ అయిదవ యింటినందుగానీ వుండినచో స్వరపేటికల వ్యాధులచే బాధలు పొందుట, పేదరికము అనుభవించుట జరుగును.

(7) శని 4 బిందువులతో లగ్నమందుగానీ, నాల్గవ యింటినందుగానీ వుండగా స్వక్షేత్రమునందుగానీ, ఉచ్ఛనందుగానీ లేకుండా వున్నచో జాతకుడు హెచ్చు కాలము జీవించి యుండకపోయిననూ అదృష్టవంతుడగును.

(8) శని 5 లేక అంతకంటే హెచ్చు బిందువులను కలిగియుండి రాశిలో నీచయందు, నవాంశలో ఉచ్ఛనుగానీ, స్వనవాంశనుగానీ పొందినచో జాతకుడు దీర్ఘాయువును కల్గి సంతోషము, సంపదలను పొందును.

(9) శనికి 1 నుండి 3 బిందువులు కల్గి స్వక్షేత్రము లేక స్వనవాంశను పొందియుండగా కేంద్ర త్రికోణములలో ఎక్కడైనా వున్నచో జాతకునకు అనేక వ్యాపకముల ద్వారా ధనము కలుగును.

(10) శని తొమ్మిది, పది యిండ్ల అధిపతిగా (వృషభలగ్నము) 1 నుండి 3 బిందువులను కలిగియుండి 3-6-11 ఇండ్లలో ఎక్కడైనా వున్నచో అట్టి జాతకుడు ప్రభువుగానీ ప్రభు సమానుడుగానీ అగును

(11) శని లగ్నాధిపతిగానీ 12వ యింటి అధిపతిగానీ అగుచూ స్వక్షేత్రములో 4 బిందువులను కల్గియుండగా పాపులు కోణములయందున్నచో జాతకుడు తన దినసరి భుక్తికై బిచ్చమెత్తుకుని జీవించును.

(12) శని లగ్నాధిపతిగానీ, ఎనిమిదవ యింటి అధిపతిగా గాని అస్తంగత్వము చెంది లగ్నమునందుగానీ, కోణముల యందుగానీ వున్నచో జాతకుడు నిరంతరము బాధలను అనుభవించును.

(13) లగ్నమునుండిగానీ, శని నుండిగానీ ఎనిమిదవ యింటి అధిపతి అస్తంగత్వము చెందిగానీ, లేదా శతృక్షేత్రమును పొందిగానీ యుండి శుభుల దృష్టిలేకుండా వున్నచో జాతకుడు జీవితాంతము బిచ్చమెత్తుకొనును.

(14) లగ్నము నుండిగానీ, శని నుండిగానీ ఎనిమిదవ స్థానమునందు శుభుడు వుండగా, ఆరాశి అధిపతి బలముగా నున్నచో జాతకుడు జీవితమంతయు సంతోషము ననుభవించును.

శని నుండి ఎనిమిదవ స్థానములో శుభగ్రహము వుంటే కుటుంబ జీవితములో సంతోష సౌఖ్యములు కల్గును. అట్టి ఎనిమిదవ యింటి అధిపతి బలముగా వున్నచో ప్రభువుల నుండి మన్ననలు, అధికముగా ధనము కల్గును.

(15) శని 5 లేక అంతకంటె హెచ్చు బిందువులను కల్గి లగ్నములో చంద్రునితో కలసి వుంటే జాతకుడు ప్రభువుగానీ, ప్రభుసమానుడుగానీ అగును.

(16) శని, కుజులు 4 లేక అంతకంటే హెచ్చు బిందువులను కలిగియుండగా శని మేషము నందు, కుజుడు మకరము నందు వుండి ఎనిమిదవ యింటి అధిపతి బలహీనుడుగా వున్నట్లయితే జాతకునకు పేదరికము, వాత సంబంధ వ్యాధులు కల్గును.



(17) కుజుడు ఒక్క బిందువు కల్గి నీచలో నుండగా శనిచే కలసిగానీ లేక చూడబడిగానీ వున్నచో సుఖదుఃఖములు విశ్రమముగా జాతకుడు పొందును.

(18) శని 1 నుండి 3 బిందువులను కల్గివున్నచో విదేశమునందు మరణము సంభవించును.

(19) శని 2 నుండి 3 బిందువులను కల్గియుండి, రెండవ యింటిలో నుండగా రెండవ ఇంటి అధిపతితో కలిసిగానీ, చూడబడిగానీ వున్నట్లయితే జాతకుడు తరచు తీర్థయాత్రలు చేయును.

(20) శని 2 లేక 3 బిందువులను కల్గియుండి పదవ యింటిలో ఉండినా లేక పదవ యింటి అధిపతి సంబంధము కల్గియున్నా జాతకుడు విదేశములలో తిరుగుచుండును.

(21) శని రెండవ యింటి నందుండి, రెండవ యింటి అధిపతి బలహీనముగా వున్నచో (శన్యష్టక వర్గులో 4 కంటె తక్కువ బిందువులను కల్గియుండుట) జాతకుడు నిరంతరము పాపకార్యములను చేయుచుండును (రాశిచక్రములో) కలిగిన రాజయోగములన్నీ నశించిపోవును (వర్తిల్లవు).

పదవ యింటి అధిపతి బలముగా నుండగా కేంద్ర త్రికోణములలో ఎక్కడైనా వుంటే జాతకునకు ప్రపంచ ఖ్యాతి, వాహనములు రాజకీయ అధికారము సంక్రమింపజేయును.

(22) శోధనకు ముందు శని అష్టకవర్గులో లగ్నము నుండి శని వున్న రాశివరకు గల బిందువులను కలుపవలెను. తిరిగి శని వున్న రాశి నుండి లగ్నము వరకు గల బిందువులను కలుపవలెను. ఈ రెండు సంఖ్యలు జాతకుడు రోగములచేత దురదృష్టముల చేత బాధింపబడు వయసు సంవత్సరములలో సూచించును. ఈ రెండు సంఖ్యల మొత్తంకూడా ఆ విధమైన వయసునే సూచించును.

పైన తెల్పిన మూడు సంఖ్యలు సూచించు వయసునందు ఏదైనా పాపగ్రహముయొక్క మహాదశ ప్రారంభమగుటగానీ లేదా అంతమగుటగానీ జరిగినచో ఆ సమయములో జాతకునకు మరణము కానీ లేదా భరింపరాని దురదృష్టము కానీ జరుగవచ్చును.

ప్రామాణిక జాతకంలో లగ్నం నుండి శని వరకు గల బిందువుల మొత్తము 26. శని నుండి లగ్నం వరకు గల బిందువుల మొత్తము 16. ఈ రెండు సంఖ్యల మొత్తము 42. జాతకురాలునకు 16 సంవత్సరముల ప్రాయములో మూడు వారములపాటు టైఫాయిడ్ జ్వరముతో బాధపడెను. ఆమె 26 సంవత్సరముల వయస్సులో తీవ్రమైన రక్తహీనత వ్యాధిచే బాధపడడం 26 సంవత్సరం వయసుగల కుమారుని కోల్పోవటం జరిగింది. ఆమె 42 సంవత్సరముల వయసులో మానసికంగా వ్యధను చెందటం, బలహీనతచే బాధపడడం జరిగింది.

(23) స్వామి వివేకానంద జాతకములో శని అష్టకవర్గునందు (22) సమ్మేళన రీత్యా బిందువుల మొత్తము 39. వారు 40వ సంవత్సరములో స్వర్గస్థులగుట (అష్టక వర్గురీత్యా) భావగర్భితమైన విషయము.

(23) శనియొక్క శోధ్య పిండ సంఖ్యను, శన్యష్టక వర్గులో శని నుండి ఎనిమిదవ స్థానములోగల బిందువుల సంఖ్యతో హెచ్చవేయవలెను. ఆ లబ్ధమును 27చే భాగించవలెను. శేషమును అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రముగానీ దానియొక్క త్రికోణ నక్షత్రమునందుగానీ శని చరించు సమయములో జాతకునకు మరణము సంభవించును.

(24) శనియొక్క శోధ్య పిండముయొక్క సంఖ్యను శన్యష్టకవర్గులో గురుడు వున్న రాశిలోగల బిందువుల సంఖ్యచే హెచ్చవేసి 12చే భాగించగా వచ్చు శేషమును మేషము నుండి లెక్కించగా వచ్చు రాశి నందు గురుడు చరించి సమయము జాతకునికి మరణము సంభవించు సంవత్సరము, మాసము ఈ విధముగా తెలిసికొనవచ్చును. శని యొక్క శోధ్య పిండ సంఖ్యను, రవి వున్న రాశియందుగల బిందు సంఖ్యచే హెచ్చవేసి ఆ లబ్ధమును 12చే భాగించవలెను. శేషము మేషము నుండి లెక్కించగా వచ్చు రాశినందు రవి సంచరించు మాసములో మరణము కలుగవచ్చును.

ఇచ్చిన ప్రామాణిక జాతకంలో శనియొక్క శోధ్యపిండము 170

(1) శని నుండి 8వ స్థానములోగల బిందువుల సంఖ్య 4

(2) శన్యష్టక వర్గులో గురుడు వున్న రాశిలో గల బిందువులు 4



(3) శన్యష్టక వర్గులో రవి వున్న రాశిలో గల బిందువులు 3

(4) శని శోధ్యపిండమైన 170ను (1) నందలి సంఖ్యయగు 4చే హెచ్చవేయగా వచ్చు లబ్ధమును 27చే భాగించగా శేషము 5 వచ్చును. అశ్వని నుండి 5వ నక్షత్రము మృగశిర. కావున శని మృగశిర నక్షత్రమునందుగానీ, దాని త్రికోణ నక్షత్రములైన చిత్త, ధనిష్ఠల యందుగానీ చరించు సమయమునందు (దశాసమయముకూడా సూచించినచో) మరణము కలుగవచ్చును.

(5) శని శోధ్యపిండమైన 170ను (2) నందలి సంఖ్యయగు 4చే హెచ్చవేయగా వచ్చు లబ్ధమును 12చే భాగించగా శేషము 8 వచ్చును. మేషాదిగా 8వ రాశి వృశ్చిక రాశి. కావున గురుడు వృశ్చికరాశి నందు చరించు సంవత్సర మందు (దశాసమయము కూడా సూచించినచో) మరణము కల్గును.

(6) శని శోధ్యపిండమైన 170ను (3) నందలి సంఖ్యయగు 3చే హెచ్చవేసి 12చే భాగించగా శేషము ఆరు వచ్చును. మేషాదిగా 6వ రాశి కన్య. కావున రవి కన్యారాశినందు చరించు మాసమునందు (దశా సమయము కూడా సూచించినచో) మరణము కలుగవచ్చును.

(25) శోధన అనంతరము శని వున్న రాశినందు, దాని నుండి ఏడవ రాశినందు బిందువులు లేనిచో జాతకుడు ఏకాంత స్థలములో అసహజ మరణము పొందును. అయితే ఈ రెండు రాశులునూ మిత్ర గ్రహములచే వీక్షింపబడినచో మరణ సమయమునకు మిత్రులు ప్రక్కనే ఉందురు. ఇట్టి రెండు రాశులను శత్రుగ్రహములు వీక్షించినచో మరణ సమయమునందు జాతకుని శత్రువులు చుట్టుముట్టియుందురు.

మరణ సమయమును కనుగొనుటకు ఈ క్రింది పద్ధతులను కూడా ఉపయోగించవచ్చును.

(26) శనియొక్క శోధ్యపిండ సంఖ్యను శని వున్న రాశినందుగల బిందువుల సంఖ్యచే హెచ్చవేయవలెను. ఈ లబ్ధమును 27చే భాగించగా వచ్చు శేషమును అశ్విని మొదలుగాగల నక్షత్రమునందు శని చరించు సమయములో మరణము కలుగవచ్చును.

శని శోధ్యపిండ సంఖ్య 170. శని వున్న రాశినందుగల బిందు సంఖ్య 3. వీటి లబ్ధము 510. దీనిని 27చే భాగించగా శేషము 24. అశ్విని మొదలు 24వ నక్షత్రం శతభిష. కావున శతభిష నక్షత్రమునందు శని చరించు సమయము జాతకురాలికి హానికరమైనది.

వాస్తవ పరిశీలనలో మరణము చెప్పబడిన గోచార సమయములో జాతకునకు దురదృష్టములు, మానసిక వ్యథలు, రోగములు, ఆర్థిక నష్టములు (మరణము కలుగనిచో) కలుగుచున్నవి.



# అధ్యాయం-11

## సర్వాష్టక వర్గు

అధ్యాయం 2లో మనం సర్వాష్టకవర్గు ఏ విధంగా పొందాలో గ్రహించాము. ఈ చక్రమువలన చాలా ఉపయోగములు కలవు. సర్వాష్టక వర్గు వివరణలో జ్యోతిష్యుడు తగినంత నేర్పును ఉపయోగించాలి. జ్యోతిషము, వివరణలు అవే మాటలతో (గ్రంథమునందు చెప్పడినట్లు యథాతథంగా) అన్వయింపు కొన్ని సందర్భాలలో సరికాదు. చాలా సంవత్సరాల క్రితం సర్వాష్టకవర్గు ఆధారంగా మాత్రమే అప్పటికప్పుడు సరియైన ఫలితములను చెప్పగల్గిన పండితుడు ఒకరిని నేను కలుసుకోవడం తటస్థించింది.

(1) 25 బిందువులకంటె తక్కువ బిందువులున్న భావములు శుభప్రదములు కావు. 30 బిందువులున్న భావములు చెప్పుకోతగ్గ శుభ ఫలితములను సూచించును. 30 బిందువుల కంటె హెచ్చు బిందువులుగల భావములు సంపూర్ణ శుభ ఫలముల నీయగలవు. గ్రహములు ఉచ్ఛ, స్వక్షేత్ర, కేంద్ర, త్రికోణ, ఉపచయములు మొదలైన వాటి యందున్నా కూడా తక్కువ బిందువులను గానీ కల్గి వుంటే నిష్ఫలమవుతాయి. నీచ, శతృక్షేత్ర, 6-8-12 యిండ్లయందు మాదిరి రాశ్యాధిపతితో కలసిన గ్రహాలైనాసరే హెచ్చు బిందువులను కలిగివుంటే శుభ ఫలితాలనివ్వగలవు.

(2) ప్రశ్న మార్గ ననుసరించి, సర్వాష్టక వర్గు నందుగల బిందువుల కనీస సంఖ్య దిగువనీయబడింది. సహజంగా అంతకంటె హెచ్చు బిందువులుంటే భావంకి పుష్టి చేకూరుతుంది. అలాగే కనీస బిందువుల సంఖ్యకంటే తక్కువ బిందువులుగానీ వున్నట్లయితే భావం బలహీనమవుతుంది.

లగ్నం; 25; రెండవ యిల్లు-22; మూడవ యిల్లు-29; నాల్గవ యిల్లు-24; అయిదవ యిల్లు-25; ఆరవ యిల్లు-34; ఏడవ యిల్లు-19; ఎనిమిదవ యిల్లు-24; తొమ్మిదవ యిల్లు-29, పదవ యిల్లు-36; పదకొండవ యిల్లు-54; పన్నెండవ యిల్లు-16;

వాస్తవ అనుభవంలో 11వ భావంలో 54 బిందువులుగల జాతకాలుగానీ పన్నెండవ యింట్లో 16 బిందువులు వున్న జాతకాలు గానీ తటస్థపడటం చాలా అరుదుగా వుంటుంది. ఆ విధమైన హెచ్చుతగ్గులు గల పంపకము అరుదుగా వుంటుంది.

(3) లగ్నము, తొమ్మిది, పది, పదకొండవ యిండ్లలో ప్రతిదానియందు 30 బిందువులకంటె హెచ్చు బిందువులు వుండినట్లయితే జాతకుడు జీవించినంతకాలము ఉన్నతశ్రేణి జీవితము అనుభవిస్తాడు. ఇవే యిండ్లలో తక్కువ బిందువులుగానీ వున్నట్లయితే జాతకుడు, పేదవాడు, వ్యాధిగ్రస్థుడు, దుస్వభావముకలవాడు అగును.

(4) పాపులు కోణములలో నుండగా లగ్నము, తొమ్మిది, పది, పదకొండు యిండ్లయందు 21 నుండి 22 బిందువులున్నచో జాతకుడు బిచ్చమెత్తుటను ఆశ్రయించవచ్చును.

(5) లగ్నము నందు 30కి తక్కువ కాకుండా బిందువులుండగా మూడవ యింటినందుకూడా హెచ్చు బిందువులున్నచో జాతకుడు అధికారముగానీ ఒక విధమైన ఉన్నతమైన ఉద్యోగముగానీ పొందును.

(6) లగ్నము, చంద్ర లగ్నము, పదవ యిల్లు, పదకొండవ యిల్లుల యందు ప్రతిదానియందు 30 బిందువుల చొప్పున వుండగా లగ్నముగానీ లేక చంద్రుడుగానీ గురునియొక్క స్థితి లేక వీక్షణములను కల్గియున్నచో జాతకుడు ఒక పట్టణమునకుగానీ, నగరమునకుగానీ, అధిపతి అగుట లేదా ఉన్నతశ్రేణికి చెందు మంత్రివర్యుడుగానీ అగును.

(7) 2-9-10-11 యిండ్లు ఒక్కొక్కటి 30 గానీ అంతకంటె హెచ్చు బిందువులను కల్గివుంటే జాతకుడు ప్రభువు అగును.

(8) లగ్నమునందు 30 గానీ అంతకంటే హెచ్చు బిందువులుండగా అందు 9-10-4 యిండ్లలో ఏ ఒక్కదానికి చెందు అధిపతియైనా వుండినచో జాతకుడు తన కుటుంబమునకు గుర్తింపు తెచ్చువాడు అగును.



(9) నాల్గవ యింటియందు, నాల్గవ యింటి అధిపతి వున్న రాశినందు 30 కంటె హెచ్చు బిందువులు వుండగా నాల్గవ యింటినందు శుభుడు వుండి, నాల్గవ యింటి అధిపతి శుభునిచే వీక్షింపబడినా

లేదా

నాల్గవ యింటియందు 30 బిందువులుండగా శనిచే వీక్షింపబడుచుండగా, నాల్గవ యింటి అధిపతి కేంద్రము నందనుండిగా జాతకుడు అన్ని విధములైన సౌఖ్యములను జీవితములో పొందును.

(10) ఎనిమిది యింటి అధిపతి లేక ఒక కేంద్రాధిపతి వుండు రాశియందు 25 నుండి 30 బిందువులుండగా కుజుడు ఎనిమిదవ యింటిని వీక్షించినచో జాతకుడు వ్రణములు, సుఖరోగములు వంటి వానిచే బాధితుడగును.

(11) మూడవ యింటినందు చంద్రడుండగా అందు 30 బిందువులుండి రవి, శనులచే వీక్షింపబడినచో జాతకుడు వ్రణములు, వాత సంబంధ రోగములచే బాధితుడగును.

(12) మూడవ యింటి యందు 25 నుండి 30 బిందువులుండగా శని వీక్షణము కల్గితే జాతకుడు మూత్ర సంబంధ వ్యాధులచే పీడితుడగును.

(13) చంద్రునకు అస్తంగత్వము కల్గుచుండగా, చంద్ర రాశ్యాధిపతుల బలహీనుడై శనిచే వీక్షింపబడుచుండగా జాతకుడు ప్రేతాత్మలచే బాధితుడగును.

(14) పదవ యింటినందలి బిందువుల సంఖ్యకంటె పదకొండవ యింటినందు హెచ్చు బిందువులుండగా, పదకొండు యింటినందు కంటె తక్కువ బిందువులను పన్నెండవ యిల్లు కల్గియుండి, పన్నెండవ యింటి అందలి బిందువుల కంటె లగ్నమునందు హెచ్చు బిందువులునన్నచో జాతకునకు కీర్తి సంపద, సంతోషము అనుగ్రహింప బడును.

(15) మీనము నుండి మిధునము బాల్యమును, కర్కాటకము నుండి తుల యవ్వనమును, వృశ్చికమునుండి కుంభము వృద్ధాప్యమును సూచించును. పైన గల ఖండముల యందలి బిందువులును విడివిడిగా కూడవలెను. ఏ ఖండమునందు హెచ్చు బిందువులుండునో జాతకుడు ఆ వయస్సునందు అభివృద్ధి, సుఖములను పొందును.

(16) కొంత మంది అభిప్రాయము ప్రకారము పైన తెల్పిన ఖండ విభజన లగ్నము నుండి చేయవలెను. మరికొందరు బిందువులను కూడు నప్పుడు 8-12 యింటినందలి బిందువులను తొలగించవలెనని సూచించినారు.

ప్రామాణిక జాతకంలో 1. 2, 3 ఖండములలో క్రమముగా 122, 105, 110 బిందువులు సూత్రము (15) ప్రకారము కలవు. 115, 114, 108 బిందువులు సూత్రము (16) ప్రకారము కలవు. ఏ విధముగా చూసినా జాతకురాలు బాల్యము నందు హెచ్చు సౌఖ్యవంతమైన జీవితమును పొందును. వృద్ధాప్యము కూడా చాలావరకు సౌఖ్యప్రదముగానే యుండును.

(17) ఏ ఖండము నందు శుభులు మాత్రమే ఉందురో అట్టి జీవిత బాగము పూర్తిగా సంతోషప్రదముగా నుండును. శుభులూ, పాపులు యిరువురూ ఖండము నందున్నచో సుఖదుఃఖములు మిశ్రమముగా కల్గును. పాపులు మాత్రమే ఖండము నందున్న ఆ వయసు నందు జాతకుడు పూర్తిగా దుఃఖమును మాత్రమే అనుభవించును.

బిందువులు తక్కువ వున్నప్పుడు కలుగు ఫలములు, శుభుల స్థితిచే సరిచేయబడును. హెచ్చు బిందువులుండుట పాపుల స్థితిచే ప్రతి హతము చేయబడుతుంది. ఆ విధంగా ఏదైనా ఖండమునందు అతితక్కువ బిందువులుండగా దీనికి తోడు ఆ ఖండము నందు పాపులు కూడ వున్నచో అట్టి ఖండము సూచించు వయసు అత్యంత దుఃఖ భరితముగా నుండును.

(18) సాధారణంగా బిందువుల సంఖ్య తక్కువగా వుంటే జాతకుడు వ్యాధి, మనోవ్యధ, ఆశాభంగములను పొందును. గర్గముని అభిప్రాయ రీత్యా నీచ, అస్తంగత్వాదులలో పాపులు గల ఖండమునకు గానీ అతి తక్కువ బిందువులు కల్గినచో అట్టి ఖండము సూచించు వయసు నందు ధన నష్టము కారాగారము ఇత్యాదులు అనుభవించును. ఖండము నందు (హెచ్చు బిందువులు కల్గి) శుభులు ఉచ్ఛ, స్వక్షేత్ర స్థితి యిత్యాదులు కల్గితే అట్టి ఖండము సూచించు వయసు నందు జాతకుడు కీర్తి, అదృష్టము, సంపదలను పొందును. శుభులు నీచ మొదలగు వానిలో నుండగా పాపులు అనుకూలముగా నుండినచో మిశ్రమ ఫలములు కలుగును.



(19) లగ్నమునందుగల బిందు సంఖ్య సూచించు వయసు దాటిన తర్వాత జాతకుడు వాహనము, ప్రభువుల మన్నన, సంపద, సంతానము ఇత్యాదులను పొందును. అయితే జాతక చక్రము నందు వాటికి సరియగు యోగము లుండవలెను.

(20) పన్నెండవ యింటి అధిపతి లగ్నము నందుండగా, లగ్నాధిపతి, ఎనిమిదవ యింటి అధిపతి బలహీనముగా నున్నచో, మకర, కుంభ లగ్నములందు జన్మించిన జాతకులకు లగ్నము నందుగల బిందు సంఖ్య ఆయుర్దాయ సంవత్సరములను సూచించును.

(21) లగ్నాధిపతి, నాల్గవ యింటి అధిపతులు పరస్పరము పరివర్తన చెందగా వారుగల రెండు రాశులయందు 23 చొప్పున బిందువులున్నచో జాతకుడు మంత్రి పదవి, సంపదలను పొందును.

(22) లగ్నము, నాల్గవ యిల్లు, పదకొండవ యిండ్లలో ఒక్కొక్క దానియందు 30కి మించి బిందువులున్నచో జాతకునకు 40 సంవత్సరముల వయసు తర్వాత వ్యక్తిగత ఆకర్షణ గొప్ప సంపదలు పొందును.

(23) నాల్గవ యిల్లు, తొమ్మిదవ యిల్లు, రెండింటినందు 25 నుండి 30 బిందువులున్నచో జాతకుడు 28వ సంవత్సరాంతమునగానీ ఆ తదుపరి గానీ సంపద పొందును.

(24) నాల్గవ యింటినందు 40 బిందువులుండగా అందు గురుడు ఉచ్ఛనందుండగా లగ్నము నందు రవి, మేషము నందు కుజుడు వున్నచో జాతకుడు ప్రభువు అగుటగానీ, లక్ష గుఱ్ఱములను కల్గియుండుటగానీ అగును.

(25) లగ్నము నందు 40 బిందువులుండగా గురుడు ధనుస్సునందు, శుక్రుడు మీనము నందు, శని కుంభము నందు, కుజుడు ఉచ్ఛనందున్నచో జాతకుడు ప్రభువగును.

(26) మేషము, వృషభము, మిధునము, కర్కాటకములు వానియొక్క త్రికోణ రాశులు క్రమముగా తూర్పు నుండి గల నాలుగు దిశలను సూచించును. ప్రతి దిశను సూచించు రాశులందలి బిందువులను విడివిడిగా కూడవలెను.

హెచ్చు బిందువులుగల దిశయందు జాతకుడు ధనము, సంపదలను పొందును. అటువంటి దిశలు సూచించు రాశులు శుభులుకూడ వున్నచో ఇంకా హెచ్చుగా మంచి ఫలితములు కలుగును. లగ్నాధిపతి యున్న రాశి సూచించు దిశయందు జాతకునికి వృత్తి లభించును. రెండవ యింటి ఆధిపతి వున్న రాశి సూచించు దిశగుండా జాతకుడు ధనము పొందును. ఎనిమిదవ యింటి అధిపతి వున్న రాశి సూచించు దిశనందు జాతకునకు విధ్వంసము కలుగును.

(27) పైన తెల్పిన బలమైన దిశలను గృహనిర్మాణము కొరకు ఎంచుకొనవలెను.

(28) లగ్నము నుండి శని వరకుగల బిందువుల మొత్తము కూడి దానికి 7చే హెచ్చించి 27చే భాగించవలెను. శేష సంఖ్యను అశ్విని మొదలుగా లెక్కించగా వచ్చు నక్షత్రమునందుగానీ దాని త్రికోణ నక్షత్రముల యందుగానీ రవ్యాది పాపులు సంచరించు సమయములో జాతకునకు వ్యాధి, దురదృష్టము యిత్యాది బాధలు కలుగును.

(29) పైన తెల్పిన విధముగా వచ్చు శేష సంఖ్య జాతకుడు ఆయా బాధలను పొందు సంవత్సరములు సూచించును.

(30) శుభులు గల రాశులందలి బిందువుల సంఖ్యలను కూడి, 7చే హెచ్చవేసి 27చే భాగించవలెను. శేషమును అశ్విని మొదలుకొని లెక్కించగా వచ్చు నక్షత్రము నందు శుభులు చరించు సమయములో జాతకునకు సుఖము అదృష్టకర సంఘటనలు కలుగ వచ్చును.

(31) శని నుండి లగ్నము వరకుగల బిందువులను, లగ్నమునుండి శనివరకు గల బిందువులను, కుజుని నుండి లగ్నము వరకుగల బిందువులను, లగ్నము నుండి కుజుని వరకుగల బిందువులను, లగ్నము నుండి రాహువు వరకుగల బిందువులను, రాహువునుండి లగ్నమువరకు గల బిందువులను విడివిడిగా కూడవలెను. ప్రతి ఒక్క సందర్భమునందు వచ్చిన మొత్తమును 7చే హెచ్చించి 27చే భాగించవలెను. ప్రతి సందర్భమునందు వచ్చు భాగహారలబ్ధము జాతకునికి దుఃఖము, అలసట, వ్యాధి, అపోహ, ఆయుధములచే గాయములు



మొదలగునవి కలుగు సమయమును సూచించును. ఆయా సందర్భములలో వచ్చు శేషమును అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రములందు పాపులు సంచరించుటచే పైన తెల్పినటువంటి దుష్ఫలములు కలుగును.

ప్రామాణిక జాతకములో (1) లగ్నమునుండి శనివరకుగల బిందువులు 24, 27, 31, 33, 25, 33, 30,26. వీటి మొత్తము 229. (2) శనినుండి లగ్నము వరకుగల బిందువులు 26, 23, 23, 29, 30, 24. వీని మొత్తము 158. (1), (2) సందర్భములయందలి మొత్తములను విడివిడిగా 7చే హెచ్చవేసి, 27చే భాగించగా

| | శేషము | భాగఫలము |
|---|---|---|
| (1) | 10వ నక్షత్రము (మఖ) | 59 |
| (2) | 26వ నక్షత్రము (ఉత్తరాభాద్ర) | 40 |

అనారోగ్యము, అపోహలు మొదలైనవి జాతకురాలి 40, 59 ఏండ్లనందు మరియు శని, కుజ ఇత్యాది పాపులు మఖ, ఉత్తరాభాద్ర నక్షత్రముల యందు చరించు సమయములందు కల్గును. రాహు, కుజులకు కూడా పై విధముగా గణనసేయగా

(1) కుజున నుండి లగ్నము 83

83ను 7చే హెచ్చించి 27చే భాగించగా శేషము 14 (చిత్తా నక్షత్రము) భాగహారలబ్ధము 21 వచ్చును.

(2) లగ్నం నుండి కుజుడు 307

307ను 7చే హెచ్చించి 27చే భాగించగా శేషము 16 (విశాఖ నక్షత్రము); భాగహార లబ్ధము 79.

(3) 1, 2 కుజుడువున్న రాశినందే రాహువు వుండుటచే పైన తెల్పిన (2)నందలి సంఖ్యలే వచ్చును.

అందువలన జాతకురాలునకు 21, 79 ఏండ్ల వయసునందు మరియు చిత్త, విశాఖ నక్షత్రములలో పాపులు సంచరించు సమయములందు పైన (30) సూత్రము నందు తెల్పిన అశుభ ఫలితములు కలుగవచ్చును.

(32) శని వున్న రాశినుండి ఎనిమిదవ ఇంటి అధిపతి వున్నరాశి వరకుగల బిందువులను కూడవలెను. ఈ మొత్తము సంఖ్యను శని నుండి ఎనిమిదవ యింటిలోగల సంఖ్యచే హెచ్చవేసి 27చే భాగించవలెను. ఆ విధముగా వచ్చు శేషమును అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రముగుండా రవి సంచరించు సమయములో జాతకుని మరణము జరుగును.

(33) పైన తెల్పిన సూత్రం (31) మాదిరిగా శుభులను గూడా గణనచేయవలెను. ఆ విధముగా వచ్చు భాగహార లబ్దము సూచించు వయసునందు మరియు ఆయా నక్షత్రములయందు శుభులు సంచరించు సమయములలో జాతకునకు శుభప్రదమైన సంఘటనలు, సంతోషము, జయము, సంతానము కల్గుట, వుద్యోగ అభివృద్ధి మొదలైనవి కల్గును.

ప్రామాణిక జాతకంలో గురునికి సంబంధించిన గణన :- (1) లగ్నం నుండి గురుడు 173.

173ను 7చే హెచ్చించి 27చే భాగించగా భాగహార లబ్దము 44, శేషము 23. (ధనిష్ట నక్షత్రము)

(2) గురుని నుండి లగ్నము 221.

221ను 7చే హెచ్చించి, 27చే భాగించగా భాగాహార లబ్దము 57; శేషము 8 (పుష్యమి నక్షత్రము)

కావున జాతకురాలునకు 44-57 సంవత్సరములయందు మరియు గురుడు ధనిష్ట, పుష్యమి నక్షత్రములయందు చరించు సమయములు అభివృద్ధికరముగా, శుభప్రదముగా, సంతోషకరముగా నుండును.

(34) ఎనిమిదవ యింటి అధిపతి, నాల్గవ యింటి అధిపతి, పదకొండవ యింటి అధిపతిగల రాశులందుగల (శోధనల తర్వాత) బిందువులను (చక్రం-21) ఎనిమిది, నాలుగు, పదకొండు ఇండ్లలో శోధనకు ముందుగల సంఖ్యలచే



క్రమముగా హెచ్చించి ఆ లబ్దమును 12చే భాగించవలెను. శేషమును మేషమునుండి లెక్కించగా వచ్చు రాశినందు రవి సంచరించు మాసములయందు క్రమముగా జాతకుని తండ్రి, తల్లి చనిపోవుట జరుగవచ్చును.

ప్రామాణిక జాతకంలో ఎనిమిదవ యింటి అధిపతి వున్న రాశి (కన్య) నాల్గవ ఇంటి అధిపతి వున్న రాశి (వృశ్చికం). పదకొండవ యింటి అధిపతి వున్న రాశి (వృశ్చికం) నందుగల సంఖ్యలు శోధనల తర్వాత 10, 0, 0. ఈ సంఖ్యలను క్రమంగా 26, 33, 29లచే ఈ సంఖ్యలు శోధనకు ముందు వరుసగా (8-4-11 రాశులలో గల బిందువులు) హెచ్చించి ఆ లబ్దమును 12చే భాగించగా శేషము క్రమముగా 8-9-5లు వచ్చును. (గమనిక: 0చే హెచ్చవేయుటకు బదులు 1చే హెచ్చవేయవలెను. లేనిచో జవాబు '0' వచ్చును) ఇవి క్రమముగా వృశ్చికము, ధనుస్సు, సింహములగును. ఈ రాశులయందు రవి చరించు మాసములలో క్రమముగా జాతకురాలు, ఆమె తండ్రి, ఆమె తల్లి చనిపోవుట జరుగవచ్చును.

(35) సర్వాష్టక వర్గుల యొక్క శోధ్యపిండము సంఖ్యను, ఏదైనా ఒక భావమునందలి (శోధనకు ముందు) బిందు సంఖ్యతో హెచ్చించి, ఆ లబ్దమును 27చే భాగించగా వచ్చు శేషము అశ్విని నుండి లెక్కించగా వచ్చు నక్షత్రములో శని చరించు సమయమునందు ఆ భావమునకు చెందు అశుభ ఫలములు కల్గును.

ప్రామాణిక జాతకంలో సర్వాష్టక వర్గుయొక్క శోధ్యపిండ సంఖ్య 412. (అధ్యాయం-14 చూడండి) లగ్న భావంని పరిశీలిద్దాము. లగ్నంలో శోధనకు ముందుగల బిందువుల సంఖ్య 24. ఈ రెండింటినీ హెచ్చించి 27చే భాగించగా శేషము 6 వచ్చును. అశ్వినినుండి 6వ నక్షత్రము ఆరుద్ర. కావున శని ఆరుద్ర నందుగానీ దాని త్రికోణ నక్షత్రములైన స్వాతి, శతభిషలయందుగానీ చరించు సమయములో జాతకురాలి ఒకటవ భావమునకు చెందు దుష్ఫలితములు కలుగును.

నేను చేసిన పరిశీలనలో గురుడు పైన తెల్పిన విధంగా ఆయా నక్షత్రములయందు చరించు సమయములలో ముఖ్యంగా చాలావరకు ఆ

భావసంబంధమైన శుభఫలితాలు కలగటం గమనించటం జరిగింది. అష్టక వర్గుకి చెందిన ఆ విధమైన గోచారాలను దశాంతర్దశ మొదలుగా గల ప్రభావాలతో అన్వయించి పరిశీలిస్తే ప్రోత్సాహకరమైన ఫలితాలు యిస్తున్నాయి.

(36) పైన చెప్పిన విధంగా రేఖా సర్వష్టక వర్గుయొక్క శోధ్యపిండ సంఖ్యతోకూడ (చక్రం-22) గణన చెయ్యాలి. ఆయా శేషముగాగల నక్షత్రములయందు శని సంచరించు కాలము ఆయా భావములయొక్క ఫలితములు శుభప్రదముగా అభివృద్ధి చెందుతాయి.

ప్రామాణిక జాతకంలో రేఖా సర్వాష్టక వర్గుయొక్క శోధ్యపిండ సంఖ్య 269. (అధ్యాయం-14) ఉదాహరణకు పదవ భావం తీసుకుందాం. అందు 30 రేఖలు వున్నాయి. ఈ రెండింటినీ హెచ్చించగా వచ్చు లబ్దమును 27చే భాగించగా శేషము 24 (శతభిషము) వచ్చును.

శతభిష నక్షత్రములోగానీ, దాని త్రికోణ 77నక్షత్రములైన ఆశ్లేష, జ్యేష్ఠ నక్షత్రములయందు గానీ శని చరించు సమయములలో పదవ భావములయొక్క శుభఫలితములు కలుగుతాయి. ఇదే విధంగా ఇతర భావమును కూడా పరిగణించి గణన చేయవచ్చును.

(37) ఎనిమిదవ భావంలో గానీ పాపులైన రాహు, కుజ, శనులలో ఎవరైనావుంటే సర్వాష్టక వర్గులో శోధనకు ముందు అటువంటి గ్రహంవున్న రాశినందలి బిందువుల సంఖ్య సూచించు వయసునందు జాతకుడు విషప్రయోగం పాలవటంగానీ, శస్త్రచికిత్స పొందవలసి రావటంగానీ, అనారోగ్యం, బాధలను పొందటం వంటివి జరుగుతాయి.

ప్రామాణిక జాతకంలో ఎనిమిదవ యింటిలో శని గలడు. అందు 26 బిందువులు (చక్రం-16) కలవు. జాతకురాలునకు ఆ వయస్సులో విషప్రయోగం జరుగలేదుగానీ అపుడు రెండు నెలలపాటు జాతకురాలు తీవ్రమైన రక్తహీనత వ్యాధితో బాధపడటం జరిగింది.

(38) శుభులైన గురుడు, శుక్రుడు, బుధుడు వున్న రాశులందు గల సంఖ్యలు సూచించు వయసునందున జాతకుడు ధనము, కీర్తి, సంతానము, వివాహము, వైవాహిక సుఖము, మంచి విద్య గౌరవము వంటి శుభఫలితాలను అనుభవించటం జరుగుతుంది.





# అధ్యాయం-12

## సంఘటనలు - సమయ నిర్ణయము

రెండు ముఖ్యమైన ఉపయోగాలకు ప్రస్తారాష్టక వర్గులను వర్తింపజేయవచ్చును. దశా ఫలాలకు రూపు నివ్వటానికి, గోచారరీత్యా ఫలితాలను జోస్యం చెప్పటానికి ఇవి ఉపయోగిస్తాయి. సంఘటన జరుగు సమయంని ఎంత వీలైతే అంత సంక్షిప్తంగా కుదించి నిర్ణయించవచ్చును. దశాంతర్దశాది వాటి దృక్పథంతో గోచారంలో ఉన్న గ్రహాలు యిచ్చే ఫలితాల యొక్క విధానం గురించి అభిప్రాయాలు అనేక రకాలుగా మారి*తున్నాయి. అయితే జ్యోతిష పండితులతో నేను చేసిన చర్చల నుండి, విధేయతతో కూడిన నా పరిశీలన నుండి నేను సేకరించిన ఫలితాల వరుస క్రమానికే నా అంతట నేనుగా కట్టుబడి వుంటాను. ప్రస్తారాష్టక వర్గునుపయోగిస్తూ మహాదశ ఫలితాల వివరణల గురించి హెచ్చు సమాచారం ప్రాచీన జ్యోతిష గ్రంథాలలో లభ్యం కావటం లేదు. కాబట్టి నేనిక్కడ యిచ్చే సమాచారం ఒక నిర్దేశిత పునాది సమర్పించటానికి మాత్రమే ఉద్దేశించబడింది. దీనిని ఆధారంగా చేసుకొని తెలివైన జ్యోతిష్కులు ఇంకా హెచ్చుగా దీనిని విస్తరింపజేయగలరు.

ఈ పుస్తకంలో ఎక్కడైనాసరే సూటిగా చెప్పనంత వరకూ 'దశ' అంటే ఈ రోజుల్లో విస్తారంగా వాడబడే వింశోత్తరీ దశాపద్ధతి అనే అర్థమే కానీ అష్టకవర్గు దశా పద్ధతి మాత్రం కాదు. అష్టకవర్గు ప్రకారం వెల్లడి అయ్యే ఆయుర్దాయం పూర్తిగా నమ్మకమైన దానిగా అగుపించటంలేదు. అష్టక వర్గు రీత్యా వివిధ గ్రహాలు ప్రదానంచేసే ఆయుర్దాయ ప్రమాణంపై అష్టక వర్గు దశ ఆధారపడి వుంటుంది. అందువలన అష్టకవర్గు దశపై ఆధారపడటం అంత హెచ్చు క్షేమకరం కాదు. కానీ ఎప్పుడైనా అది అంతర్దశకు అన్వయించిన విషయం అయితే దాని అర్థం వింశోత్తరీ దశా పద్ధతి రీత్యా గ్రహంయొక్క అంతర్దశ అనైనా అర్థం యిస్తుంది. లేకపోతే దశాకాలాన్ని సంజ్ఞాపరంగా ఈ క్రింది పరిచ్ఛేదాలలో వివరించిన విధంగా 8 లేక 12 భాగాలుగా విభజింపబడటం అయినా అవుతుంది.

## మహాదశలు

1) దశానాధునికి సంబంధించిన ఆధిపత్యము, స్థితి, సంబంధ, దృష్టి మొదలగు జ్యోతిష విషయములను పరిగణనలోనికి తీసుకోవాలి.

2) దశానాధుడు వున్న రాశియందు (దశానాధుని స్వంత అష్టకవర్గు నందు) హెచ్చు బిందువులున్నచో, ఫలితములు తప్పనిసరిగా అనుకూలముగా నుండును.

3) దశానాధుడు వున్న కక్ష్యను గుర్తించాలి. కక్ష్యనాధుని గుర్తించాలి. దశానాధుని అష్టక వర్గునందు దశానాధుడు వున్న రాశిలో కక్ష్య నాధునికి చెందు బిందువున్నచో, దశానాధుడు అనుకూల ఫలములనిచ్చును.

## భుక్తులు (అంతర్దశలు)

1) తక్కువ బిందువులు కల్గిన గ్రహము (మహాదశానాధుని అష్టకవర్గునందు) యొక్క భుక్తి సమయము సామాన్యముగా దుష్ఫలములను ఈ క్రింది భావములకు చెందు సంఘటనల యందు కలుగజేయును.

(1) భుక్తి నాధుడు ఆధిపత్యము వహించు భావములు

(2) భుక్తినాధుడు వున్న భావము

(3) దశానాధుని అష్టక వర్గునందు భుక్తి నాధుడు వున్న రాశిలో భుక్తినాధుని యొక్క కక్ష్య నాధుని బిందువు లేకున్నచో అట్టి కక్ష్య నాధుని భావము.

2) భుక్తి నాధుడు 4 కంటే హెచ్చు బిందువులను కల్గియుంటే ప్రతిష్ఠ, ఆర్థికముగా జయము, ఆరోగ్యము, రాజకీయ అధికారము మొదలగు అనుకూలమైన ఫలితములు కలుగును. వీటితోపాటుగా క్రింద తెలియజేయబడిన భావములు సూచించు సంఘటనలు కూడా జరుగును.

1) భుక్తినాధుడు ఆధిపత్యము వహించు భావము

2) భుక్తినాధుడు స్థితిని చెందు భావము

3) దశానాధుని అష్టకవర్గులో భుక్తినాధునియొక్క కక్ష్య నాధుడు తన బిందువు భుక్తినాధుడు వున్న రాశినందున్నచో అటువంటి భావము.



నీచ యిత్యాది స్థానముల యందుగానీ, లేదా దుస్థానములయందు గానీ స్థితి చెందుటచే కల్గు లోపమును దశానాధునియొక్కగానీ లేదా అంతర్దశానాధునియొక్కగానీ బిందువుయొక్క బలము ప్రతిహతము చేయగల శక్తి కల్గియుండును. అదేవిధముగా గ్రహములు యివ్వగలుగు రాజయోగములు, యితర అనుకూల ఫలములు దశాంతర్దశా నాధుల బిందువులు లేకపోవుటచే తొలగింపబడును.

భుక్తినాధుడు ఆధిపత్యము వహించు రెండు రాశుల యందునూ హెచ్చు బిందువులును కల్గియున్నచో భుక్తినాధుని చేతనత్వము పెరుగుతుందని గ్రహించాలి. సూర్య చంద్రులకు మాత్రము ఈ సూత్రము వర్తిల్లదు. దశానాధుడు వున్న కక్ష్యకు చెందు అధిపతియొక్క బిందువు దశానాధుడు వున్న రాశియందుండుటచే దశానాధునికి శక్తి కలుగజేస్తుంది, అన్నది (మనం) గమనించిన ఒక ముఖ్యమైన విషయం. అ విధంగా కక్ష్యానాధుని బిందువు వుంటే పైన తెల్పిన (1), (2), (3)ల విధంగా ఫలితాలనివ్వటంలో దశానాధుని వివేచన బలవత్తర మవుతుంది (బిందువు) లేకపోయినట్లయితే నిర్దేశితమైన ఆటంకాలు ఏర్పడతాయి.

ఈ విధమైన ఫలితాలను ఎల్లప్పుడూ గోచార ఫలితాలను పరిగణనలోనికి తీసుకుని సమ్మిళితం చేసి మాత్రమే వివరించాలి.

ప్రామాణిక జాతకంలో ఉదాహరణగా మనం గురు మహాదశని పరిశీలిద్దాం. ఈ మహాదశ 30-7-1930 నుండి 30-7-1946 వరకు జరుగుతుంది. గురుడు లగ్నం నుండి 3, 12 యిండ్ల అధిపతిగా కళంకితుడు (ఆధిత్యపాపి). కానీ చంద్ర లగ్నం నుండి 2, 11 అధిపతిగా గురుడు అంత పాపికాడు. స్థితిరీత్యా లగ్నాత్తు ఆరవ యింటినందు, చంద్ర లగ్నాత్తు అయిదవ యింటి నందు మంచి స్థితినే పొందుచున్నాడు. గురుడు ఇచ్చు ఫలములు ముఖ్యంగా 3వ యిల్లు (సోదరులు) 12వ యిల్లు (నష్టము, అపకీర్తి మొదలైనవి); 5వ యిల్లు (సంతానము); 11వ యిల్లు (లాభములు), చివరగా 6వ యిల్లు (వ్యాధి, శత్రువులపై జయము మొ॥) లకు చెందుతాయి. తన స్వంత అష్టక వర్గులో గురుడు 7 బిందువులను

..ల్గయుండుటచే శుభత్వం కల్గియుండి మొత్తంమీద అనుకూల ఫలితాలనిస్తాడు. నిజానికి గురు మహాదశలో ఆమెకు వివాహం అవటం, సంతానం కల్గటం, కుటుంబ జీవితంలో అడుగుపెట్టడం, ఆర్థికంగా అభివృద్ధి చెందటం లాంటివి (శుభ ఫలితాలు) జరిగినా అదే సమయంలో ఆమె అత్యంత ఆవేదన, దుఃఖము, అపోహలకు కూడా గురైనది. పన్నెండవ యింటి ఫలితాలు పూర్తిగా ఫలప్రదమగుటచే ఆ విధంగా జరిగి వుండవచ్చు. అయితే గురునియొక్క అంతర్గతమైన శుభ లక్షణములు జాతకురాలు పైన తెల్పిన కష్టముల నన్నింటినీ అధిగమించునట్లు చేయగలిగాయి. గురుడు మిధున రాశిలో $23^{0}$-$35^{'}$ లలో వుండుటచే చంద్రునియొక్క కక్ష్యలో నుండుట గమనించగలము. గురుడు వున్న రాశిలో చంద్రుడు తన బిందువును ప్రదానము చేసి యుండుటచే గురునియ్యొక్క (ఆధిపత్య ఇతరత్రా) పాపలక్షణములు కొంతవరకు తగ్గించబడ్డాయి.

ఇప్పుడు గురు మహాదశలో శని భుక్తిని తీసుకుందాం. (వింశోత్తరి దశాపద్ధతిరీత్యా) ఇది 18-9-1932 నుండి 30-5-1935 వరకు జరిగింది. భుక్తి నాధుడైన శని లగ్నాధిపత్యము (శరీరము, ఆరోగ్యము మొ॥) రెండవ యింటి ఆధిపత్యము (ధనము, కుటుంబము) కలిగి యుండి సప్తమ భావం (భర్త)లో గలడు. గుర్వష్టకవర్గునందు శనికి 4 బబిందువులు కలవు. అందువలన మంచి, చెడు రెండు ఫలితాలు జరగటానికి అవకాశముంది. గురు, కుజ, బుధ, చంద్రులకు సంబంధించు శుభ సంఘటనలు, శని, రవి, శుక్ర, లగ్నములకు చెందు దుష్ఫలితములు కల్గుటకు అవకాశముంది. కుటుంబ జీవితంలో అడుగు పెట్టడంతో జాతకురాలి తండ్రి కష్టాలను ఎదుర్కొన్నారు. భర్త ఉన్నతశ్రేణికి చెందు పరీక్షలలో కృతార్థుడైనారు. జాతకురాలు తీవ్ర అస్వస్థతకు గురి అగుట తటస్థించెను. శని ఆధిపత్యము వహించు రెండు రాశులయందు కూడా (హెచ్చు) బిందువులు కలవు. అందువలన మొత్తముపై శని భుక్తి శుభప్రదముగానే జరిగినది.

కొంతమంది (జ్యోతిష) విద్వాంసులు ఒక మహాదశను ఎనిమిది సమ భాగములుగా విభజించవచ్చునని అభిప్రాయపడుతున్నారు.



భూమి నుండి వివిధ గ్రహములకు చెందు కక్ష్యలకు యివి అన్వయించ బడ్డాయి. ఈ పద్ధతి ప్రకారం ఈ కక్ష్యలు క్రమంగా శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్ర, లగ్నములకు వరుసగా చెందుతాయి. దీని అర్థం భుక్తికి చెందిన సమయం మహాదశా సమయంలో సరిగ్గా ఎనిమిదవ భాగం వుంటుంది. ఏ దశకైనా ఇదే వర్తిల్లుతుంది. భుక్తులు పైన చెప్పిన క్రమంలోనే ఉంటాయి.

ప్రామాణిక జాతకంలో గురు మహాదశ సమయం పైన చెప్పిన ప్రస్తారపరంగా ఈ క్రింది విధంగా విభజింపబడుతుంది.

గురు మహాదశ సమయం మొత్తం 30-7-1930 నుండి 30-7-1946 వరకు జరుగును.

గమనిక : మొత్తం మహాదశను 8 సమ భాగాలుగా చేస్తే ఒక్కొక్క భుక్తి సమయం 2 సంవత్సరాలుంటుంది.

| | |
|---|---|
| | 1930 - 7 - 30 |
| I శని భుక్తి | 2 - 0 - 0 |
| | 1932 - 7 - 30 |
| II గురు భుక్తి | 2 - 0 - 0 |
| | 1934 - 7 - 30 |
| III కుజ భుక్తి | 2 - 0 - 0 |
| | 1936 - 7 - 30 |
| IV రవి భుక్తి | 2 - 0 - 0 |
| | 1938 - 7 - 30 |
| V శుక్ర భుక్తి | 2 - 0 - 0 |
| | 1940 - 7 - 30 |
| VI బుధ భుక్తి | 2 - 0 - 0 |
| | 1942 - 7 - 30 |
| VII చంద్ర భుక్తి | 2 - 0 - 0 |
| | 1944 - 7 - 30 |
| VIII లగ్న భుక్తి | 2 - 0 - 0 |
| | 1946 - 7 - 30 |

గురు అష్టకవర్గులో గురుడున్న రాశినందు శని తన బిందువు ప్రదానము చేయలేదు. కాబట్టి మొదటి రెండు సంవత్సరాలు (శని కక్ష్యకు చెందు గురు మహాదశ సమయము) కొంతవరకు అనుకూలముగా వుండదు. అయితే గురు అష్టక వర్గులో శనియొక్క రెండు రాశులయందు 5, 4 బిందువులు వుండుట వలన పైన తెల్పిన చెడు ప్రతిహత మవుతుంది. శని లగ్నాధిపతి అగుచూ లగ్నం నుండి ఎనిమిదవ యింటినందు, చంద్రుని నుండి ఏడవ యింటినందు గలడు. కాబట్టి ఈ యిండ్లకు సంబంధించిన ఫలితములే (ఆ సమయంలో జరుగుతాయి). నిజానికి గురు మహాదశ ప్రారంభం కావటంతోనే ఆమె వివాహం జరిగింది. దశాఫలితాలు గోచార ప్రభావంకి అన్వయిస్తూ కూడా వివరణ చేయాలి.

## మరియొక విధానము

మరికొంతమంది ఉద్దేశ్యంలో మహాదశా సమయం (ఎనిమిది సమ భాగాలకు బదులుగా) పన్నెండు సమభాగములను పన్నెండు రాశులకు అన్వయిస్తూ విభజించాలి. గ్రహం వున్న రాశితో లెక్కించటం ప్రారంభించాలి. మొట్టమొదటి 12 భాగపు భుక్తి భావాధిపతి వున్న రాశికి చెందుతుంది. ప్రామాణిక జాతకంలో శని మహాదశను పరిశీలిస్తే దీనిని 12 సమ భాగములుగా విభజిస్తే ఒక్కొక్క భుక్తి సమయము 19 నెలల కాలము విస్తరిల్లుతుంది. శని లగ్నం నుండి ఎనిమిదవ యిల్లు అయిన సింహరాశిలో వున్నాడు. మొట్టమొదటి భుక్తి సమయం అందువల్ల హెచ్చుగా ఎనిమిదవ భావంకి చెందు ఫలితాలు కలుగుతాయి. భుక్తి సమయంకి చెందు రాశినందు గ్రహంకి చెందిన (సంబంధించిన) అష్టక వర్గులో గల తక్కువ, కనీస, హెచ్చు సంఖ్య బిందువులకు అనుగుణంగా ఫలితాల ప్రవృత్తి వుంటుంది. తిరిగి ప్రామాణిక జాతకం తీసుకుంటే సింహరాశిలో 3 బిందువులు మాత్రమే శని అష్టకవర్గులో వున్నాయి. ఈ సంఖ్య కనీస బిందువుల సంఖ్యకంటే తక్కువ. అందువలన జాతకురాలు బాధలు, వ్యాధి, నిరాశలను అనుభవించటం జరిగింది. మూడవ భుక్తి సమయం తులారాశికి చెందింది. ఇది పదవ భావం అవుతుండగా దీనియందు 5 బిందువులు ఉన్నాయి.



ఈ బిందు సంఖ్య కనీస బిందు సంఖ్యకంటె హెచ్చుగా వుంది. ఈ భుక్తి సమయంలో జాతకురాలి భర్తకు సన్మానాలు జరిగాయి. ఇల్లు పొందటం, కుమార్తె కలగటంతోపాటు ఆ సమయం అనుకూల సమయంగా వుంది.

ఈ విధమైన దశా వివరణ పద్ధతిలో పరిశోధనలు ఉత్సాహకరమైన సత్యాలను వెలుగులోనికి తెచ్చాయి. పరిశీలించిన అనేక రాశి చక్రాలలో, కొద్దిగా మినహాయింపులు వున్నప్పటికీ గమనించినది ఏమిటంటే, భుక్తి సమయానికి చెందిన సమయాలలో సూచింపబడిన ఫలితాల సాధారణ ఒరవడి, భుక్తికి చెందు రాశియొక్క భావ ఫలితాలను సూచించినా, ఆ రాశినందు బిందు ప్రదానం చేసిన గ్రహాలు కూడా ఆయా గ్రహాల కారకత్వాలకు అనుగుణమైన ఫలితాల నివ్వటంతోపాటు వాటియొక్క ఆధిపత్య, స్థితి, వీక్షణలకు చెందు భావాలకు సంబంధించి ఫలితాలను కూడా యివ్వ గలుగుతున్నాయి.

పైన తెల్పిన మూడవ భుక్తి సమయము (30-9-1949 నుండి 30-4-1951) తులారాశికి (లగ్నం నుండి పదవ భావంకి) చెందుతుంది. ఈ ఫలితాలు తులారాశిలో 5 బిందువు లుండటం వలన సాధారణంగా అనుకూలముగానే ఉంటాయి. ఈ ఫలితాల స్వభావం కుజుని కారకత్వంనకు చెందు (భూములు, ఇండ్లు), గురుని (సంతానము), రవి (ప్రతిష్ట), చంద్ర (మనశ్శాంతి). శన్యష్టక వర్గు నందు తులారాశి నందుగల 5 బిందువులూ శని, గురు, కుజ, రవి, లగ్నములచే ప్రదానము చేయబడివిగా గమనించగలము.

భుక్తి సమయము ప్రస్తారాష్టక వర్గు క్రమంలో 8 సమాన భాగములుగా చేయబడగా, బిందు ప్రదానము చేసిన గ్రహము, దానియొక్క కారకత్వ (ఆధిపత్య, స్థితి) లకు అనుగుణమగు ఫలములను అట్టి గ్రహములకు చెందు సమయము లందు ఈయగల సమర్ధత కల్గియుండట కూడా గమనించటమైనది. ఈ ప్రకారం ప్రామాణిక జాతకమందు శనియొక్క భుక్తి సమయమును మనం ఈ విధంగా విభజింపవచ్చును.

## మహాదశానాధుడు - శని

భుక్తి - తుల

(లేక అంతరము లేక అంతర్దశ) (మూడవ భుక్తి అంతర్దశ)

తులారాశినందలి బిందువులు - 5

గమనిక : భుక్తి సమయమైన 19 నెలల కాలమును 8 సమాన భాగములుగా చేయగా విదశ సమయము 2 నెలల 11 1/4 దినములు అగును.

భుక్తి ప్రారంభ తేదీ - 30-9-1949

| | |
|---|---|
| | 1949 - 9 - 30 |
| I శని విదశ (ప్రస్తారాష్టక ఆరోహణ క్రమంలో | 0 - 2 - 11 1/4 |
| | 1949 - 12 - 11 1/4 |
| II గురు విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1950 - 2 - 22 1/2 |
| III కుజ విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1950 - 5 - 3 3/4 |
| IV రవి విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1950 - 7 - 15 |
| V శుక్ర విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1950 - 9 - 26 1/4 |
| VI బుధ విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1950 - 12 - 7 1/2 |
| VII చంద్ర విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1951 - 2 - 18 3/4 |
| VIII లగ్న విదశ | 0 - 2 - 11 1/4 |
| | 1951 - 4 - 30 |



శని లగ్నాధిపతి అగుచూ ఎనిమిదవ యింటిలో వున్నా శని బిందువు ప్రదానము చేయుటచే శని విదశా సమయంలో ఏ విధమైన దుష్పరిమాణము జరుగలేదు. రెండవ విదశా సమయమైన గురు విదశనందు గురుడు ఒక బిందువును ప్రదానము చేయుచుండగా 2-11 యిండ్ల అధిపతి అగుచూ చంద్ర లగ్నము నుండి అయిదవ యింటిలో నుండగా భూములు, ఆస్తుల కారకత్వము గల కుజునిచే వీక్షింపబడుచున్నాడు. అందువలన ఈ సమయములో గృహము లభ్యమై జాతకురాలునకు సంతానము కూడా కల్గినది. బిందు ప్రదానము చేయని గ్రహముల విదశలయందు దుష్పరిణామములు గానీ లేదా సాధారణ సంఘటనలు గాని మాత్రమే జరుగుతాయని భావించవచ్చును. బుధ విదశ సమయంలో జాతకురాలు అనారోగ్యం పాలయ్యెను. బుధుడు బిందు ప్రదానము చేయకుండుట గమనించవచ్చును.

ఈ విధమైన దశా వివరణ పద్ధతి చాలా విస్తృతమైన పరిశోధన పని కలిగిస్తుందని నాకు అనిపిస్తున్నది. ఫలితాలు సంభవించే మొత్తం మహాదశ సమయంగానీ లేక రాశికి చెందు భుక్తి (దీనినే అంతర్దశ లేక అంతరం అనికూడా అంటారు) సమయంగానీ లేక భుక్తిని 8 సమాన భాగాలుగా విస్తరింపజేయగా ఏర్పడిన విదశా సమయంని గానీ ఆలోచించేటప్పుడు తగు గోచారాలను కూడా తగు శ్రద్ధతో పరిశీలించాలి. మానవ జీవితాలలో జరుగు సంఘటనలను పరిశీలించే జ్యోతిషం లాంటి శాస్త్రంలో ఖచ్చితమైన సూత్రాలు ఏర్పాటు చేయబడిలేవు. ప్రాచీన గ్రంథాలలో ప్రతిపాదించబడిన జ్యోతిష ప్రామాణిక విషయాలను మన మార్గదర్శక స్థంభాలుగా గ్రహించి ఎంతగా వీలైతే అంత ఖచ్చితమైన పద్ధతులను మనం కల్పన చేసుకోవాలి.



# అధ్యాయం-13

## గోచారము

ప్రాచీన జ్యోతిష గ్రంథాలలో గోచారము వలన కలిగే ఫలితాలు అనేక పద్ధతులతో విశదీకరించబడ్డాయి. వాటిని ఘనంగా చెప్పటంగానీ లేదా నిందించటంగానీ నా ఉద్దేశ్యంకాదు. జ్యోతిషంవంటి శాస్త్రంలో పద్ధతులయొక్క పరాధీనత సాధించిన ఫలితాలు ఖచ్చితంగా వుండటంపై ఆధారపడవలసి వుంటుంది. జన్మరాశి లేక జన్మ చంద్రుని నుండి గ్రహాలయొక్క చలనములను పరిగణిస్తు ఫలితాలకు రూపునివ్వటం. మినహాయింపు వంటిది కాకపోయినా భారతదేశంలో జ్యోతిష శాస్త్రజ్ఞుల శ్రేణి జాబితాలో ఒక తప్పనిసరియైన సూత్రం అయ్యింది. లట్ట (లత్త) గానీ, దశాంతర్దశలు గానీ (గోచారంతో పోల్చితే) హెచ్చు ప్రాధాన్యత ఈయబడడంలేదు. అటువంటి గోచార పద్ధతుల వివరణయొక్క విశ్వసనీయతగానీ మరే విధంగానైనా విమర్శించటం నాకు వర్తిల్లదు.

గోచారము అనగా గ్రహములయొక్క మార్గము లేదా గమనము. ఒక రాశినుండి మరియొక రాశికి కదలటానికి అవి వేరువేరు విధములైన సమయాన్ని తీసుకుంటాయి. శక్తులయొక్క ఉత్పత్తి, పంపకములలో ఈ విధమైన గ్రహ గమనములు నిర్దేశిత మార్పులను కలుగజేస్తాయి. ఆ విధమైన మార్పులు సాధారణంగా అయితే మానవాళిపైన విశేషంగా వ్యక్తులపైనా వాటియొక్క ఫలితాలను విధిగా కలుగజేస్తాయి. గోచార ఫలితాలు ఎంత శక్తివంతమైనవి అయినా జనన రాశి చక్ర ప్రభావాలకు అతీతం కాదన్నది గ్రహించాలి. కొన్ని జ్యోతిష గ్రంథాలలో గ్రహాల దశాంతర్దశా ప్రభావాలకన్నా గోచారంలోనే జన్మ చంద్ర స్థితి ననుసరించి,జనన సమయంలోగల ఇతర గ్రహస్థితి ననుసరించి శుభాశుభ ఫలితాలను కలుగజేస్తాయని వ్రాయబడింది. వాస్తవము, అనుభవముల వెలుతురులో అటువంటి అభిప్రాయము ప్రతిపాదితమైనది కానేరదు. నా ఉద్దేశ్యంలో ప్రశ్న మార్గ గ్రంథమందలి అష్టకవర్గు రీత్యా వివరింపబడిన గోచార విషయము చాలా వరకు పద్ధతిగాను శాస్త్రీయముగాను ఉంది.



గోచార ఫలితాలను వివరించటంలో రెండు విధానాలున్నాయి.

(1) సంబంధించిన గ్రహం యొక్క అష్టకవర్గు (2) చరిస్తున్న గ్రహంయొక్క శుభాశుభత్వము.

రవ్యాది గ్రహములు జన్మచంద్రుని రాశినుండి వివిధ రాశులలో చరించునపుడు ఈ విధమైన ఫలితాలను కలుగజేయవచ్చును.

రవి : (1) ఆర్థిక నష్టము, అసౌఖ్యము, రొమ్మునందు నొప్పి, ఏ ఉద్దేశ్యములేని ప్రయాణము, (2) ఖర్చు పెరుగుదల, కంటి వ్యాధి, వంచన, సంతోషము లేకపోవుట, (3) రాబడి పెరుగుదల, వ్యాధుల నుండి స్వస్థత, శత్రువులపై జయము, (4) భార్యతో తగవులు, వైవాహిక జీవితములో అశాంతి, అనారోగ్యము, (5) శత్రువుల పెరుగుదల, శరీర అసౌఖ్యము, (6) శత్రువులపై జయము, సంతోషము, మంచి ఆరోగ్యము, (7) ప్రయాణ బడలిక, రొమ్మునందు నొప్పి, కడుపునొప్పి, (8) భార్యతో అపోహలుగానీ, విడిపోవుటగానీ, (9) ప్రమాదములు, ఉదర వ్యాధి, మనో వ్యధ, శత్రుత్వము, (10) కార్యజయము, గౌరవము, కోర్కెలు నెరవేరుట, (11) గొప్ప జయము, గౌరవము, వ్యాధినుండి స్వస్థత, అభివృద్ధి, (12) సరియైన మార్గంలో జయము, స్వస్థత.

చంద్ర : (1) మంచి ఆహారము, సౌఖ్యములు, బట్టలు, (2) గౌరవ నష్టము, ధననష్టము, ఇబ్బందుల పెరుగుదల, (3) కుటుంబ సౌఖ్యము, ధనార్జన, (4) ఇతరులలో నమ్మకము పోవుట, మానసిక అశాంతి, (5) అస్వస్థత, (6) సంతోషము, శత్రువులపై జయము, మంచి ఆరోగ్యము, (7) ఇతరుల నుండి గౌరవము, ఆకస్మిక ఆదాయం అనుకోని మూలముల ద్వారా, (8) ఏదో జరుగుతుందని భయము, అసౌకర్యము, బాధలు, (9) మనోవ్యధ, ఉదర సంబంధ వ్యాధులు, కారాగారము (జాతకము నందు సూచనలు వున్నచో), (10) జయము, అధికారము, ఉన్నత పదవి, కోర్కెలు తీరుట, (11) అభివృద్ధి, కొత్త స్నేహితులు, మంచి ఆదాయము, (12) వాహనముల నుండి క్రింద పడుటవలన గాయములు, ఖర్చు పెరుగుదల.

కుజ : (1) అనేక కోణముల నుండి బాధలు, శరీర అసౌకర్యము, (2) ప్రభుత్వం నుండి యిబ్బందులు, శతృవులతో తరచుగా గొడవలు, వ్యాధులు, ప్రమాదములు, వాత పిత్త వ్యాధులు, దొంగిలించబడుటచే నష్టము, (3) శుభ ఫలములచే లాభములు, ఆర్థిక ప్రగతి, పూలు వస్తువుల సంపాదన, అధికారము, (4) జ్వరము, కడుపునొప్పి, మూల శంక వ్యాధి, రక్తస్రావము, వ్యాధులచే తరచు బాధలు, (5) శతృవుల వలన కష్టములు, అనారోగ్యము, సంతానముతో అపోహలు, శరీర శక్తి నష్టము, (6) శతృవులపై జయము, కుటుంబ జగడములకు పరిసమాప్తి, ఆత్మ విశ్వాసము పెరుగుదల, (7) భార్యతో తరచు తగవులు, నేత్ర వ్యాధులు, కడుపునొప్పి, (8) మూలశంకచే రక్తనష్టము, రక్తహీనత, ధననష్టము, పరువు నష్టము, (9) అవమానములచే బాధలు, అధిక ఖర్చులు, అనారోగ్యముచే బలహీనత, (10) అనుకోని మూలము నుండి ధన సంపాదన, (11) కీర్తి, గౌరవము, అధికారము, (12) అనుకోని ఖర్చులు, భార్యతో తగవులు, నేత్ర వ్యాధి, పిత్త రోగములు.

బుధ : (1) చెడువారి సలహాచే ధననష్టము, చాడీలు చెప్పువారి సహవాసముచే బాధలు, తగవులు, కారాగారము, ప్రయాణంలో చెడు వార్తలు, (2) అవమానము, బంధువులచే అవమానము, జయము, సంపద, (3) కొత్త స్నేహితులు శతృవుల నుండి, ప్రభుత్వము నుండి ఆపద పూహించటం, చెడు పనులచే ఉద్దేశ్యము లేని తిరుగుడు (4) కుటుంబ సభ్యుల, బంధువుల అభివృద్ధి, (5) భార్య బిడ్డలతో తగవులు, (6) పేరు ప్రతిష్టలు, జయము, కీర్తి, (7) రక్తహీనత, తగవులు, మానసిక అశాంతి, (8) సంతానము కల్గుట, జయము, సంతోషము, కొత్త వస్తువుల సంపాదన, (9) అడ్డంకులు, మనోవ్యధ, (10) శతృవులయొక్క ఓటమి, ధన సంపాదన, అనుకూల వ్యక్తుల వలననూ, భార్యవలన సంతోషము, (11) ధన సంపాదన, పుత్ర సంతానము కల్గుట, సంతోషము, (12) శతృవుల నుండి అవమానము, వ్యాధి, కుటుంబ విరోధము



గురు : (1) ధన నష్టము, తెలివితేటల నష్టము, ఏ ఉద్దేశ్యము లేని తిరుగుడు, తరచుగా గొడవలు, (2) సంతోషము, కుటుంబములో ఐకమత్యము, శతృవులపై జయము, (3) ఒకచోట నుండి వేరొకచోటికి తిరుగుచుండుట, తన పనికే అడ్డంకులు, పదవీ భంగము, ఆరోగ్య నష్టము, ఏ ఉద్దేశ్యము లేని తిరుగుడు, (11) పూర్వపు అధికారములో పునః ప్రతిష్ట, ఆరోగ్యము తిరిగి పొందుట, (12) ఆశయములనుండి, సత్ప్రవర్తన నుండి పతనం, దుఃఖం పెరుగుదల.

శుక్ర : (1) సంతోషకరమైన జీవితం కోసం సౌఖ్యములు సంపాదన, (2) ధనము బహుమతుల సంపాదన, సంతానం కలుగుట, శృంగార సౌఖ్యము, (3) ప్రతిష్ట, ధనము, గౌరవము, (4) శతృవులకు అవమానము, సాధారణ అభివృద్ధి, (5) స్నేహితులతో సంబంధం తిరిగి కొత్తగా ప్రారంభించటం, కీర్తి పెంపుదల, పలుకుబడి, అధికారము, (6) సాధారణ సంతోషము, వ్యాపారం పెంపుదల, సంతానం కలుగుట, మంచి ఆదాయం, (7) అవమానము, వ్యాధి, ప్రమాదము, (8) గాయములు, స్త్రీలవల్ల యిబ్బందులు, మనో వ్యధ, (9) కొత్త యిల్లు, సంపాదన, విలాస వస్తువులు, బ్రహ్మచారి అయినచో వివాహము, (10) సుగుణముల పెరుగుదల, సంతోషము, ధనము, మతపరమైన పనులు, (11) తగవులు, అవమానం, (12) కొత్త స్నేహితులు, ధనము, సుగంధములు, దుస్తులను సంపాదించుట.

శని : (1) అగ్నివలన, విషము వలన భయము, స్నేహితులవలన కుటుంబ సభ్యులవలన భయము, కారాగార భయము, విదేశయానము, ధననష్టము, దగ్గర బంధువులను కోల్పోవుట, రక్త సంబంధీకుల నుండి విడిపోవుట, అవమానములచే వ్యధ చెందుట, (2) చిక్కిపోయిన శరీరాకారము, సౌఖ్యము కోల్పోవుట, సంపాదనకానీ సుఖముకానీ లేకపోవుట, (3) సంపద పెరుగుదల, ఇతర సౌఖ్యములపెంపు, మంచి ఆరోగ్యము, సాధారణ సైక్యము, శత్రువుల అంతర్ధానము (4) స్నేహితుల నుండి కుటుంబ సభ్యులనుండివిడిపోవుట, అనుమాన తత్త్వము, వంకర ప్రవర్తన, చెడుపనులు, (5) కుమారులనుండి

విడిపోవుట, ధననష్టము, తరుచు గొడవలు (6) శతృవులనుండి స్వేచ్ఛ, రోగ విముక్తి, స్త్రీల సహనము (7) భార్యనుండి సంతానము నుండి విడిపోవుట, గమ్యములేని తిరుగుళ్ళు (8) చెడుపనులు చేయుట, సంతోషము లేకపోవుట (9) ఎనిమిదవ రాశినందు వున్నప్పటి ఫలములే కల్గును. వైరమువలన బాధలు, గుండె జబ్బులు, కారాగారము, (10) కొత్త వృత్తి, ధననష్టము, కీర్తినష్టము (11) తరచు ఓర్మిని కోల్పోవుట, చెడు మార్గముల ద్వారా సంపదను సంపాదించుట. (12) దుఃఖము, కష్టముల పరంపర, అనారోగ్యము, మామూలు యిబ్బందులు.

పైన తెల్పిన ఫలితములు సాధారణముగా జరుగునవి. వీటిని వ్యక్తుల జాతకాలకు దశాంతర్దశ, అష్టక వర్గు యిత్యాదులతో జాగ్రత్తగా కలిపి జాగరూకతతో అన్వయించాలి. జన్మరాశి చక్రములో బంధన యోగములు సూచింపబడనప్పుడు గోచార రీత్యా కారాగారమును జోస్యము చెప్పరాదు. ఆ విధంగానే జాతక చక్రంలో బలమైన (రాశి) యోగములు లేనప్పుడు పేరు ప్రతిష్టలు, కీర్తి మొదలగునవిగోచార ఫలరీత్యా కలిగితే అటువంటివి జరుగుటకు అతి తక్కువ అవకాశముండును.

గ్రహము అనుకూలము అని చెప్పబడిన రాశియందు చరించిపుడు తన అష్టక వర్గులో 4 బిందువులకన్నా తక్కువ బిందువులు వున్నట్లయితే శుభఫలములు కొద్దిగా మాత్రమే కలుగుతాయి. బిందుసంఖ్య 4 అయితే కనీస పద్ధతిలో శుభఫలితాలు వుంటాయి. 4 కంటె హెచ్చు బిందువు అధికంగా కలుగుతాయి. అదేవిధంగా గ్రహం అనుకూలము కాని రాశియందు చరించునప్పుడు ఎక్కువ బిందువులు గానీ వున్నట్లయితే చెడుఫలితాలు బిందుసంఖ్యకు అనులోమానుపాతంలో తగ్గుతాయి. అందుకు విరుద్ధంగా అనుకూలమైన రాశిలో తక్కువ బిందువులు వుంటే శుభఫలితాలు తగ్గుతాయి. అటువంటి రాశిలో అనుకూలముగాని గోచారము జరిగితే దుష్ఫలితాలు యింకా హెచ్చు అవుతాయి.

ఉదాహరణకు ప్రామాణిక జాతకంలో మేషరాశిలో రవి చరిస్తే (చంద్రాత్తు 3 నందు) అనుకూల ఫలములు రావాలి. రవ్యష్టకవర్గులో మేష రాశినందు 5



బిందువులు కలవు. కాబట్టి శుభఫలితాలు షుమారుగా 62% కలుగుతాయి. రవి మేషరాశిలో (చంద్రాత్తు 12 నందు) సంచరిస్తే అందు వ్యతిరిక్తఫలముల నివ్వాలి. రవ్యష్టక వర్గులో మకర రాశిలో బిందువులు లేవు. కాబట్టి యిటువంటి గోచారం వలన దుష్ఫలితాలు పూర్తి హెచ్చు స్థాయిలో కలుగుతాయి.

గోచారంలో ఒక గ్రహం ఎంతవరకు శుభ ఫలితాలను, అశుభ ఫలితాలను ఇవ్వగలదో కొలవటానికి ఇదియొక సాధారణ పద్ధతి.

ప్రాచీన గ్రంథాలయందు చెప్పబడిన విధంగా గ్రహాలు వివిధములైన బిందువులు కల్గిన రాశులలో చరించినపుడు ఈ విధమైన ఫలితాలు కలుగుతాయి.

రవ్యష్టక వర్గు రవి 8 బిందువులు గల రాశినందు చరించినపుడు ఫలితములు సంపద, అభివృద్ధి, ప్రభువుల అభిమానము; 7-క్షేమము సంతోషము, పేరుప్రతిష్టలు; 6-పదవిలో అభివృద్ధి; 5-ధనము; 4- మంచి, చెడు ఫలితాలు సమంగా; 3-ప్రయాణ బడలిక; 2-పాపపు పనులు 1- తీవ్రవ్యాధి; బిందు రహితమైతే మరణము.

అదే విధంగా చంద్రాష్టక వర్గునందు చంద్రుడు 8 బిందువులుగల రాశినందు-సంతోషము, అభివృద్ధి, బంధువులనుండి సహాయము, 7- దుస్తుల లాభము, ఇష్టమైన ఆహారము, సుగంధ ద్రవ్యాల లాభము, 6-మంత్ర పఠనము, మతాధిపతులతో సావాసము; 5- ధైర్యము, మానసిక సంతృప్తి; 4-దుఃఖము, అనారోగ్యము; 3-బంధువులతో తగవులు; 2-భార్యవలన, సంపద వలన తగవులు; 1-పూడ్చలేనటువంటి నష్టములు; బిందురహితమైతే బాధ, తీవ్ర భయము.

కుజుడు తన అష్టక వర్గు రీత్యా 8 బిందువులుగల రాశిలో చరిస్తే భూ ఆస్తుల లాభము, ధనలాభము, గృహసంపాదన, జయము; 7-సోదరులవలన అభివృద్ధి; 6-ప్రభువుల అభిమానము; 5-సంతోషకరమైన అనుభవాలు; 4-మంచి, చెడు ఫలితములు సమపాళ్ళలో; 3-స్త్రీలనుండి, సోదరులనుండి విడిపోవుట; 2-భార్యవలన, సంపదవలన తగవులు; 1-మసూచి వంటి వ్యాధులు మొదలైనవి, బిందు రహితమైతే ఉదర సంబంధ వ్యాధులు, మూర్ఛ, క్షయ.

బుధుడు తన అష్టక వర్గు రీత్యా 8 బిందువులు గల రాశినందు చరించినచో ప్రభువులనుండి మన్ననలు; 7-సంపద పెరుగుదల, పాండిత్యము; 6-ప్రతి కార్యమునందు జయము; 5-బంధువులతో అవగాహన; 4-ప్రతి పనియందు ఉత్సాహము కావలసి యుండుట; 3-కలతపెట్టు ఆలోచనలచే మనస్తాపము; 2-మనోవ్యధచే కల్గు వ్యాధులు; 1-బలవంతముగా కారాగారము, ఊహించని ఆపదలు; బిందు రహితమైతే అనుకోని విధంగా అన్నిటియందు నష్టములు తిరిగి అందువలన మానసిక వ్యధ.

గురుడు తన అష్టక వర్గు రీత్యా 8 బిందువులుగల రాశినందు చరించు సమయమునందు చక్రవర్తి, అధికారము, రాజ్యాధినేతగా అభివృద్ధి; 7-సంపద లాభము, సంతోషము; 6-దుస్తుల, వాహనములు, బంగారము లాభము; 5-శత్రువులకు వినాశనము, కోరిన వాటిని సాధించుట; 4-లాభ నష్టములు సమపాళ్ళలో; 3-నరాల బలహీనత, చెవి జబ్బులు; 2-ప్రభువుల, పై అధికారుల కోపము; 1-బంధువుల నష్టము, సంపద నష్టము, బిందు రహితమైనచో మతిభ్రమ, సంపద నష్టము, సంతాన నష్టం.

శుక్రుడు తన అష్టక వర్గు రీత్యా 8 బిందువులుగల రాశినందు చరించినచో మంచి దుస్తులు, స్త్రీలచే, పుష్పములచే భోగము, ఆరోగ్యకరమైన ఆహారము; 7-నగల, ముత్యముల లాభము, 6-అనుకూలమైన అర్ధాంగిచే సౌఖ్యము; 5-స్నేహితులతో కలయుట; 4-మంచి చెడులు సమపాళ్ళలో; 3-బంధువులతో, తాను నివసించు స్థలమందున్న వారితోనూ గొడవలు; 2-వ్యాధులు పదవీయోగం; 1-జలము వలన, విషము వలన భయము; బిందురహితమైతే అన్ని విధములైన ఆపదలు.

శని తన అష్టకవర్గు రీత్యా 8 బిందువుల గల రాశినందు చరించితే గ్రామమునకుగానీ పట్టణముగానీ పాలనా ఆధిపత్యము పొందుట; 7-సేవకులను, సాధుజంతువులను పొందుట; 6-దొంగల నడుమ, కొండవాసుల మధ్య సైన్యాధక్షుల మధ్య పేరుప్రతిష్టలు; 5-అపరాల లాభము; 4-మంచి, చెడు సమపాళ్ళలో; 3-సంపద, సేవకుల, స్త్రీల, సంతోషము మొదలగు వాటి నష్టము;



2-కారాగారము, భయము, వ్యాధి; 1-అధోగతి, బిందురహితమైతే అన్నిటియందు దురదృష్టము.

పైన తెల్పిన వివరణలో కుజుడు 3 బిందువులుగల రాశినందు చరించినప్పుడు "సోదరుల నుండి, స్త్రీలనుండి విడిపోవుట" ఇది చంద్రుని నుండి 12వ రాశి అగుచూ దశాఫలితాలు కూడా అటువంటి చెడు ఫలితాలు సూచించకపోయినా లేదా జాతకునికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళు లేకపోయినా అటువంటి సందర్భాలలో జ్యోతిష్కుడు తన సహజమైన తెలివితేటల్ని ఉపయోగించి తీర్పును సరిచేయాలి.

సాధారణంగా ఒక గ్రహం తన అష్టకవర్గులో అతిహెచ్చు బిందువులుగల రాశినందు చరించు సమయంలో అది లగ్నాత్తు ఆ రాశి సూచించు భావమునకు చెందు ఫలితాలను అభివృద్ధి పరుస్తుంది.

ప్రామాణిక జాతకంలో లగ్నము మకరము అవుతూ చంద్రుడు కుంభము నందుగలడు. గురు అష్టక వర్గులో కర్కాటకమునందు 6 బిందువులు కలవు. గురుడు కర్కాటకమునందు చరిస్తున్నాడని అనుకుందాము. అప్పుడు అది చంద్రాత్తు 6వ రాశి అగుచూ "మనోవ్యధ, స్నేహితులు శత్రువులుగా మారుటను" సూచిస్తుంది. కాని ఆ రాశి లగ్నాదిగా 7వది అవుతున్నది. కాబట్టి భర్తతో అపోహలు, దానివలన మనస్సుకు ఆందోళన వూహించాలి. అయితే అక్కడ 6 బిందువులున్నాయి. ఇది చెడు ఫలితాలను 75% వరకు ప్రతిహతము చేస్తుంది. అందువలన దుష్ఫలితాలు చాలవరకు తొలగింప బడటమే కాకుండా బంగార లాభము, వాహన లాభము వంటివి భావించ వచ్చును.

ప్రస్తార చక్ర పద్ధతి రీత్యా భ చక్రమందలి ప్రతిరాశి 8 సమాన భాగములుగా లేక కక్ష్యలుగా (ఒక్కొక్కటి 3 3/4 డిగ్రీల వంతున) శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, చంద్ర, లగ్నముల వరుస క్రమంలో విభజింపబడుతుందని మనము యిదివరకే గమనించాము. గ్రహము ప్రతి రాశినందు చరించే సమయంలో పైన తెల్పిన విధంగా ప్రతి కక్ష్యద్వారా చరించాలి. రాశి నందలి బిందువుల సంఖ్య (ఏ గ్రహం యొక్క అష్టకవర్గునందైనా) ప్రతి ఒక్క గ్రహం మొత్తముపై

ప్రదానము చేసినవి అగును. ప్రస్తార చక్రము అట్టి బిందువులను ప్రదానము చేసిన గ్రహములను తెలుపుతుంది.

ప్రామాణిక జాతకంలో (గురుని అష్టక వర్గులో) కుంభరాశినందు 4 బిందువులు గలవు. గురుని ప్రస్తార చక్రము ఈ బిందువులు కుజ, శుక్ర, బుధ, లగ్నములచే ప్రదానము చేయబడినవిగా విశదీకరిస్తున్నది. గురుడు కుంభరాశి 19-2-1962 నాడు ప్రవేశించెను. కాబట్టి కుంభరాశి నందలి వివిధ కక్ష్యలలో షుమారుగా గురుని చలన సమయము ఈ విధంగా ఉంటుంది.

| | కక్ష్య | చలన స్ఫుటము | గోచార సమయము |
|---|---|---|---|
| 1 | శని | 300''-0' నుండి 303''-45' | 19-2-62 నుండి 4-4-62 |
| 2 | గురు | 303''-45' నుండి 307''-30' | 4-4-62 నుండి 19-6-62 |
| 3 | కుజ | 307''-30' నుండి 311''-15' | 19-6-62 నుండి 4-8-62 |
| 4 | రవి | 311''-15' నుండి 315''-0' | 4-8-62 నుండి 19-9-62 |
| 5 | శుక్ర | 315''-0' నుండి 318''-45' | 19-9-62 నుండి 4-11-62 |
| 6 | బుధ | 318''-45' నుండి 322'-30' | 4-11-62 నుండి 19-12-62 |
| 7 | చంద్ర | 322''-30' నుండి 326''-15 | 19-12-62 నుండి 4-2-63 |
| 8 | లగ్నం | 326''-15 నుండి 330''-0 | 4-2-63 నుండి 17-4-63 |

సాధారణంగా జన్మరాశి నందు గురుని చలన సమయము అనుకూలము కాదు. ఇది "ధన నష్టము, మానసిక ఆందోళన, పదవి, తరచు గొడవలు" సూచిస్తుంది. ఇక్కడ ఈ రాశి లగ్నం అవుతున్నది. కాబట్టి ఫలములు హెచ్చుగా ఒకటవ భావంకి చెందినవై వుంటాయి. కానీ కుంభమునందు 4 బిందువులు వుండటం వలన చెడు 50% వరకు తగ్గింపబడి లాభనష్టాలు రెండు సమపాళ్ళలో వుంటాయి. గురుడు మొదటిదైన శని కక్ష్యనందు (19-2-1962 నుండి 4-4-1962) చరించు సమయంలో అనారోగ్యము (శని బిందువును ప్రదానము చే[illegible]నందున) శరీరంలో నొప్పులు, ఆర్థిక నష్టము (శని 12వ ఇంటి ఆధిపత్యము కల్గి వుండుటచే)



కల్గును. గురుడు రెండవ కక్ష్య అయిన స్వీయ కక్ష్యయందు చరించు సమయము (4-4-1962 నుండి 19-6-62) అనుకూలమైన ఫలితములను వూహించాలి. కారణం గురుడు 3, 12 ఇండ్ల అధిపతియే కాకుండా బిందు ప్రదానము చేసి యుండలేదు. గురుడు మూడవ కక్ష్య (కుజునికి చెందునది) నందు చరించు సమయము (19-6-62 నుండి 4-8-62)లో మంచి ఆదాయంని జోస్యం చెప్పాలి. భూలాభము, సంతానము వలన ఆందోళన కల్గును. కుజుడు బిందు ప్రదానము చేసినాడు. కాబట్టి దుష్ఫలితాలు చాలావరకు తగ్గింపబడతాయి.

బిందు ప్రదానం చేస్తున్న గ్రహంయొక్క కారకత్వ లక్షణములు కూడా ఫలితాలుగా ప్రకటిత మవుతాయని ఒక వర్గానికి చెందువారి ఆలోచన వుంది. ఈ విధమైన ఆలోచనలనో చాలా సత్యం వుందని నేను భావిస్తున్నాను. బిందు ప్రదానం చేస్తున్న గ్రహం తాను వున్న భావం కంటె వీక్షిస్తున్న భావంయొక్క ఫలితాలనే హెచ్చుగా కలుగ చెయ్యటాన్నికూడా గమనించడమైనది. ఆ విధంగా ప్రామాణిక జాతకంలో గురుడు గోచారంలో తనయొక్క కక్ష్యలో (రాశి చక్రంలో గురుడు యింటిని వీక్షిస్తూ ఉండటం వలన) జాతకురాలునకు కొంత ఆర్థిక పరమైన నష్టాలు కలిగాయి. శనియొక్క కక్ష్యనందు గోచార గురుడు సంచరిస్తున్నపుడు, శని అయిదవ యింటిని రాశిచక్రంలో వీక్షిస్తూ వుండటం వలన జాతకురాలు ఆమె సంతానానికి సంబంధించి చాలా వ్యాకులత చెందటం జరిగింది.

ప్రాచీన గ్రంథాలనుండి సేకరించిన ఈ క్రింది ఫలితాలను గోచారం పరిశీలించేటప్పుడు ఉపయోగ పడతాయని గుర్తించటం జరిగింది.

(1) బిందు రహితంగా వున్న రాశినందు శని చరించు సమయంలో (శోధన అనంతరం బుధ అష్టక వర్గునందు) సహోదరులకు, సంతానమునకు, స్నేహితులకు తీవ్ర అస్వస్థత కల్గును.

(2) ఒకరాశిలో గ్రహం చరిస్తున్న కాలంలో ఆ రాశిలో బిందు ప్రదానము చేసిన గ్రహాల యొక్క కక్ష్యలగుండా చరిస్తున్న సమయాలలో మాత్రమే అట్టి గ్రహం శుభ ఫలితాలను ఈయ గలుగుతుంది.

(3) ఎప్పుడైతే 4 లేక అంతకంటె హెచ్చు గ్రహాలు పైన చెప్పిన (2)లా విధంగా చరిస్తాయో అత్యధికమైన శుభఫలితాలు కలుగుతాయి.

(4) ఎప్పుడైతే ఒకగ్రహము ఒక రాశిలో తన అష్టక వర్గునందు బిందు ప్రదానం చేసిన గ్రహములయొక్క కక్ష్యలగుండా చరిస్తిందో ఆ సమయంలో అట్టి గ్రహం క్రింద తెలియచేయబడిన ఫలితాలను ఈయగలుగుతుంది.

1. అట్టి గ్రహం యొక్క కారకత్వ లక్షణాల ననుసరించి,
2. కక్ష్య అధిపతి వున్న రాశికి చెందు భావఫలములు,
3. గోచార సమయంలో వున్న రాశికి లగ్నాదిగా గల భావఫలములు.

ఉదాహరణకు ప్రామాణిక జాతకంలో రవియొక్క గోచారం పరిశీలిద్దాము. రవి కన్యా రాశిలో గలడు. రవి గోచార రిత్యా మిధున రాశినందు (జూన్ 14 నుండి జూలై 15) చరిస్తున్నాడని అనుకుందాం. ప్రతికక్ష్య నందు రవి 3 దినముల 18 గంటల చొప్పున చరించును. మిధున రాశినందు 5 బిందువులు శని, కుజ, రవి, బుధ, లగ్నంలచే ప్రదానం చేయబడ్డాయి. అందు వల్ల గోచార ఫలితములు.

(1) రవి యొక్క కారకత్వ లక్షణములను అనుసరించి;

(2) మొదటి 3 3/4 దినములు రవి శని కక్ష్యనందు చరించును. శని బిందు ప్రదానము చేసినాడు. సింహరాశిలో గలడు. శని నుండి 11 నందు (సింహం నుండి మిధునం) చరిస్తున్నందు వలన అనుకూల ఫలితములు కలుగును. రవి మూడవది అయిన కుజుని కక్ష్యనందు చరించు సమయం- కుజుడు బిందు ప్రదానం చేసినాడు. కుజుని నుండి 11 నందు రవి గలడు. అనుకూల ఫలితములే కల్గును.

(3) రవి చారము లగ్నము నుండి ఆరవ యింటి నందు కల్గుటచే ఆరవ యింటియొక్క ఫలితములే కల్గును.

(5) గోచారము జరుగుచున్న రాశినందు హెచ్చు బిందువులు వుండటంతో పాటు అటువంటి రాశి గ్రహంయొక్క ఉచ్చరాశి గానీ, స్వక్షేత్రం గానీ



అయినట్లయితే శుభఫలితాలు మరింతగా అభివృద్ధి చెందుతాయి. అదే విధంగా ఆ రాశి గ్రహం యొక్క నీచ రాశిగాని అయిట్లయితే ఫలితాలు కూడా అనుగుణంగా తగ్గిపోతాయి.

(6) గోచార గ్రహము, కక్ష్య అధిపతి మిత్రులైతే ఫలితాలు హెచ్చు శుభప్రద మవుతాయి. లేకపోతే ప్రతికూల ఫలితాలు కల్గుతాయి.

ప్రామాణిక జాతకంలో శనియొక్క కక్ష్యనందు చరించు సమయంలో శని బిందు ప్రదానం చేసినా శనికి రవి శత్రువు అవటం వలన శుభఫలితాల ప్రభావం కొంత తగ్గటం జరుగుతుంది.

(7) సాధారణంగా బిందురహితమైన కక్ష్యనందు బుధుడు చరించు సమయంలో తగవులు, నరాల నిస్రాణత కలుగుతాయి.

(8) బిందు రహితమైన కక్ష్యనందు (శోధన తర్వాత బుధాష్టక వర్గునందు) శని చరించు సమయంనందు సోదరులకు అనారోగ్యము, ఇతర దుష్ఫలితాలు కలుగుతాయి. అట్టి రాశి చంద్రాదిగా 8 లేక 12వ రాశి అయితే జాతకునకు అనారోగ్యము కల్గును.

(9) బిందురహిత కక్ష్యనందు గురుడు (తనయొక్క అష్టక వర్గునందు) చరించు సమయంలో మనోవ్యధ, ఆర్థిక పరమైన దుఃఖము, ఖర్చులు పెరగటం, జాగ్రత్తగా మాట్లాడటంవలన యిబ్బందులు కలుగుతాయి.

(10) బిందు ప్రదానము చేసిన గ్రహముయొక్క కక్ష్యనందు శని (తనయొక్క అష్టకవర్గునందు) చరించు సమయములో వారసత్వపుటాస్తులు కలసి వస్తాయి. అటువంటి కక్ష్య బిందురహితమైతే ప్రమాదములు, ఎత్తునుండి పడిపోవుట, ఆయుధములచే గాయాలు, తగవులు, అపోహలు కలుగుతాయి.

(11) శన్యష్టక వర్గు నందుగల అతి తక్కువ బిందువులుగల రాశిని గుర్తించండి. ప్రతిదినము ఆ రాశి వుదయిస్తున్న సమయానికి జాతకుడు కొంత మానసిక బాధను లేక అటువంటి యిబ్బందిని ఎదుర్కొంటాడు.

(12) సర్వాష్టక వర్గు రీత్యా చంద్రుడున్న రాశినుండి 12-1-2 రాశులయందు 30 బిందువులకంటె హెచ్చు బిందువులున్నచో ఏలిన్నాటి శని సమయమైన 7 1/2 సంవత్సరాల కాలము నందు జరుగు దుష్ఫలితాల తీవ్రత తగ్గుతుంది.

శని, గురుల గోచారములు ప్రముఖమైనవి. మిగిలిన గ్రహముల గోచారములు రెండవ స్థాన ప్రముఖత కల్గియుండును. ఏ నిర్దేశిత సమయంకైనా గోచారముయొక్క, దశల రీత్యా కలుగు ఫలితము రెండింటి మిశ్రమమే జరుబోవు ఫలితముల ప్రవృత్తిని తెల్పుతుంది. అనేక రాశి చక్రముల యందలి జరిగిపోయిన సంఘటనలను పరిశీలించడం ద్వారా పాఠకుడు లబ్ధిపొందగలడు. దీని వలన ఈ పుస్తకంలో వివరింపబడిన సంఘటనల సమయనిర్ధారణ పద్ధతిని తనంతట తానుగా పరీక్షించి అది నిజానికి నెంత ఖచ్చితంగా వర్తిల్లుతుందో తెలుసుకోగలడు.



# అధ్యాయం - 14

## ఆయుర్దాయ నిర్ణయం

ప్రాచీన జ్యోతిష రచయితలు అష్టక వర్గాయువు, జీవ శర్మాయువు, పిండాయువు, నైసర్గికాయువు, అంశాయువు వంటి అనేక రకములైన ఆయుర్దాయములను సిఫారసు చేశారు. ప్రాచీన జ్యోతిష గ్రంథాలలో షుమారు 32 పద్ధతులు చెప్పబడ్డాయి. ప్రాచీన ప్రామాణికులు వీటిలో ఏ పద్ధతులు ఖచ్చితమైనవో, సర్వత్రా అంగీకరింపబడగలవో తెల్పియుండలేదు. విధేయతతో కూడిన మా అభిప్రాయం ప్రకారం గణితవిధానాల రీత్యా ఆయుర్దాయ నిర్ణయం చేయటం అంతక్షేమకరంగా ఆధారపడదగినిది కాదు. చాలా ఉదాహరణలలో అంశాయు పద్ధతి సరియైన ఫలితాలను ఇయ్యగల్గినా అష్టక వర్గు రీత్యా నిర్ణయింపబడిన ఆయుర్దాయం చాలా ఉదాహరణలలో సంతృప్తికరంగా గుర్తింపబడలేదు.

అష్టక వర్గు రీత్యా అయుర్దాయం గణన చేయటం ప్రాచీన గ్రంథాలలో చాలా పద్ధతులలో ఈయబడింది. వాటినన్నింటినీ నిర్వహించటానికి నేనిప్పుడు ఉద్దేశించటంలేదు. కారణం అవి అన్నీ మోయలేనన్ని భారమైనవే కాకుండా అక్కరలేనంత అధికంగా నిర్వహింపబడినవి అని నా ఉద్దేశ్యం.

ఈ అధ్యాయ గమనంలో నా అంతట నేనుగా రెండు పద్ధతులకు మాత్రమే కట్టుబడి ఉండును. భిన్నాష్టక వర్గు పద్ధతి ద్వారా, రెండవది సర్వాష్టక పద్ధతిద్వారా ఆధారపడినవి. ఒక్కొక్క పద్ధతి ఎంతవరకూ ఖచ్చితమైన దానిగా నమ్మదగినదో తెలివైన పాఠకుడు తానుగా గ్రహించవలసి వుంది.

(1) భిన్నాష్టక వర్గురీత్యా ఆయుర్దాయ గణన చేయువిధానము:- పరిగణింపవలసిన ముఖ్యమైన అంశాలు:- రాశి గుణకార సంఖ్య (భ చక్ర భాజకములు), గ్రహ గుణకార సంఖ్య (గ్రహ భాజకములు).

రాశి గుణకార సంఖ్య, గ్రహ గుణకార సంఖ్యలను కనుగొనుటకు గ్రహముల భిన్నాష్టక వర్గు (శోధనల తర్వాత)లను గ్రహించవలెను

## రాశి గుణకార సంఖ్య

భ చక్రము నందుగల ప్రతి రాశికి ఒక సంఖ్య నిర్దేశింపబడినది. దీనిని ఆ రాశియొక్క రాశి గుణకార సంఖ్య అందురు. మేషాదిగా గల రాశులకు నిర్దేశింపబడిన రాశి గుణకార సంఖ్యలు ఈ విధముగా కలవు.

| | | |
|---|---|---|
| మేషం - 7; | సింహం - 10; | ధనస్సు - 9; |
| వృషభం - 10; | కన్య - 5; | మకరం - 5 |
| మిథునం - 8; | తుల - 7; | కుంభం - 11 |
| కర్కాటకం - 4; | వృశ్చికం - 8; | మీనం - 12. |

పైన తెల్పిన రాశి గుణకార సంఖ్యలు అందరి జాతకములందు ఒకే విధముగా నుండును.

ప్రతి గ్రహముయొక్క అష్టక వర్గు నందు గల వివిధ రాశులయందలి (రెండు శోధనల తర్వాత) బిందువులను ఆయా రాశులయొక్క రాశి గుణకార సంఖ్యచే హెచ్చవేసి, ఆ విధముగా వచ్చు 12 రాశుల యొక్క లబ్ధమును కూడవలెను. ఆ మొత్తమును అట్టి గ్రహముయొక్క రాశి పిండ సంఖ్య అందురు.

ప్రామాణిక జాతకంలో రవి అష్టక వర్గు, రెండు శోధనల తర్వాత ఆ విధముగా నున్నది. (పటము-19)

| | | | |
|---|---|---|---|
| 0 | 0 | 3 | 2 |
| 2 | రవి అష్టక వర్గు రెండు శోధనల తర్వాత పటము - 18 | | 0 |
| 0 | | | 0 |
| 0 | 1 | 0 | 4 రవి |



పైన చెప్పిన సూత్ర ప్రకారము

| రాశి | రాశినందుగల బిందు సంఖ్య | | రాశి గుణకారము | | లబ్దము |
|---|---|---|---|---|---|
| మేషము | 0 | × | 7 | = | 0 |
| వృషభము | 3 | × | 10 | = | 30 |
| మిథునం | 2 | × | 8 | = | 16 |
| కర్కాటకము | 0 | × | 4 | = | 0 |
| సింహము | 0 | × | 10 | = | 0 |
| కన్య | 4 | × | 5 | = | 20 |
| తుల | 0 | × | 7 | = | 0 |
| వృశ్చికం | 1 | × | 8 | = | 8 |
| ధనుస్సు | 0 | × | 9 | = | 0 |
| మకరం | 0 | × | 5 | = | 0 |
| కుంభం | 2 | × | 11 | = | 22 |
| మీనం | 0 | × | 12 | = | 0 |
| | | | రవియొక్క రాశి పిండ సంఖ్య | = | 96 |

ఇదే సూత్రమును మిగిలిన గ్రహములకు వర్తింపజేయగా ఆయా గ్రహములయొక్క రాశి పిండ సంఖ్యలు ఈ విధముగా వచ్చును. చంద్ర-80; కుజ-126; బుధ-97; గురు-79; శుక్ర-61; శని-108.

## గ్రహపిండ

ప్రతి రాశికి ఒక గుణకార సంఖ్య (రాశి గుణకారము) వున్న విధంగానే ప్రతి గ్రహంకి కూడా ఒక గుణకార సంఖ్య (గ్రహ గుణకారము) ప్రత్యేకించడింది. గ్రహముయొక్క అష్టకవర్గులో (రెండు శోధనల తర్వాత మిగిలిన) వివిధ గ్రహములు వున్న రాశుల యందలి బిందువుల సంఖ్యను గ్రహ గుణకార

సంఖ్యచే హెచ్చవేసి ఆ విధముగా వచ్చు లబ్దములను కూడగా అట్టి గ్రహముయొక్క గ్రహపిండ సంఖ్య వచ్చును.

వివిధ గ్రహములకు ప్రత్యేకించబడిన గ్రహ గుణకార సంఖ్యలు ఈ విధముగా కలవు.

రవి - 5; గురు - 10; చంద్ర - 5; శుక్ర - 7; కుజ - 8; శని - 5; బుధ - 5

గమనిక : అందరి జాతకములకు ఈ సంఖ్యలు ఇదే విధముగా నుండును.

ప్రామాణిక జాతకంలో రవి కన్యారాశిలోను, చంద్రుడు కుంభ రాశినందు, కుజుడు వృశ్చిక రాశినందు, బుధుడు తులారాశినందు, గురుడు మిధున రాశినందు, శుక్రుడు కన్యారాశినందు, శని సింహరాశినందు కలరు. రవి అష్టకవర్గు (రెండు శోధనల తర్వాత)ను పరిశీలించగా రవిగల కన్యారాశినందు 4 బిందువులు కలవు. దీనిని రవియొక్క గ్రహ గుణకార సంఖ్య అగు 5చే హెచ్చవేయగా లబ్దము 20 వచ్చును. చంద్రుడు కుంభము నందుండగా అక్కడ 2 బిందువులు కలవు. చంద్రుని గ్రహగుణకార సంఖ్య 5చే దీనిని హెచ్చవేయగా లబ్దము 10 వచ్చును. ఇదే విధముగా మిగిలిన గ్రహములకు వర్తింపజేయగా రవియొక్క గ్రహపిండ సంఖ్య ఈ విధముగా వచ్చును.

| గ్రహము | రాశి | శోధనల తర్వాత రాశినందలి బిందువులు | | గ్రహ గుణకార సంఖ్య | | లబ్దము |
|---|---|---|---|---|---|---|
| రవి | కన్య | 4 | × | 5 | = | 20 |
| చంద్ర | కుంభం | 2 | × | 5 | = | 10 |
| కుజ | వృశ్చికం | 1 | × | 8 | = | 8 |
| బుధ | తుల | 0 | × | 5 | = | 0 |
| గురు | మిధునము | 2 | × | 10 | = | 20 |
| శుక్ర | కన్య | 4 | × | 7 | = | 28 |
| శని | సింహం | 0 | × | 5 | = | 0 |
| | | | | రవియొక్క గ్రహ పిండ సంఖ్య | = | 86 |



రవియొక్క గ్రహ పిండ సంఖ్య 86 అగుచున్నది. ఇదే విధముగా మిగిలిన గ్రహములకు కూడా వర్తింపజేయగా ఆయా గ్రహములయొక్క గ్రహపిండ సంఖ్యలు ఈ విధముగా కలవు.

చంద్ర-20; కుజ-71; బుధ-61; గురు-45; శుక్ర-5; శని-62. రాశి పిండ సంఖ్య గ్రహ పిండ సంఖ్య కూడినచో గ్రహముయొక్క శోధ్య పిండ సంఖ్య, వచ్చును. (శోధ్యపిండను "యోగపిండ"అనికూడా పిలుస్తారు)

* శోధ్యపిండ సంఖ్యను 7చే హెచ్చవేసి (మండల సంఖ్యయగు) 27చే భాగించవలెను. భాగాహార లబ్దము 27కంటె హెచ్చుగ నున్నచో దానినుండి 27ను తీసివేయవలెను. ఈ విధముగా వచ్చు సంఖ్య అట్టి గ్రహము యిచ్చు ఆయుర్దాయము (హరణలకు ముందుగా) ను సూచించును.

ప్రామాణిక జాతకంలో రవి గ్రహమును పరిశీలించగా -

| | | |
|---|---|---|
| రవి రాశి పిండ సంఖ్య | - | 96 |
| రవి గ్రహ పిండ సంఖ్య | - | 86 |
| రవి శోధ్య పిండ సంఖ్య | - | 182 |

182ను 7చే హెచ్చవేసి 27చే భాగించగా 47.20 వచ్చును. దీనినుండి 27ను తీసివేయగా 20.20 మిగులును. ఈ సంఖ్య రవి కలుగజేయు ఆయుర్దాయమును (హరణలకు ముందుగా) సూచించును.

★ *జాతక పారిజాతము ననుసరించి గ్రహముయొక్క శోధ్య పిండ సంఖ్యను 30చే భాగించగా వచ్చు భాగాహార లబ్దము గ్రహము యిచ్చు ఆయువును సూచించును. ఈ భాగాహార లబ్దము 12 కంటె హెచ్చు వుంటే దానిని 12చే భాగించి శేషమును మాత్రమే పరిగ్రహించవలెను. (1) గ్రహము ఉచ్చలో నున్నచో రెట్టింపు చేయవలెను. (2) గ్రహము నీచ అస్తంగత్వ గ్రహణముల యందున్నచో సగము చేయవలెను. (3) ఉచ్ఛ నీచ స్థానములకు మధ్యలోనున్నచో, అనురూపము రీత్యా గణనచేసి ఆయుర్దాయమును గణన చేయవలెను.*

*శంభుహోర గ్రంథము ననుసరించి భాగహార లబ్దము 27 కంటె హెచ్చు (54 కంటె తక్కువ) వున్నచో దీనిని 54 నుండి తీసివేయవలెను. లేక 54 కంటె హెచ్చు (81 కంటె తక్కువ) వున్నచో దానిని 81 నుండి తీసివేయవలెను. లేక 81 కంటె హెచ్చు (108 కంటె తక్కువ) వున్నచో దానిని 108 నుండి తీసివేయవలెను. వాస్తవ అనుభవంలో ఈ పద్ధతి అంత సంతృప్తికరమైనదిగా గుర్తింపబడలేదు.*

ప్రామాణిక జాతకం ప్రకారం వివిధ గ్రహములు ప్రదానము చేయగలుగు ఆయుర్దాయము (హరణలకు ముందు) ఈ విధముగా నుండును.

| | | | |
|---|---|---|---|
| రవి | - | 20.20 | సంవత్సరములు |
| చంద్ర | - | 26.93 | ,, |
| కుజ | - | 24.07 | ,, |
| బుధ | - | 13.96 | ,, |
| గురు | - | 5.15 | ,, |
| శుక్ర | - | 17.11 | ,, |
| శని | - | 17.07 | ,, |
| | మొత్తము | 124.49 | సంవత్సరములు |

## హరణలు లేక తగ్గింపులు

గ్రహములయొక్క యుతి, వీక్షణ, స్థితి యిత్యాదులచే పైన వచ్చిన ఆయుర్దాయము నిర్దేశిత హరణలకు అన్వయింపచేయవలసి వుంటుంది.

(1) రాశినందు ఒకటి కంటె హెచ్చు గ్రహములున్నచో గ్రహము యిచ్చు ఆయుర్దాయమును సగమునకు తగ్గించవలెను.

(2) గ్రహము నీచలో నుండినా అస్తంగత్వము చెందినా ఆయుర్యామును సగమునకు తగ్గించవలెను.

(3) గ్రహము శతృక్షేత్రములో వున్నచో ఆయుర్దాయమునందు మూడవ వంతు ఆయువును తగ్గించవలెను (మూడు పాళ్ళలో రెండు పాళ్ళు మాత్రమే పరిగణించవలెను)

(4) భ చక్ర దృశ్య సగభాగములో పాపగ్రహము వున్నచో ఆయుర్దాయమును ఈ విధముగా తగ్గించవలెను. 12వ యిల్లు - పూర్తిగా 11వ యిల్లు - సగమునకు; 10వ యిల్లు-మూడవ వంతు ఆయుర్దాయమును మొత్తము ఆయువులో తగ్గించవలెను. 9వ యిల్లు పావు భాగమును తగ్గించవలెను; 8వ యిల్లు 5వ భాగమును తగ్గించవలెను. 7వ యిల్లు - 6వ భాగమును తగ్గించవలెను. భ చక్ర దృశ్యపు సగభాగములో శుభుడుగానీ వున్నచో పైన తెల్పిన వివిధ ఇండ్లలో పాపగ్రహము పోగొట్టుకొను ఆయువులో సగభాగము మాత్రమే పోగొట్టుకొనును.

(5) గ్రహయుద్ధమునందు పరాజిత గ్రహము అయినచో 3వ భాగము తగ్గించవలెను.

(6) రవిగానీ చంద్రుడుగానీ గ్రహణము నందున్నచో 3వ భాగము తగ్గించవలెను.

ఒకే గ్రహము (పైన తెల్పిన) ఒకటికంటె హెచ్చు విధములైన హరణలకు గురి అయితే అన్నింటిలో హెచ్చు హరణమును మాత్రమే (ఒక పర్యాయమే) గురిచేయవలెను.

ప్రామాణిక జాతకంలో రవి (1)వ హరణకు; కుజ, బుధులు నాల్గవ హరణకు; శుక్రుడు 1, 2, 4 హరణలకు; శని 3వ హరణకు గురిచేయబడినవి. శుక్రుడు మూడు విధములైన హరణలకు గురిచేయబడుటచే అన్నింటిలో హెచ్చు అయిన ఒక హరణకు మాత్రమే గురిచేయవలెను.

ప్రామాణిక జాతకంలో ఈ హరణలను అన్వయింపచేయగా -

| గ్రహము | మొత్తము ఆయువు | గురిచేయబడిన హరణ | ఎంత హరణ | నికర ఆయువు |
|---|---|---|---|---|
| రవి | 20.20 | (1) | 1/2 | 10.10 |
| చంద్ర | 26.93 | - | - | 26.93 |
| కుజ | 24.07 | IV | 1/2 | 12.035 |
| బుధ | 13.96 | IV | 1/6 | 11.63 |
| గురు | 5.15 | - | - | 5.15 |
| శుక్ర | 17.11 | I, II, III | 1/2 | 8.555 |
| శని | 17.05 | III | 1/3 | 8.535 |
| | | | నికర ఆయువు | 82.935 |

నికర ఆయువు చంద్రమాన సంవత్సరములను తెల్పును. దీనిని సౌర మాన సంవత్సరములుగా మార్చుటకు పైన వచ్చిన నికర ఆయువును 324చే హెచ్చవేసి ఆ లబ్దమును 365చే భాగించవలెను. ప్రామాణిక జాతకంలో సౌరమాన సంవత్సరాలలో జాతకురాలి ఆయుర్దాయము

$$\frac{82.935 \times 324}{365} = 73.619$$ సంవత్సరములు

## రెండవ పద్ధతి

అష్టక వర్గు విధానంలో ఆయుర్దాయమును నిర్ధారణ చేసే యింకొక పద్ధతిని "నక్షత్రాయు పద్ధతి" అంటారు. మామూలు విధంగా సర్వాష్టక వర్గు (శోధనల తర్వాత పటం - 21) యొక్క శోధ్య పిండ సంఖ్యను కనుగొనవలెను. ఇదివరకు మాదిరిగానే రాశి గుణకములచేతనూ, గ్రహ గుణకముల చేతనూ హెచ్చవేయవలెను. వచ్చిన మొత్తమును 7చే హెచ్చించి ఆ లబ్దమును 27చే భాగించవలెను. భాగాహార లబ్దమును (100 కంటె హెచ్చు అయినచో వందనుండి తీసివేయవలెను. ఫలితమును 324చే హెచ్చించి 365చే భాగించవలెను. ఆ విధముగా వచ్చింది. ఆ వ్యక్తియొక్క నక్షత్రాయువును సూచించును.

ప్రామాణిక జాతకంలో సర్వాష్టక వర్గునందలి బిందువుల సంఖ్య (శోధనల తర్వాత పటము-21)లను శోధ్యపిండ సంఖ్యను కనుగొనుటకు ఈ విధముగా గుర్తిచేయబడినవి.

### గ్రహపిండ

| గ్రహము | రాశి | బిందువులు | | గ్రహ గుణకము | | లబ్దము |
|---|---|---|---|---|---|---|
| రవి | కన్య | 10 | × | 5 | = | 50 |
| చంద్ర | కుంభం | 1 | × | 5 | = | 5 |
| కుజ | వృశ్చికం | 0 | × | 8 | = | 0 |
| బుధ | తుల | 0 | × | 5 | = | 0 |
| గురు | మిధునం | 7 | × | 10 | = | 70 |
| శుక్ర | కన్య | 10 | × | 7 | = | 70 |
| శని | సింహం | 0 | × | 5 | = | 0 |
| | | | | గ్రహ పిండ సంఖ్య | = | 195 |



### రాశి పిండ పటం-21

| రాశి | బిందువులు | | రాశి గుణకము | | లబ్దము |
|---|---|---|---|---|---|
| మేషము | 7 | × | 7 | = | 49 |
| వృషభము | 0 | × | 10 | = | 0 |
| మిధునం | 7 | × | 8 | = | 56 |
| కర్కాటకము | 1 | × | 4 | = | 4 |
| సింహము | 0 | × | 10 | = | 0 |
| కన్య | 10 | × | 5 | = | 50 |
| తుల | 0 | × | 7 | = | 0 |
| వృశ్చికం | 0 | × | 8 | = | 0 |
| ధనుస్సు | 2 | × | 9 | = | 18 |
| మకరం | 1 | × | 5 | = | 5 |
| కుంభం | 1 | × | 11 | = | 11 |
| మీనం | 2 | × | 12 | = | 24 |
| | | | రాశి పిండ సంఖ్య | = | 217 |

| గ్రహపిండ | + | రాశి పిండ | = | శోధ్యపిండ |
|---|---|---|---|---|
| 195 | + | 217 | = | 412 |

సర్వాష్టక వర్గు యొక్క శోధ్యపిండ సంఖ్య = 412

దీనిని 7చే హెచ్చవేసి ఆ లబ్దమును 27చే భాగించగా

$$\frac{412 \times 7}{27} = 106.80$$ సంవత్సరములు

ఈ సంఖ్యను తిరిగి 324చే హెచ్చించి 365చే భాగించగా

$$\frac{106.80 \times 324}{365} = 94.8$$ సంవత్సరములు

ఇది జాతకురాలి నక్షత్రాయువును సూచించును.

## రేఖాశోధ్య పిండ సంఖ్య

సర్వాష్టక వర్గు నందలి బిందువులు శోధ్య పిండ సంఖ్య కనుగొనిన రీతిగానే, రేఖా సర్వాష్టక వర్గు (పటం-22) నందలి రేఖల శోధ్య పిండ సంఖ్యను కూడా నిర్ణయించవచ్చును. రేఖల శోధ్యపిండముయొక్క ఉపయోగము ఇంతకుముదు పేజీలలో వివరించబడింది. -

ప్రామాణిక జాతకం నందలి రేఖా సర్వాష్టక వర్గు నందలి శోధనల తర్వాత మిగిలిన రేఖలు (పటం-25) రేఖలతో శోధ్య పిండం ఈ విధంగా కనుగొనవచ్చును.

| రాశి | శోధనల తర్వాత రేఖలు | | రాశి గుణకారము | | లబ్దము |
|---|---|---|---|---|---|
| మేషము | 2 | × | 7 | = | 14 |
| వృషభము | 0 | × | 10 | = | 0 |
| మిధునం | 6 | × | 8 | = | 48 |
| కర్కాటకము | 1 | × | 4 | = | 4 |
| సింహము | 4 | × | 10 | = | 40 |
| కన్య | 2 | × | 5 | = | 10 |
| తుల | 1 | × | 7 | = | 7 |
| వృశ్చికం | 2 | × | 8 | = | 16 |
| ధనుస్సు | 0 | × | 9 | = | 0 |
| మకరం | 1 | × | 5 | = | 5 |
| కుంభం | 0 | × | 11 | = | 0 |
| మీనం | 0 | × | 12 | = | 0 |
| | | | రాశి పిండ సంఖ్య | = | 144 |



## రేఖల గ్రహపిండ సంఖ్య

| గ్రహము | గ్రహము వున్న రాశినందలి రేఖలు | | గ్రహ గుణకారము | | లబ్దము |
|---|---|---|---|---|---|
| రవి | 2 | × | 5 | = | 10 |
| చంద్ర | 0 | × | 5 | = | 0 |
| కుజ | 2 | × | 8 | = | 16 |
| బుధ | 1 | × | 5 | = | 5 |
| గురు | 6 | × | 10 | = | 60 |
| శుక్ర | 2 | × | 7 | = | 14 |
| శని | 4 | × | 5 | = | 20 |
| | | | గ్రహ పిండ సంఖ్య | = | 125 |

| రేఖా రాశి పిండ + | రేఖా గ్రహ పిండ | = | రేఖా శోధ్యపిండ |
|---|---|---|---|
| 144 + | 125 | = | 269 |

అష్టక వర్గు పద్ధతి ద్వారా గణన చేసిన ఆయుర్దాయము సాధారణంగా వాస్తవ సాధనలో బాగా వర్తిల్లటంలేదు అన్న విషయం గ్రహించాలి. జ్యోతిష శాస్త్ర అధ్యయనం చేసే విద్యార్థి అవగాహన చేసుకోవటం కోసం ఉదాహరణ సహితంగా పద్ధతులు వివరింపబడ్డాయి. పరిశోధనతో కూడిన అధ్యయనం మాత్రమే ఈ పద్ధతి నందలి లోపాలను బహిర్గతం చేయగలదు. వివిధ యోగముల ననుసరించి వాటితో పాటుగా వింశోత్తరి దశాఫలితాలను అనుసరించి ఆయుర్దాయం యొక్క ఖచ్చితమైన అంచనా ఆధారపడి వుండాలి. గణిత సంబంధమైన పద్ధతులు మాత్రమే సరియైన రాజమార్గం కాజాలవు.

# అధ్యాయం-15

# మిశ్రమ విషయములు

## రవి

1) 5, 6, 7 లేక 8 బిందువులు గల రాశినందు రవి చరించు సమయము దూర ప్రయాణాలు చేయటానికి, వివాహములు జరిపించటానికి, ఇతర మంచి పనులు చేయటానికి శుభప్రదమైనవి.

2) 3, 2 లేక 1 బిందువు గల రాశినందు రవి చరించు సమయమునందు చేయు పనులు సాధారణంగా సఫలీకృతం కావు. బిందు రహితమైన రాశి అయితే ఆ సమయంలో ఏవిధమైన శుభకార్యం తలపెట్టడమైనా నిషిద్ధము. 4 బిందువులు గల రాశి అయితే ఫలితము మంచి చెడుల మిశ్రమము అవుతుంది.

3) అతి హెచ్చు బిందువులు గల రాశి సూచించు దిశలో శివుని విగ్రహ ప్రతిష్ట చేయటం ఆధ్యాత్మికపరమైన విషయాల అభివృద్ధికి దోహదకారి అవుతుంది.

4) రవి వున్న రాశినుండి I వరుసగా నాలుగు రాశులందలి బిందువులను కూడుము. II తర్వాత రవి నుండి 5వ స్థానము నుండిగల నాలుగు రాశులందలి బిందువులను కూడుము. III తర్వాత రవి నుండి 9వ స్థానం నుండి గల వరుస నాలుగు రాశులందలి బిందువులను కూడవలెను. రెండు, మూడు విభాగముల యందలి బిందువులు సంఖ్యకన్నా మొదటి విభాగమందలి బిందువుల సంఖ్య హెచ్చుగా వున్నచో, దినము నందలి (మూడు భాగములలో) మొదటి భాగము వివాహము చేయుట, ముఖ్యులతో పరస్పర సమావేశములగుట మొదలగు శుభప్రదమగు పనులు చేయుటకు మంచి సమయము అగును. ఒకటవ, మూడవ విభాగముల కన్నా రెండవ విభాగము నందలి బిందువుల సంఖ్య హెచ్చుగా వున్నచో దినము నందలి రెండవ భాగమునకు చెందు సమయము శుభప్రదముగా నుండును. మూడవ భాగము నందలి బిందువుల



సంఖ్య హెచ్చుగా వున్నచో దినమునకు చెందు మూడవ భాగమందలి సమయము శుభప్రదముగా నుండును. అతి తక్కువ బిందువులు సూచించు దినమునకు చెందు సమయమునందు ఏ విధమైన శుభకార్యముల కొరకుగానీ తిరస్కరించవలెను.

## చంద్ర

5) ఆరు, ఏడు లేక ఎనిమిది బిందువులుగల రాశులందు చంద్రుడు చరించు సమయము వివాహము చేయుట, సహాయకులను నియమించుట, చదువు ప్రారంభించుట, స్నేహము చేయుట వంటి కార్యములకు ప్రసన్నమైనదిగా నుండును.

6) పైన చెప్పిన కార్యములను చంద్రుడు 1, 2 లేక 3 బిందువులు గల రాశులందు చరించు సమయములలో చేపట్టినచో నిష్ఫలములుగా నిరూపితములగును.

7) హెచ్చు బిందువులు (చంద్రాష్టక వర్గునందు)గల బిందువులయొక్క రాశులందు జన్మించిన వ్యక్తులతో ఉదయ ప్రారంభ సమయములలో జరుపు సమావేశములు (జాతకునకు) ఫలప్రదముగానూ, లాభదాయకముగానూ నిరూపితములగును.

8) పెండ్లి కుమార్తె జాతకములో (చంద్రాష్టక వర్గులో) హెచ్చు బిందువులు గల రాశి పెండ్లి కుమారుని జన్మరాశి అయినచో వైవాహిక జీవితము సంతోషప్రదముగా నుండును. అదే విధముగా పెండ్లి కుమారుని జాతకములో (చంద్రాష్టక వర్గులో) హెచ్చు బిందువులు గల రాశి పెండ్లి కుమార్తె జన్మరాశి అయినచో వైవాహిక జీవితము సంతోష ప్రదముగా నుండును.

## కుజ

9) కుజుడు (తన అష్టక వర్గునందు) హెచ్చు బిందువులు గల రాశినందు చరించు సమయము భూములు, ఇండ్లు, ఇతర స్థిరాస్థులు కొనుగోలు చేయుటకు, వివాదములలో తలదూర్చుటకు అనుకూలముగా నుండును.

10) హెచ్చు బిందువులు గల రాశి (కుజాష్టక వర్గునందు) సూచించు దిశనందు వంటగడి వున్నచో లాభదాయకముగ నుండును

## బుధ

11) బుధాష్టక వర్గులో హెచ్చు బిందువులుగల రాశినందు బుధుడు చరించు సమయమునందు విద్య, సాహిత్య సంబంధ కార్యములకు చర్చలు మొదలగునవి ప్రారంభింపబడినచో జయప్రదము అగును. ఇటువంటి సమయము వ్యాజ్యము (వివాదములు) లకు కూడా అనుకూలముగా నుండును. ఇట్టి రాశినందు రవి చరించు సమయముకూడా అనుకూలమగును.

12) బుధాష్టక వర్గునందు హెచ్చు బిందువులు గల రాశి ఉదయించు సమయములో శ్రీ మహావిష్ణువు కృపను పొందుటకు ఆ భగవంతుని పూజించవలెను.

## గురు

13) పారమార్థిక ఉపదేశము పొందుటకు, పాప పరిహారార్థము చేసుకొనుటకు, వేదములందలి విద్యలు అభ్యసించటానికి, ధన సంపాదనకు, మతపరమైన కార్యములను జరిపించుటకు, సంతానము పొందుట కొరకు, గురుడు తన అష్టక వర్గులో అతి హెచ్చు బిందువులుగల రాశినందు చరించు సమయము అత్యంత అనుకూలమైనది (శుభప్రదమైనది) అగును.

14) గురు అష్టక వర్గునందు అతి హెచ్చు బిందువులుగల రాశి సూచించు దిశ, ధనము, నగలు వుంచుటకు తగినది అగును.

15) దైవ స్తోత్రము చేయుట, అర్చన చేయుట, జపము చేసుకొనుట, మొదలగు కార్యములకు ప్రతిదినము పైన (13) నందు తెల్పిన రాశికి చెందు సమయము శుభప్రదముగా నుండును. పైన తెల్పిన అన్ని విషయములలో జయము నొందుటకు ఈ సమయము అనుకూలమైనది అగును.

16) పైన (15) నందు తెల్పిన సమయములో సంభోగము సల్పినచో సంతానము కల్గును.



## శుక్ర

17) శుక్రుడు తన అష్టక వర్గులో అతి హెచ్చు బిందువులు గల రాశిలో చరించు సమయమునందు సంగీతము నేర్చుకొనుట, వివాహము జరిపించుట, దుస్తులు కొనుగోలు చేయుట, శయ్యా సౌఖ్యముననుభవించుట మొదలగునవి చేయవలెను (శుభప్రదము).

18) పైన (17) నందు తెల్పిన రాశి సూచించు దిశయందు ఇంటియందలి పడకగది కల్గియుండుట, పెండ్లి కుమార్తెను పొందుట, ఘనత చెందిన వ్యక్తులను కలుసుకొనుట అనుకూలముగా వుండును.

## శని

19) శని తనయొక్క అష్టక వర్గులో అతి హెచ్చు బిందువులు గల రాశినందు చరించు సమయము కర్మాగారములను పొందుటకు వ్యవసాయ పనులు ప్రారంభించుటకు యుక్తమైనది అగును.

20) పైన (19) నందు తెల్పిన రాశి (సూచించు దిశ) ఇంటినందు మఱుగుదొడ్డి, పెరడులు కట్టుటకు వ్యవసాయ పనిముట్లు వుంచు స్థలమునకు, పంట చెరకు వగైరా ఇంధనములు వుంచు కొట్టు (గిడ్డంగి)లకు తగినది అగును.

## సర్వాష్టక వర్గు

21) సర్వాష్టక వర్గు నందు అతి తక్కువ బిందువులు గల రాశి ఉదయించు సమయములో ప్రారంభించిన చికిత్స త్వరగా కోలుకొనుటకు సహకరించును.

22) సత్కార్యములకు, ప్రయాణములకు, అన్నివిధములైన శుభకార్యములకు, సర్వాష్టకవర్గు నందు 30కి పైన బిందువులుగల రాశులు ఉదయించు సమయములను ఎంచుకొనవలెను.

## రాహు అష్టక వర్గు

చాలా జ్యోతిష ప్రామాణిక గ్రంథాలయందు రాహు అష్టకవర్గు గురించి ప్రస్తావన లేదు. కానీ "శంభు హోర ప్రకాశ" గ్రంథము అష్టకవర్గు వివరణలో

రాహువును కూడా పరిగణించు చున్నది. ప్రామాణిక అధికారులు బిందువుల మొత్తము సంఖ్య 337గా అంగీకరించారు. రవ్యాది ఏడు గ్రహములూ వానియొక్క సంబంధముగానూ, లగ్నాదిగానూ ఈ బిందు ప్రదానము చేయుచున్నవి. అయితే రాహువు ఛాయా గ్రహము (లేక చంద్రునియొక్క ఉదయ గ్రహపాతము) మాత్రమే గనుక అష్టకవర్గు కల్పన నుండి రాహువుయొక్క మినహాయింపు గ్రహించదగినది అగును. సాధారణ అష్టక వర్గు కల్పనలో ఒక భాగము కాకపోయినప్పటికీ పాఠకుల సమాచారం కోసం నేను రాహువును కూడా నిర్వహిస్తాను.

రాహు అష్టక వర్గు నందు రాహువు

| | | |
|---|---|---|
| రవి వున్న రాశి నుండి | 1-2-3-5-7-8-10 | రాశులలో శుభుడు |
| చంద్రుడు వున్న రాశినుండి | 1-3-5-7-8-9-10 | రాశులలో శుభుడు |
| కుజుడు వున్న రాశినుండి | 2-3-5-7-8-12 | రాశులలో శుభుడు |
| బుధుడు వున్న రాశినుండి | 2-4-7-8-12 | రాశులలో శుభుడు |
| గురుడు వున్న రాశినుండి | 1-3-4-6-8 | రాశులలో శుభుడు |
| శుక్రుడు వున్న రాశినుండి | 6-7-11-12 | రాశులలో శుభుడు |
| శని వున్న రాశినుండి | 3-5-7-10-11-12 | రాశులలో శుభుడు |
| లగ్నం వున్న రాశినుండి | 3-4-5-9-12 | రాశులలో శుభుడు |

మొత్తం 44 బిందువులు

ఏడు గ్రహాల నుండి, లగ్నం నుండి శుభస్థానములు లెక్కింపబడినా రాహువు నుండి మాత్రము శుభస్థానాలు లెక్కింపబడకపోవుటము పైన తెల్పిన రాహు అష్టక వర్గునందు గుర్తింపవచ్చును. రాహువుకు కాకుండా రవ్యాది ఏడు గ్రహములకు వర్తిల్లుతూ మాత్రమే తగ్గింపులు, తగ్గింపబడిన సంఖ్యలు ఎంచబడ్డాయి. అందువలన రాహు అష్టక వర్గుకు చెందినంత వరకూ త్రికోణ, ఏకాధిపత్య శోధనలను వర్తింపజేయవలసిన అవసరము లేదు.



ప్రామాణిక జాతకంలో రాహు అష్టకవర్గు ఈ విధంగా ఉంది.

| | | | |
|---|---|---|---|
| 4 | 4 | 4 | 4 |
| 3 | చక్రం-26 | | 2 |
| లగ్నం 4 | | | 3 |
| 3 | 4 రాహు | 4 | 5 |

అధ్యాయం-11లో సూచించిన పద్ధతుల ప్రకారం రాహు మహాదశ ఫలితాలను అంచనా వేయటం కోసం పైన తెల్పిన బిందువులను ఉపయోగించవచ్చును.

రాహువుయొక్క ప్రస్తార చక్రమును కూడా తయారు చేయవచ్చును. కానీ రాహువుకు ఎట్టి కక్ష్య ప్రత్యేకింపబడలేదు. అధ్యాయం-12 నందు వివరించడిన గోచార ఫలితాలను వివరించడానికి రవ్యాది ఏడు గ్రహములకు, లగ్నమునకు చెందు కక్ష్యలయందు రాహువు యొక్క సంచారమును ఎంచవచ్చును. జన్మరాశి లేక జన్మ చంద్రుని నుండి గల 12 స్థానములలో సంచరించేటప్పుడు రాహువు ఈ విధమైన ఫలితాలను యిస్తాడని చెప్పడుతున్నది.

(1) వ్యాధి, భయము, (2) ధన నష్టము, తగవులు, అపోహలు, (3) సంతోషము, శుభవార్తలు (4) వ్యాధి, ప్రమాదము, దుఃఖము, (5) ఆర్థికనష్టము, బాధ, (6) సౌఖ్యము, సంతోషము, (7) నష్టము, భయము, (8) ప్రాణమునకు ప్రమాదము, (9) తగవులు, మనో వ్యధ, నష్టము (10) శతృత్వము, (11) సంతోషము, ధన సంపాదన, (12) ఖర్చులు, ప్రమాదము.

రాహువు ఒక రాశిలో చరించేటప్పుడు ఋజు మార్గంలో చరించే గ్రహముల మాదిరిగా కాకుండా తనయొక్క వక్రగతి వలన వరుసగా లగ్న, చంద్ర, బుధ, శుక్ర, రవి, కుజ, గురు, శని కక్ష్యల క్రమంలో ఒక్కొక్క కక్ష్యనందు షుమారుగా 2 1/4 నెలలపాటు చరించును. చంద్రాదిగా ఆ భావంని అనుసరించి ఫలితాలు ఆధారపడి వుంటాయి. బిందు రహిత కక్ష్యనందు చరించు సమయంలో అశుభ ఫలితాలు కలుగుతాయి. ఇందుకు విరుద్ధంగా కక్ష్యనాధుని బిందువు వున్న రాశినందు చరించు సమయంలో శుభఫలితాలు కల్గుతాయి.

